





# మహిళలు

## విలువ,ధర్మాలు

## మానవ హక్కులు – మహిళల హక్కులు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120020479

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మానవ హక్కులు

# మహిళల హక్కులు

(బాలికల హక్కులు)

రచన

మల్లాది సుబ్బమ్మ

స్త్రీల హక్కుల పరిరక్షణా కేంద్రం
(CENTRE FOR WOMEN'S RIGHTS)
9, ఎం.ఐ.జి. హెచ్, మెహిదీపట్నం,
హైదరాబాద్ - 500 028.

అంతేకాదు అమెరికను, రష్యను విప్లవాల ధర్మమా అని మానవహక్కులను పేర్కొని, ప్రకటించి స్పష్టీకరించే ప్రయత్నాలు సాగాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో మేధావులు, జిజ్ఞాసాపరులు హక్కులను పునర్విచారణ చేయ తలపెట్టారు. ఐక్యరాజ్యసమితి ఉద్భవించి మానవ శ్రేయస్సుకు సంబంధించిన విశ్వ మానవ హక్కుల ప్రకటన 1948 సంవత్సర డిశంబరు 10వ తేదీన వెలువరించింది. అది బహుళ ప్రచారాన్ని పొందింది. అందులో మానవులంతా స్వేచ్ఛాపరులుగా, సమానమైన హూందా కలవారుగా జన్మిస్తున్నారు. స్వేచ్ఛా, సమానత్వాలు వారి జన్మహక్కు, హేతుత్వం, అంతరంగ అస్తిత్వం (నీతి గురించి) వారి విశిష్ట లక్షణాలు. జాతి, మత, వర్ణ, భాష, లింగ, శాఖ, ప్రాంత కుల సిద్ధాంతాలు అడ్డు రాకుండా మానవులందరూ సోదరభావంతో మెలగాలి. మానవహక్కులలో పేర్కొనబడిన హక్కులను స్వాతంత్ర్యాలను అనుభవించగలగాలి, ఆస్తి, అంతస్తు, పుట్టుక, హోదా, తెగ ఇవేవీ వివక్షకు ప్రాతిపదిక కోరాదు. ఎవరినీ దుర్మార్గానికి, అమానుషానికి, అవమానానికి పాత్రుల్ని చేయరాదు. ప్రతి మనిషి ఒక వ్యక్తిగా పరిగణింపబడాలి. అంటే ఏ వ్యక్తిని (స్త్రీని కూడా) వస్తువుగా, రెండవ తరగతి మనిషిగా చూడరాదని విశ్వమానవ హక్కులు వక్కాణించాయి. శాసనం దృష్టిలో అందరూ సమానులే కనుక శాసనం ఇచ్చే రక్షణ సంచార స్వాతంత్ర్యం, నివాస స్వాతంత్ర్యం, సభా స్వాతంత్ర్యం. పత్రికా స్వాతంత్ర్యం అందరికీ ఉన్నాయి. భావ స్వాతంత్ర్యం, అంతరంగ స్వాతంత్ర్యాలతోపాటు జాతి, మతం, దేశం వేరయినా పెళ్ళాడేహక్కు కూడా స్త్రీ పురుషులకు ప్రసాదించాయి. అలాగే ఈ హక్కులన్నీ స్త్రీలకు కూడా వర్తిస్తాయని వేరే చెప్పాల్సిన పనిలేదు.

మానవహక్కులు పలు తెరగులు. ప్రకృతి సిద్ధమైన హక్కులు. రాజ్యాంగం లోకాని లేక ప్రకటనలలో కాని పొందుపరచబడిన వాటిని మౌలిక హక్కులంటాము. కొందరు వాటిని ప్రాథమిక హక్కులని కూడా పిలుస్తారు. తతిమ్మా హక్కులకు ఏవి ప్రాతిపదిక అవుతాయో వాటిని అలా పేర్కొనడం కద్దు. శాసనంవల్ల ఉద్ఘాటించబడిన హక్కులను శాసనపరమైన హక్కులు అని పేర్కొంటాము ఇంక పుట్టుకతో వచ్చేవి ప్రకృతి సహజమైనవని (నేచురల్) చట్టపరమైన వాటిని లీగల్ రైట్సు అంటాం. ఈ హక్కులన్ని మానవ జీవితంతో ముడిపడి వుంటాయి. వాటి విలువ వర్ణనాతీతం. అలాంటి హక్కులకు తెలుసుకోవటం, ఆచరించటం, ప్రచారం చేయటం, అమల్లోకి తేవటం ప్రతి వ్యక్తియొక్క కనీస ధర్మం కావాలి. ఆనాడే హక్కులకు విలువ వస్తుంది.

# విశ్వమానవ హక్కుల ప్రకటన

మానవ హక్కులను నిరాకరించి, వాటిని నిరశించటంవల్ల అనాగరిక చర్యలకు, అవిచ్ఛిన్న పద్ధతులకు మార్గం కలిగి వ్యక్తి అంతరంగంలో క్షోభ పెరిగి ప్రపంచమంతటా అశాంతి వ్యాపించి మానవజాతి సంక్షోభంలో పడిపోయిందనే ఆందోళనే విశ్వమానవ హక్కుల ఆవిర్భావానికి నాంది పలికింది. స్వేచ్ఛ, న్యాయము, శాంతి మానవ హక్కులకు పునాదిరాళ్ళు. మానవుని సహజమైన హుందాతనాన్ని గుర్తించటానికి, కుటుంబ సభ్యుల సమానత్వ హక్కులను కాపాడటానికి, వాక్స్వాతంత్రము, విశ్వాస స్వాతంత్ర్యములాంటి హక్కుల పరిరక్షణ కొరకు మానవ హక్కుల అవసరం ఏర్పడింది. భయం, దారిద్ర్యం, నిర్బంధం లాంటి దుశ్చర్యల విముక్తికి అవకాశమిచ్చే ప్రపంచ ఆవిర్భావానికి మానవ హక్కులు పెట్టలు కోటలు. సర్వమానవులకు సమానంగా వర్తించే ఈ హక్కులను సర్వులూ అనుభవించకుండా చేసే హక్కు ఎవ్వరికీ లేదు. అందుకు వ్యతిరేకంగా ఎవరయినా దౌర్జన్యంగా, నిరంకుశంగా ప్రవర్తించి వాటిని అణచాలని ప్రయత్నిస్తే ప్రజలలో తిరుగుబాటు వచ్చే ప్రమాదం వుంటుంది. అలా జరగకుండా వుండాలంటే వారి హక్కులు పరిరక్షింపబడాలి.

మౌలిక మనవ హక్కులు, మానవుని హుందాతనం, ప్రయోజకత్వం, స్త్రీ పురుష సమానత్వం, స్వేచ్ఛ, శాంతి వీటిని గౌరవించి తద్వారా మెరుగైన జీవన ప్రమాణాలను సాధించాలనే లక్ష్యంతో ఐక్యరాజ్య సమితి విశ్వమానవ హక్కులను ప్రకటించింది. ఐక్యరాజ్య సమితి ప్రకటించిన మానవ హక్కులను సభ్య దేశాలన్నీ ఆమోదించి, వాటిని అమలుపరచడానికి తమ వంతు సహకారాన్ని అందిస్తామని తమ అంగీకారాన్ని తెలియజేశాయి. ఐక్యరాజ్య సమితిచే ప్రకటించబడిన ఈ విశ్వమాసవ హక్కులను అందరు వ్యక్తులు, అన్ని సంఘాలు అవగాహన చేసుకుని, తమ ప్రబోధం ద్వారా వాటిని ఫలవంతం చేయడానికి ప్రతిజ్ఞ పూనాలి. ఈ హక్కులు సమర్థవంతంగా అమలుపరచడానికి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలలో అభ్యుదయకరమైన చర్యలను చేపట్టాలి. ఇలా చేయాలంటే ముందుగా ఆ హక్కులేమిటో మనం వివరంగా తెలుసుకోవాలి.

9. అడ్డదిడ్డంగా ఎవరిని అరెస్టు చేయడంగాని, జైలులో వుంచడంగాని, ప్రవాసమునకు పంపుటకుగాని వీలులేదు.

10. తన హక్కుల విషయంలో, తన బాధ్యతలకు సంబంధించి లేక అతనిపై ఏదయినా నేరారోపణ చేయబడితే అతడు స్వతంత్రమైన, నిష్పక్షపాతమైన న్యాయస్థానం ఎదుట బహిరంగమైన, సమంజసమైన న్యాయవిచారణ సమానత్వ సిద్ధాంతముపై ఆధారపడిన హక్కును ప్రతి వ్యక్తి కలిగివున్నాడు.

11. (1) తన రక్షణకు అవసరమైన అవకాశాలు గ్యారంటీ చేయబడిన బహిరంగ న్యాయ విచారణలో లా ప్రకారం ఏ వ్యక్తినయినా దోషిగా నిర్ణయించే వరకు నేరారోపణ చేయబడిన వ్యక్తిని నిర్దోషిలాగానే పరిగణించాలి.

(2) నేరం చేసిన సమయంలో జాతీయ లేక అంతర్జాతీయ శాసనాల ప్రకారము ఏ వ్యక్తి చర్యగానీ లేక ఉపేక్షా వైఖరిగాని నేరం కాకపోతే, అతన్ని నేరస్తుడుగా పరిగణించ వీలులేదు. నేరంచేసిన సమయంలో నిర్ణయించబడిన శిక్షకన్నా ఎక్కువ శిక్షను అతనిపై విధించడానికి వీలులేదు.

12. ఒక వ్యక్తి యొక్క ఏకాంతత, కుటుంబం, సంసారం, ఉత్తర ప్రత్యుత్తరాలు వీటి విషయంలో అడ్డదిడ్డంగా జోక్యం కల్పించుకోరాదు; అలాగే అతని పేరుప్రఖ్యాతులపై దాడి చేయరాదు.

13. (1) ఏ దేశంలోనయినా, ఎక్కడయినా నివసించటానికి, సంచరించటానికి ప్రతివాసికి హక్కు వున్నది.

(2) తన దేశాన్ని లేక ఇతర దేశాన్ని వదిలిపెట్టడానికి తన దేశానికి తిరిగి రావటానికి ప్రతివారికి హక్కు వున్నది.

14. (1) తనను వెంటాడి క్రూరంగా తన యెడల ప్రవర్తిస్తుంటే దానినుండి రక్షణ పొందడానికి, ఇతర దేశాలలో ఆశ్రయం అడగటానికి, పొందడానికి ప్రతి వ్యక్తికి హక్కున్నది.

(2) రాజకీయేతర నేరాల విషయంలోనూ, ఐక్యరాజ్య సమితి సూత్రాలు, ప్రయోజనాలకు భిన్నమయిన చర్యల సందర్భంగాను ఈ పై హక్కును వాడుకొనడానికి వీలులేదు.

15. (1) ప్రతివానికీ ఏదో ఒక జాతీయ పౌరసత్వం కలిగివుండటానికి హక్కువున్నది.

(2) ఏ వ్యక్తి యొక్క జాతీయ పౌరసత్వంను తీసివేయడంగాని, దానిని మార్చుకొనుటకు హక్కును నిరాకరించడంగాని, అడ్డదిడ్డంగా- అంటే న్యాయ సూత్రాలకు భిన్నంగా జరగరాదు.

16. (1) జాతి, మత, దేశ వివక్షతతో నిమిత్తం లేకుండా వయోజనులైన స్త్రీ పురుషులు వివాహమాడటానికి, కుటుంబం నెలకొల్పుకోవటానికి హక్కు వున్నది. వివాహం విషయంగాను, వైవాహిక జీవితంలోను, వివాహం రద్దు విషయంలోను స్త్రీ పురుషులకు సమాన హక్కులు వున్నాయి.

(2) వివాహమాడదల్చుకున్న వధూవరుల స్వేచ్ఛాయుతమైన, సంపూర్ణమైన సమ్మతిపైననే వివాహము జరగాలి.

(3) సంఘం ఒక సహజమైన, మౌలికమైన ప్రాతిపదిక భాగం (యూనిట్). కుటుంబము, సమాజము, రాజ్యము దానిని పరిరక్షించాలి.

17. (1) వ్యక్తిగతంగాగాని, ఇతరులతో కలిసిగాని ఆస్తి కలిగివుండటానికి ప్రతి వానికి హక్కున్నది.

(2) న్యాయసూత్రాలకు భిన్నంగా ఎవరి ఆస్తిని అతనికి లేకుండా చేయరాదు.

18. భావస్వాతంత్ర్యము, విశ్వాస స్వాతంత్ర్యము, మత స్వేచ్ఛ వీటిని ప్రతి వ్యక్తి కలిగివుండటానికి హక్కు వుంది. తన విశ్వాసాన్ని, మతాన్ని మార్చుకోవటానికి, తాను ఒక్కడుగాని, ఇతరులతో కలిసిగాని బహిరంగంగాను, రహస్యంగాను తన మతాన్ని లేక విశ్వాసాన్ని ప్రబోధించటానికి, ఆచరించటానికి, అమలుపరచటానికి, పూజల ద్వారా జరుపుకోవటానికి గల హక్కు పైన పేర్కొనబడిన హక్కులో అంతర్భాగమై వున్నది.

19. ఏ అభిప్రాయమైనా కలిగివుండటానికి, భావ ప్రకటనకు ప్రతివానికి హక్కున్నది. ఇతరుల జోక్యం లేకుండా భావస్వేచ్ఛ కలిగివుండడము, ప్రాంతీయ, దేశ పరిధులతో నిమిత్తం లేకుండా అన్ని సాధనాల ద్వారా భావాలను, సమాచారాలను అన్వేషించుట, పొందుట, అందించుట పైన పేర్కొనబడిన హక్కులో భాగమై వున్నది.

20\. (1) శాంతియుతంగా సమావేశమగుటకు, సంఘ నిర్మాణము చేసుకొనుటకు ప్రతివానికి హక్కున్నది.

(2) బలవంతంగా ఎవరినీ ఏ సంఘంలో చేర్చటానికి వీలులేదు.

21\. (1) ప్రత్యక్షంగాగాని లేక తమచే స్వేచ్ఛగా ఎన్నుకోబడిన ప్రతినిధుల ద్వారా గాని దేశ పరిపాలనలో పాలుపంచుకోటానికి ప్రతి వ్యక్తికి హక్కున్నది.

(2) తన దేశంలో ప్రభుత్వోద్యోగాలలో పాల్గొనుటకు ప్రతి వ్యక్తికి హక్కు వున్నది.

(3) ప్రజల యొక్క సంకల్పమే ప్రభుత్వాధికారానికి ప్రాతిపదిక. నిర్ణీతమైన గడువులలో జరిగే వాస్తవమైన ఎన్నికల ద్వారా విధిగా ఈ ప్రజా సంకల్పం బహిర్గతం కావలసి వున్నది. సర్వులకు వర్తించే సమాన ఓటింగ్ హక్కు ద్వారా ఆ ఎన్నికలు జరగాలి; ఆ ఎన్నికలు రహస్య ఓటింగ్ పద్ధతిపైనగాని, అందుకు సమానమైన స్వేచ్ఛాయుత ఓటింగ్ విధానం పైనగాని ఆధారపడాలి.

22\. సమాజంలో సభ్యుడుగా ప్రతి వ్యక్తికి సాంఘిక భద్రతకై హక్కు కలదు. తన హుందాతనానికి, తన వ్యక్తిత్వ స్వేచ్ఛాయుత వికాసానికి తప్పనిసరిగా ఆవసరమైన సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక హక్కులను జాతీయ కృషి ద్వారాను, అంతర్జాతీయ సహకారంతోనూ పొందవచ్చు. అందుకు ఆయా దేశం యొక్క వనరులు సమాజ నిర్మాణాలను బట్టి అనుభవంలోకి తెచ్చుకోవడానికి ప్రతివారికి హక్కున్నది.

23\. (1) పనిచేయుటకు, తన పనిని తాను ఎంపిక చేసుకొనుటకు, న్యాయమైన, అనుకూలమైన శ్రామిక స్థితిగతులు కలిగివుండుటకు, నిరుద్యోగ స్థితినుండి రక్షణకు ప్రతి వ్యక్తికి హక్కున్నది.

(2) వివక్షత లేకుండా సమానమైన పనికి సమాన వేతనము పొందుటకు అందరికీ హక్కు వున్నది.

(3) మానవ హుందాతనానికి తగిన జీవితాన్ని గ్యారంటీ చేయగలిగే న్యాయమైన

న్యాయమైన అనుకూలమైన పరిహారాన్ని తన శ్రమకు ప్రతిఫలంగా పొందవచ్చు. ఇతరములైన సాంఘిక రక్షణ పద్ధతుల ద్వారా ఆ పరిహారము నకు యింకా కొంత వరుమానం కలుపబడగలదు.

(4) తన శ్రేయస్సును పరిరక్షించుకోటానికి కార్మిక సంఘాలను నిర్మించుకొనుటకు, అట్టి సంఘాలలో చేరుటకు హక్కున్నది.

24. పనిగంటలను సహేతుకంగా తగ్గించటము, జీతముతో నిర్ణీత వ్యవధులతో సెలవులు మొదలగు వాటితో కూడిన విరామానికి, విశ్రాంతికి హక్కు కలదు.

25. (1) ఆహారము, దుస్తులు, ఇల్లు, వైద్య సహాయము, ఇంకా అవసరమైన సాంఘిక సేవా సదుపాయాలు మొదలగువాటిని తాను, తన కుటుంబం పొందగలిగే హక్కు, నిరుద్యోగము, అనారోగ్యము, అశక్తత, వైధవ్యము, వృద్ధాప్యము లేక తన ఆధీనములో లేని కారణాలవల్ల జీవనోపాధి లేకపోవటము ఇలాంటి పరిస్థితులలో భద్రత పొందే హక్కు వున్నది.

(2) మాతృత్వము, శైశవము ప్రత్యేక శ్రద్ధకు సహాయానికి అర్హమై వున్నవి. వైవాహిక స్థితిలోగాని, దానికి వెలుపలగాని కలిగే సంతానము వివక్షత లేకుండా సమానమైన సాంఘిక రక్షణ పొందగలదు.

26. (1) ప్రతివారు విద్యావంతులయ్యే హక్కు వున్నది. కనీసం ప్రాథమికదశలోనూ, మౌలికదశలోనూ వుచితంగా విద్య నేర్పించాలి. ప్రాథమిక విద్య నిర్బంధంగా వుండాలి. సాంకేతిక విద్య, వృత్తి విద్యలు అందరికి సామాన్యంగా అందుబాటులో వుండాలి. ప్రతిభ ప్రాతిపదిక పైన వున్నత విద్య సర్వులకూ అందే స్థితిలో వుండాలి.

(2) వ్యక్తిత్వము యొక్క సంపూర్ణ వికాసము, మానవ హక్కులు, మౌలిక స్వేచ్ఛల యెడ గౌరవాన్ని పెంపొందించుట అనేవి విద్యకు లక్ష్యాలుగా వుండాలి. విద్య అన్ని జాతులు, మతస్తులు, దేశాల మధ్య అవగాహన, సహనము, స్నేహములను అభివృద్ధి పరచాలి. శాంతిని నెలకొల్పుటకు ఐక్యరాజ్యసమితి చేసే కృషికి దోహదం చేయాలి.

(3) తమ పిల్లలకు గరపవలసిన విద్యను తల్లిదండ్రులు ప్రప్రథమంగా నిర్ణయించగలగాలి.

27 (1) సమాజం యొక్క సాంస్కృతిక జీవనంలో పాల్గొనుటకు, కళాకారులు కావటానికి, శాస్త్ర పురోభివృద్ధిలోను, దానివల్ల కలిగే లాభాలలోను భాగస్వాములు అగుటకు ప్రతివానికి హక్కున్నది.

(2) తాము రచించిన శాస్త్రీయ, సారస్వత, కళాత్మక రచనల వల్ల కలిగే నైతిక, భౌతిక సదుపాయాలను పొందడానికీ, వాటిని రక్షించుకోవటానికి ప్రతివానికి హక్కున్నది.

28. ఈ ప్రకటనలో పేర్కొనబడిన హక్కులు, స్వేచ్ఛలను అనుభవంలోనికి తీసుకొనిరాగల సామాజిక లేక అంతర్జాతీయ వ్యవస్థను కలిగివుండటానికి హక్కు.

29. (1) తన వ్యక్తిత్వ వికాసం సంపూర్ణంగా, స్వేచ్ఛగా జరగటానికి అవకాశమున్న సమాజ లో మాత్రమే ప్రతి వ్యక్తికి విధులుంటవి.

(2) ఇతరుల హక్కులు, స్వేచ్ఛలను గుర్తించి గౌరవించటానికి మాత్రమే అవసరమైనవి. నీతి, ప్రజాశాంతి, ప్రజాస్వామిక సమాజంలో సార్వజనీన శ్రేయస్సు వీటికి మాత్రమే అవసరమైనవి. అందుకోసము లా ప్రకారం విధింపబడిన పరిమితులకు లోనై మాత్రమే మానవ హక్కులు, స్వేచ్ఛలు కుదింపబడాలి.

(3) ఐక్యరాజ్య సమితి సూత్రాలు ప్రయోజనాలకు భిన్నంగా ఈ హక్కులను కోరుటకు వీలులేదు.

30. ఈ ప్రకటనలో పేర్కొనబడిన హక్కులు, స్వేచ్ఛలకు భంగకరమైన చర్యలకు పాల్పడటానికి అలాంటి కార్యాచరణకు పూనుకోడానికి ఏ దేశానికి, ముఠాకు, వ్యక్తికి అధికారంలేదు. అలావున్నదని ఈ ప్రకటనలో ఎ భాగానికి భాష్యం చెప్పవీలులేదు అని విశ్వమానవ హక్కుల ప్రకటన పునరుద్ఘాటన చేసింది.

# విశ్వమానవ హక్కుల వివరణ

ప్రకృతి పరిణామంలో మానవజాతి ఆవిర్భవించింది. ఈనాటికి మనగల్గు తున్న జీవులలో మానవులు ఉత్కృష్టజీవులు తమ మేధస్సు వలన వారు తమను గుర్తించగలుగుతున్నారు. చుట్టూ ఉన్న సమాజాన్ని అవగాహన చేసుకుంటున్నారు. ప్రకృతి రహస్యాలను వెలికితీసి ప్రకృతి శక్తులను వాడుకోగలుగుతున్నారు.

మానవులు సంఘజీవులు. సమాజంలోనే వారి శక్తియుక్తులు విలసిల్లుతాయి. సమాజంలో మానవ వ్యక్తి జీవిత విధాన సందర్భంగా అతనికి హక్కులూ బాధ్యతలూ ఏర్పడతాయి. అనేక విధాలయిన మానవ హక్కులు వున్నాయి. మానవ వ్యక్తికి పుట్టుక వల్ల వచ్చేవి ప్రకృతి సిద్ధమైన హక్కులు. రాజ్యాంగంలో కాని లేక ప్రకటనలకాలోని పొందుపరచబడిన వాటిని మౌలిక హక్కులంటాము. కొందరు ప్రాథమిక హక్కులని కూడా పిలుస్తారు తతిమ్మా హక్కులకు ఏవి ప్రాతిపదిక అవుతాయో వాటిని అలా పేర్కొనడం పద్దు. శాసనం వల్ల ఉద్ఘాటించబడిన హక్కులను శాసనపరమైన హక్కులుగా పరిగణిస్తాం.

ఇన్నివేల సంవత్సరాలుగా సమాజం మానవుల బాధ్యతలను గురించి మాత్రమే శ్రద్ధ వహించింది. కాని ఫ్రెంచి, అమెరికను, రష్యను విప్లవాల ధర్మమా అని మానవ హక్కులను పేర్కొని, ప్రకటించి స్పష్టీకరించే ప్రయత్నాలు సాగాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో మేధావులు, జిజ్ఞాసాపరులు హక్కులను పునర్విచారణ చేయుతలపెట్టారు. ఐక్యరాజ్యసమితి ఉద్భవించింది. విశ్వమానవ హక్కుల ప్రకటన 1949 సంవత్సరం డిసెంబరు 10వ తేదీన వెలువడింది. అది బహుళ ప్రచారాన్ని పొందింది. ఆ ప్రకటనలోని హక్కులు విశ్వమానవ హక్కులుగా ప్రసిద్ధికెక్కాయి.

విశ్వమానవ హక్కుల ప్రకటనకు శాసనపరంగా, రాజ్యాంగపరంగా ప్రాతిపదిక లేదు. దానిని ప్రతి రాజ్యమూ విధిగా అమలుపరచవలసిన అగత్యం లేదు. దాని విలువ ప్రబోధాత్మకం; నైతికం. అంతే. అయినా ప్రపంచ ప్రజానీకపు పిలుపుగా దానికి ఎనలేని ప్రాముఖ్యత ఉంది. పెక్కు దేశాల ప్రతినిధులు పలుమార్లు సమావేశమయి సునిశితంగా, తీవ్రంగా చర్చించి రూపొందించినది ఆ ప్రకటన.

విశ్వమానవ హక్కుల ప్రకటన యొక్క ఉపక్రమణిక కూడా ప్రాధాన్యతను సంతరించుకున్నది. అందులో ఉటంకించిన అంశాలు, భావాలు ఎంతో కీలక మయినవి. మానవ కుటుంబ సభ్యుల స్వయం సిద్ధమైన హుందాను, తగ్గింప వీలు లేని హక్కులను గుర్తిస్తేనే ప్రపంచంలో స్వేచ్ఛా, న్యాయమూ, శాంతీ, సుస్థిరం అవుతాయి. మానవులు నియంతృత్వాన్ని, నిరంకుశత్వాన్ని కూలద్రోయటానికి తిరుగుబాటు చెయ్యవలసిన అవసరం తప్పిపోవాలంటే న్యాయసూత్ర పాలన ద్వారా మానవ హక్కులకు రక్షణ ఏర్పడాలి. అంతర్జాతీయ స్థాయిలో రాజ్యాల మధ్య స్నేహ సౌహార్ద్రాలు కొనసాగాలంటే మానవ హక్కుల పరిగణన అత్యవసరం. ఐక్యరాజ్య సమితి వారి స్థాపక ప్రకటనలో పేర్కొన్న మానవహుందా, మానవ జీవిత సార్థక్యం, మౌలిక హక్కుల పట్ల విశ్వాసం, స్త్రీ పురుష సమానత్వం సామాజికాభ్యుదయానికి, జీవన ప్రమాణపు పెరుగుదలకు తద్వారా విస్తృత స్వేచ్ఛా వాతావరణ సృష్టికి తోడ్పడతాయి.

ఐక్యరాజ్య సమితి సభ్యదేశాలు మానవహక్కులను పరిరక్షించడానికి కృత నిశ్చయాన్ని వెలిబుచ్చటం వల్ల తమలో తమకు సహకారభావాన్ని పెంచుకున్నారు ఇట్టి పరిస్థితులలో మానవ హక్కుల సదవగాహన, వాటిని అనుభవంలోకి తేవాలనే సంకల్పం విశ్వమానవ హక్కుల ప్రకటనకు దారితీశాయి. ఎంత ఉదాత్తంగా వుందో ఈ ఉపక్రమణిక (Preamble).

విశ్వమానవ హక్కుల ప్రటన కేవలం రాజ్యాల కొరకు ఉద్దేశించబడినది కాదు. వ్యక్తులూ, సమాజాలూ, సంస్థలూ, రాజ్యాలు సర్వులూ పాటించటానికి తయారుచేయబడింది. ఈ హక్కులను విద్య ద్వారా, ప్రబోధం-ద్వారా ప్రచారం చేయటం వల్ల ఈ హక్కులపై శ్రద్ధా గౌరవాలను ఇనుమడింపచేయాలి. ప్రపంచ ప్రజల మన్నన చేకూర్చాలి. వీటికి వాస్తవ రూపం కల్గించేలా జాతీయ రంగంలో, అంతర్జాతీయ రంగంలో కృషి చేయాలి. ఈ ప్రకటనలో 30 అధికరణలున్నాయి. 29వ అధికరణంలో మానవ వ్యక్తికి సమాజం యెడగల బాధ్యతను గట్టిగా చెప్పడం జరిగింది, సమాజంలోనే మనిషి యొక్క వ్యక్తిత్వం స్వేచ్ఛగా, పూర్తిగా వికసించ గలదనే సత్యాన్ని పునరుద్ఘాటన చేసింది ప్రకటన. 30వ అధికరణంలో ఒక హెచ్చ

రిక ఇమిడి ఉంది. 'ఏ వ్యక్తి గాని, మానవ సముదాయం గాని, రాజ్యాంగం గాని ఈ హక్కులు, స్వాతంత్ర్యాల విధ్వంసానికి పూనుకోరాదు' అనేది ఉద్బోధ. దీని అంతరార్థాన్ని చాలమంది గ్రహించటం లేదు. ఎవరయితే ఇతరుల హక్కులను, స్వాతంత్ర్యాలను కాలరాస్తారో వారు తమ హక్కులను, స్వాతంత్ర్యాలను కోరతగదని దాని సారాంశం.

మానవుల హక్కులు స్వాతంత్ర్యాలు ఒకటి నుండి 28 అధికరణాలలో పేర్కొనబడినాయి. వాటిని కొంచెం వివరంగా ఎరుకపర్చటం విధిగా పరిగణించాలి.

మానవులందరు స్వేచ్ఛాపరులుగా, సమానమైన హుందాగల వారయి జన్మిస్తున్నారు. అంటే వారికి స్వేచ్ఛ, హుందా జన్మతః ప్రాప్తించిన హక్కులు వారికి హేతుత్వం, అంతరంగ అస్తిత్వం విశిష్ట లక్షణాలు. కనుక మానవులందరూ సోదరభావంతో మెలగాలి (1). జాతి, మత, వర్ణ, భాష, లింగ, శాఖా, ప్రాంత, కుల, సిద్ధాంత భేదాలు అడ్డురాకుండా ప్రతి మానవ వ్యక్తి ప్రకటనలో పేర్కొన బడిన హక్కులను, స్వాతంత్ర్యాలను అనుభవించగలగాలి. అలాగే ఆస్తి, అంతస్తు, పుట్టుక, హోదా, తెగ ఇవేవీ విచక్షతకు ప్రాతిపదిక కారాదు. సమాజ స్వభావం, భావజాలం తేడా చూపటానికి దోహదకారులు కారాదు (2). జీవించడానికి స్వేచ్ఛగా మనటానికి, భద్రత కలిగి ఉండటానికి ప్రతి వ్యక్తికి హక్కు వుంది (3). ఎవరూ బానిసత్వానికి లోను కారాదు; తాబేదారుతనానికి లోను కారాదు. బానిసత్వం, అర్ధ బానిసత్వం నిషేధింపబడాలి (4). ఎవరూ క్రూర హింసకు తలవగ్గవలసిన పనిలేదు అలాగే ఎవరినీ దుర్మార్గానికి, అమానుషానికి, అవమానానికి పాత్రుని చేయరాదు. (5). ప్రతి మనిషి ఒక వ్యక్తిగా పరిగణింపబడాలి. అంటే అతనిని ఒక వస్తువుగా, ఆస్తిగా, పరిగణించరాదని భావం. అంతేకాదు, రెండవ తరగతి మనిషిగా చూడ రాదని అర్థం (6). శాసనం యొక్క దృష్టిలో అందరూ సమానులు. శాసనం ఇచ్చే రక్షణ అందరికీ సమానంగా వుండాలి. ప్రకటనలోని హక్కులు కాలరాయటం సంభవిస్తే బాధితులకు సమానంగా, వివక్ష లేకుండా రక్షణ యివ్వాలి (7). మౌలిక హక్కులకు భంగం కలిగితే పరిహారం ఇవ్వటానికి జాతీయ న్యాయస్థానాలు ప్రతి దేశంలోనూ ఉండాలి (8). ఏ వ్యక్తినీ అక్రమంగా అరెస్టు చేయరాదు; నిరవధిక బందీగా తీసుకోరాదు. దేశబహిష్కారం చేయరాదు (9). ఒక వ్యక్తి యొక్క

హక్కులు, బాధ్యతలు వీటిని నిర్ధారించుటకు అతనిపై నేరం విచారించడానికి స్వతంత్ర ప్రతిపత్తిగల నిష్పక్షపాత న్యాయవేదిక ఉండాలి. అప్పుట అతనిని బహిరంగంగా విచారించాలి. అతనిని వివక్షతో చూడకుండా అందరితో సమానంగా చూడాలి (10). ఎవరిపైన అయినా నేరం ఆరోపించబడితే నేరం రుజువు అయ్యే వరకు అతనిని నిర్దోషిగనే భావించాలి. అతను ఉత్తరసాక్ష్యం పెట్టుకోటానికి, ప్రతివాదన చేయటానికి అవకాశం ఉండాలి. అంతేగాక నేరం చేయబడిన సమయాన అతని ప్రవర్తనను నేరంగా పరిగణించే శాసనం ఉంటేనే తప్ప అతనిని శిక్షింపరాదు. అంటే అతని చర్య దరిమిలా ఆ చర్యను నేరంగా పరిగణించే శాసనం వస్తే అతడు దోషి కాడన్నమాట. ఒకవేళ అతనిది నేరమయినా ఆనాటి శాసనంలో పేర్కొనబడిన శిక్ష కన్న ఎక్కువ శిక్ష వేయరాదు (11). ప్రతి మనిషికీ ఏకాంతతకు హక్కు ఉన్నది. అతని ఏకాంతంపై, కుటుంబంపై, ఉత్తర ప్రత్యుత్తరాలపై, అతని పేరు ప్రతిష్టలపై ఎవరూ దాడిచేయరాదు; జోక్యం కల్గించుకోరాదు. అలాంటి జోక్యమూ; దాడులు జరుగకుండా అతడు లేక ఆమె రక్షణ పొందటానికి అవకాశం ఉండాలి (12). ప్రతి మనిషికి సంచార స్వాతంత్ర్యం, తన దేశం లోపల నివాస స్వాతంత్ర్యమూ ఉన్నాయి. ఏ దేశాన్ని అయినా, చివరకు తన దేశాన్ని అయినా వదలిపెట్టి వెళ్ళటానికి ప్రతి మనిషికీ హక్కు ఉంది అలాగే తిరిగి తన దేశానికి తిరిగి రావడానికి ఆ వ్యక్తికి హక్కు వుంది (13) పగతో కూడిన హింస నుండి, కక్ష సాధింపు నుండి తప్పించుకునే నిమిత్తం ప్రతి వ్యక్తి ఇతర దేశాలలో ఆశ్రయం కోరడానికి, పొందడానికి హక్కు ఉంది (14). ప్రతి మనిషికి జాతీయ పౌరసత్వం హక్కుగా ఉండాలి. తన జాతీయతను మార్చుకోడానికి ప్రతి ఒక్కరికి హక్కు వుంది. అక్రమంగా ఎవరి పౌరసత్వాన్ని తీసివేయరాదు (15). అనేది విశ్వమానవ హక్కులలో చాలా ముఖ్యమయినది.

యుక్తవయస్సు వచ్చిన స్త్రీ పురుషులు, జాతి, దేశం, మతం వేరయినా వివాహమాడటానికి, కుటుంబాన్ని నెలకొల్పుకోడానికి హక్కుదారులు. అంటే ఏ వ్యక్తి అయినా వివాహమాడవచ్చు లేక అవివాహ స్థితిలో వుండవచ్చు అన్నమాట. వివాహమపుడు, వివాహ దశలో, వివాహం రద్దయే సందర్భాన స్త్రీ పురుషులకు

సమాన హక్కులు వుంటాయి. స్వేచ్ఛాయుతమైన సంపూర్ణమైన సమ్మతితో మాత్రమే వివాహాలు జరగాలి. కుటుంబం సమాజానికి సహజమైన ప్రాతిపదిక; మౌలికమైనది కూడాను. సమాజము, రాజ్యమూ కుటుంబ ప్రాశస్త్యాన్ని ప్రాధాన్యతనూ రక్షించాలి 16. స్వంతాన గానీ, ఇతరులతో కలసి గానీ ఆస్తి కలిగి వుండటానికి ప్రతి వ్యక్తికీ హక్కు వుంది. ఎవరి ఆస్తినీ అక్రమంగా ఆ వ్యక్తి స్వాధీనం నుండి తప్పించ గాదు (17). భావ స్వాతంత్ర్యం, అంతరంగ స్వాతంత్ర్యం, మత స్వాతంత్ర్యం మానవులందరకు వుండాలి. మతాన్ని, విశ్వాసాన్ని మార్చుకునే హక్కు ఇందులో ఇమిడి వుంది. తను ఒక్కడుగా లేక ఇతరులతో కలిసి తన మతాన్ని లేక విశ్వాసాన్ని బహిర్గతం చేయడానికి ప్రతి మనిషి హక్కు కలిగి వున్నాడు. తన మతాన్ని, విశ్వాసాన్ని బోధించడానికి, ఆచరించడానికి, అమలు జరపడానికి తదను గుణంగా పూజలు, ప్రార్థనలు, ఆరాధనలు చేయడానికి ప్రతి ఒక్కరికీ అవకాశం వుండాలి (18). స్వంత అభిప్రాయం కలిగి వుండటానికి, భావ ప్రకటన చేయడానికి ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ వుంది. దేశాల భౌగోళిక సరిహద్దులతో నిమిత్తం లేకుండా, భావాలను, సమాచారాన్ని అన్వేషించడానికి, అందుకోడానికి, అందించడానికి ప్రతి మనిషికి వీలు వుండాలి. వీటి విషయంలో జోక్యానికి ఆస్కారం వుండరాదు (19). శాంతియుతంగా సమావేశమవడానికి పౌరులకు స్వేచ్ఛ వుంది. ఏ వ్యక్తినీ బలవంతంగా ఏ సంఘంలోనైనా చేరమని వత్తిడిచేయరాదు (20).

## పరిపాలనలో :

తన దేశ పరిపాలనలో ప్రత్యక్షంగా గానీ, లేక ఎన్నుకోబడిన ప్రతినిధుల ద్వారా గానీ ప్రతి పౌరుడు భాగస్వామ్యం వహించటానికి హక్కు వుంది. ప్రభుత్వోద్యోగాలలో వివక్ష లేకుండా, సమానంగా స్థానాన్ని పొందడానికి పౌరులకు హక్కు వుంది. పౌరుల సమ్మతిపైన ఆధారపడిన పరిపాలనే విధిగా సాగాలి. సర్వులకు, వివక్షలేకుండా, వర్తించే వోటు హక్కు ప్రాతిపదికగా నిర్ణీత గడువు సమయాలలో రహస్య వోటింగు ద్వారా పౌరుల సమ్మతి బహిర్గతం కావాలి. లేక మరే విధమైన స్వేచ్ఛాయుతమైన ఎన్నికయినా పరవాలేదు. అయితే ఎలాంటి ఎన్నికలయినా సక్రమంగా, న్యాయంగా, స్వేచ్ఛగా జరగాలి (21).

## ఆర్థిక హక్కులు :

సమాజంలోని ప్రతి సభ్యుడు సాంఘిక భద్రత పొందడానికి అర్హుడు. అతని లేక ఆమె స్వేచ్ఛాయుత వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడే అవసరమైన ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక హక్కులను, దేశ వనరులు, నిర్మాణం వీటి శక్తిని సంప దను బట్టి, రాజ్యం యొక్క ప్రయత్న ఫలితంగా గాని లేక అంతర్జాతీయ సహకార బద్ధి వల్ల గాని అనుభవించవచ్చును (22).

పనిచేసే హక్కు ప్రతి వ్యక్తికీ ఉంది. అతనీ ఉద్యోగాన్ని నిర్ణయించుకునే సదుపాయం అతనిది. పని పరిస్థితులు న్యాయంగా ఉండాలని, అనుకూలంగా ఉండా లని అతడు ఆశించవచ్చు; నిరుద్యోగభృతికి అర్హత ఉంది. సమానమైన పనికి సమానమయిన జీతం ఉండాలి. ప్రతి ఒక్కరూ తనకూ తన కుటుంబానికి సరిపడ తోడ్పాటుతో కూడిన జీవితాన్ని ప్రసాదించగల న్యాయమైన, అనుకూలమయిన భృతిని పొందడానికి హక్కు కలిగి ఉన్నారు. ఏ ఇతర విధమైన సాంఘిక రక్షణనయినా పొందవచ్చు. తమ శ్రేయస్సును, ప్రయోజనాలను రక్షించుకునే నిమిత్తం ఉద్యోగ స్థుల సంఘం, శ్రామిక సంఘం, కార్మిక సంఘం లాంటి సంస్థలలో సభ్యులుగా చేరుటకు అందరికీ హక్కుంది (23).

పనిలో విరామము, పని గంటలపై సహేతుకమయిన అదుపు, జీతంతో అప్పుడప్పుడు సెలవులు, విశ్రాంతి వీటికి ప్రతి మనిషికీ అర్హత ఉంది (24). తిండి, బట్ట, ఇల్లు, వైద్యం, సామాజిక సేవలు వీటితో కూడిన జీవన ప్రమాణాన్ని (తన యొక్క తన కుటుంబం యొక్క ఆరోగ్యమూ, సంక్షేమమూ వీటికి సరిపోయే దానిని) పొంద టానికి ప్రతి మనిషికీ హక్కు ఉంది. నిరుద్యోగం, వ్యాధి, అశక్తత, వైధవ్యం, వృద్ధాప్యం, తనకు అంటవికాని పరిస్థితి వల్ల జీవనోపాధి లేకపోవటం ఇవి సంభవించి నపుడు మనుగడ సాగించటానికి వలసిన భద్రత ప్రతి పౌరుడు హక్కుగా పొంద వచ్చును. మాతృత్వంయెడ, శైశవ దశయెడ ప్రత్యేక శ్రద్ధ వహించాలి. ఆ సంద ర్భంగా సహాయం చేయాలి. వివాహితలకు జన్మించినా, అవివాహితకు పుట్టినా పిల్లలందరిని సమదృష్టితో చూచి సామాజిక భద్రత కల్పించాలి (25).

## విద్యా విషయంగా :

విద్య ప్రతి వ్యక్తి జన్మ హక్కు. ప్రాథమిక దశలో, లేక ప్రాతిపదిక దశలో విద్య ఉచితంగా అందించబడాలి. ప్రాథమిక విద్య నిర్బంధంగా ఉండాలి. సాంకేతిక విద్య, వృత్తి విద్య సర్వసామాన్యంగా అందుబాటులో ఉండాలి. శక్తి యుక్తుల ఆధారంగా, ఉన్నత విద్య సమానావకాశాలతో అందరికీ లభించాలి. సంపూర్ణ వ్యక్తిత్వ వికాసమూ, మానవ హక్కులు మరియు ప్రాతిపదిక స్వాతంత్ర్యాలు వీటిని బలపరిచేటందుకు విద్య ఉద్దేశింపబడాలి. సహన భావాన్ని సదవగాహనను, స్నేహాన్ని దేశాల మధ్య, మత సమాజాల మధ్య, జాతుల మధ్య పెంపొందించటానికి, శాంతి స్థాపనకు విద్య సాధనంగా ఉండాలి. తమ సంతానానికి ఇచ్చే విద్యా విధానాన్ని తల్లిదండ్రులు నిర్ణయించగలగాలి (26).

## సాంస్కృతిక హక్కులు :

సమాజపు సాంస్కృతిక జీవనంలో స్వేచ్ఛగా పాల్గొనుటకు ప్రతి పౌరునికి యోగ్యత వుంది. కళల ద్వారా ఆనందాన్ని పొందటానికి సైన్సు యొక్క పురోగతి దాని ప్రయోజనాలలో పాలుపంచుకోవడానికి ప్రతి పౌరుడికి హక్కు వుంది. ఏ వ్యక్తి సృజనాత్మక శక్తి వల్ల శాస్త్రీయ, సాహిత్య, కళాత్మక రూపాన్ని తయారు చేస్తే తద్వారా కలిగే నైతిక, భౌతిక ప్రయోజనాలకు ఆ వ్యక్తే హక్కుదారుడు. ఈ హక్కుకు రక్షణ కూడా వుండాలి (27). విశ్వ మానవ హక్కుల ప్రకటన ఎలా ఆచరణలో వచ్చేది, ఎప్పుడు అమలులోకి వచ్చేది, ఎవరు వాటిని పరిరక్షించేది ఇదమిద్ధంగా చెప్పనందువల్ల ఇది కేవలము సత్సంకల్పాల సముదాయంగా మాత్రమే మిగిలిపోయింది. అందుకోసం కొన్ని అంతర్జాతీయ ఒప్పందాలను ఐక్యరాజ్యసమితి తయారు చేసింది. అవి 1966లో తయారయినాయి. అంటే విశ్వ మానవ హక్కుల ప్రకటన జరిగిన 18 ఏళ్ళకు గాను ఈ కృషి జరిగిందన్నమాట. వీటిని 1966లో రూపొందిస్తే 1976లో-35 దేశాలు అంగీకరిస్తామని ప్రకటించిన తరువాత-అమలులోకి వచ్చాయి. ఇవి విశ్వమానవ హక్కుల ప్రకటనకు విరుద్ధంగా లేవు. కాగా ప్రతి అంశానికి ఆచరణకు సంబంధించి కొన్ని పరిమితులను పేర్కొంటూ వ్రాయబడినాయి. అయినా అవి విశ్వమానవ హక్కుల ప్రకటన ప్రయోజనాన్ని, బలాన్ని కించపరచడం లేదు.

## పౌరహక్కుల, రాజకీయ హక్కుల అంతర్జాతీయ ఒప్పందం

ఇది 23 మార్చి 1976న అమలులోకి వచ్చింది. దీనిలో భయ నివారణకు, లేమి నుండి విముక్తికి ప్రాధాన్యత ఇచ్చారు. వ్యక్తి ఇతర వ్యక్తుల పట్ల, సమాజం యెడ బాధ్యతలు కలిగి వున్నాడనే విషయాన్ని దీని ఉపక్రమణికలో స్పష్టీకరించారు. ప్రజల యొక్క స్వయం నిర్ణయాధికార హక్కును పేర్కొనడం జరిగింది. విశ్వమానవ హక్కుల ప్రకటనలో హక్కులు ఏవో జాబితాగా వ్రాశారే తప్ప వాటిని ఆచరణలోకి తెచ్చే క్రమాన్ని వివరించలేదు. అవి ఈ ఒప్పందంలో చేశారు. అందువల్లనే ఒప్పందంలో 53 అధికరణాలు కన్పిస్తాయి. ఈ ఒప్పందం ప్రాకారం దాన్ని అంగీకరించిన రాజ్యాల వారు ఆ ఒప్పందంలోని హక్కులను అమలుపరచడానికి చేసిన కృషి, అభ్యుదయం వీటి నివేదికను ఐక్యరాజ్యసమితి నియమించే మానవ హక్కుల కమిటీకి సమర్పించాలి. 41వ అధికరణం క్రింద ఏదేశమైనా ఒక ప్రకటన చేస్తే అపుడు ఏ దేశమైనా ఆ ప్రకటన చేసిన దేశంలో మానవ హక్కులు కాలరాయబడుతున్నాయని మానవ హక్కుల కమిటీకి ఫిర్యాదు చేయవచ్చు. లేక సరాసరి ఆ దేశానికి తన అభ్యంతరం తెలియజేయవచ్చు. ఈ ప్రకటన చేయడం కేవలం ఐచ్ఛికమేనని విస్మరించరాదు.

## అనుబంధ ఐచ్ఛిక సమ్మతి పత్రం :

దీనిలో 14 అధికరణాలు వున్నాయి. ఇది దీన్ని అంగీకరించిన దేశాలకు మటుకే వర్తిస్తుంది. దీనికి తమ సమ్మతిని ఏదేశమైనా తెలియజేస్తే ఆ దేశంలోని పౌరులెవరైనా ఆ దేశంలో మానవహక్కులను అణచివేస్తున్నారని మానవ హక్కుల కమిటీకి ఫిర్యాదు చేయవచ్చని రెండవ అధికరణంలో వ్రాశారు. తతిమా అధికరణాలలో కమిటీ పనిచేసే తీరు, విచారణ చేసే విధానం వివరించబడ్డాయి.

## ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక హక్కుల అంతర్జాతీయ ఒప్పందం :

ఇది 1966 లో రూపొందించబడి 1976 లో అమలులోకి వచ్చింది. ఇది చాలా

విస్తృతమైనది. దీనిలో 31 అధికరణాలు వున్నాయి. దీన్ని అంగీకరించిన దేశాలు ఐక్యరాజ్యసమితి యొక్క ఆర్థిక, సామాజిక సమితికి నివేదిక పంపాలి. ఈ హక్కులను భద్రపరచడానికి తమ తమ రాజ్యాంగంలో అవసరమైన నియమాలను నిబంధనలను పొందుపరచాలి. ఈ ఒప్పందంలో పేర్కొన్న హక్కుల వివరణ, స్పష్టత కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది.

## భారతదేశం - ఒప్పందాలు :

భారతదేశం పై రెండు ఒప్పందాలకు తన సమ్మతి తెల్పలేదు. పౌరహక్కుల, రాజకీయ హక్కుల ఒప్పందంలో పేర్కొనబడిన 41వ అధికరణ ప్రకటనను చేయలేదు. అలాగే ఐచ్ఛిక సమ్మతి పత్రానికి అంగీకారం తెలుపలేదు. కాగా విశ్వమానవ హక్కుల ప్రకటనను స్థూలంగా అంగీకరించినట్లు లెక్క. చేతులూ, కాళ్ళూ లేని, అమలుపరచడానికి సాధన సామాగ్రి సమకూర్చని ప్రకటనను అంగీకరించినందువల్ల ఏం లాభం? ఈ చర్యల ఫలితంగా మరే దేశమూ మనదేశంలోని మానవ హక్కుల స్థితిని విమర్శించడానికి వీలులేదు. మనదేశ ప్రజలు, ఒకరైనా, పలువురైనా, మానవ హక్కులు మంటకలిశాయని ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల కమిటీకి ఫిర్యాదుచేసి న్యాయం చేకూర్చమనడానికి అవకాశం లేదు.

ఐక్యరాజ్యసమితిని గురించి సంవత్సరాల తరబడి ఉపన్యాసాలిస్తూ ప్రస్తుతం భద్రతా సమితి సభ్యత్వం కలిగివుంటూ మనదేశం ఈ రెండు ఒప్పందాలను, ప్రకటనను, సమ్మతి పత్రాన్ని ఒప్పుకొనకపోవటం శోచనీయం. ఇంతకూ అంత భయపడవలసిన పనిలేదు. ముఖ్యమైన రాజకీయ హక్కులను రాజ్యాంగంలో పొందుపరిచాం. సాంస్కృతిక హక్కులను మౌలిక హక్కుల జాబితాలో చేర్చాం. ఆర్థిక, సామాజిక హక్కులను ఆదేశిక సూత్రాలలో పేర్కొన్నాం. సామాజిక ఆర్థిక హక్కుల విషయంగా రూపొందించబడిన అంతర్జాతీయ ఒప్పందం కూడా దేశ వనరులు అనుమతించిన మేరకే ఆ హక్కులను అమలుపరచవలసి ఉంటుందని రెండవ అధికరణంలో స్పష్టంగా చెప్పింది. మన దేశపాలకులకు ఈ భయం ఎందుకో అర్థంకావటం లేదు.

# ప్రకృతి సిద్ధమైన మానవ హక్కులు

1976 జూలై 4వ తేదీన అమెరికా సంయుక్తరాష్ట్రాలు ద్విశత వార్షికోత్సవం జరుపుకున్నది. థామస్ జెఫర్‌సన్ 1776లో స్వాతంత్ర్య ప్రకటనా పత్రాన్ని రచించాడు. ఆయన అమెరికా దేశ నిర్మాతలలో ఒకరు. 1801 నుండి 1809 వరకు అమెరికా అధ్యక్షపదవి నిర్వహించాడు. ఆయన వ్రాసిన అనేక లేఖలలో కొన్నింటిని సంక్షిప్తంగా పొందుపరచడం ఈ సందర్భంగా అవసరమనిపించింది.

## 1776 స్వాతంత్ర్య ప్రకటన

ఈ దిగువ పేర్కొనబడిన సత్యాలకు వేరే రుజువు అక్కరలేదని మా విశ్వాసం. మానవులందరు సమానులుగానే జన్మించారు. జీవితం, స్వేచ్ఛ, ఆనందంకోసం కృషి ఇవి అలాంటి హక్కులు. ఈ హక్కులను భద్రపరచుకునే నిమిత్తం ప్రభుత్వాలను నెలకొల్పుకోవడం జరిగింది. పాలితుల సమ్మతిపైననే పరిపాలకుల అధికారం ఆధారపడి ఉంటుంది. ఈ లక్ష్యాలను ఎప్పుడైతే ప్రభుత్వము నాశనము చేస్తుందో ఆ ప్రభుత్వాన్ని మార్చటానికి, రద్దుచేయటానికి అంతేగాక ఈ సూత్రాలపైన ఆధారపడిన ప్రజల భద్రత ఆనందాలను సాధించటానికి అనువైనరూపము కల్గిన ప్రభుత్వాన్ని నెలకొల్పుకోవటానికి ప్రజలకు హక్కున్నది.

చీటికీమాటికీ ప్రభుత్వాలను మార్చడం తప్పు. కాగా అనేకపర్యాయాలు అధికార దుర్వినియోగం జరిగి, ప్రజల అధికారాలపై దురాక్రమణ జరుగుతూ వుండి నిరంకుశత్వానికి ప్రజలను దాసోహం చేయాలనే సంకల్పము కనపడితే అలాంటి ప్రభుత్వాన్ని త్రోసిరాజనడానికి ప్రజలకు హక్కున్నది. అది వారి విద్యుక్తధర్మం కూడాను. మున్ముందు తమ భద్రతకై రక్షణలు కూడా ఏర్పరుచుకోవాలి. (1776)

కొన్ని హక్కులను ప్రభుత్వాలకు దత్తంచేయరాదు. మామూలుగా ప్రభుత్వాలు వాటిపై దురాక్రమణ చేస్తుంటాయి. భావ స్వాతంత్ర్యం, ప్రకటనా స్వాతంత్ర్యం, వ్యక్తి స్వాతంత్ర్యం, వ్యాపార స్వాతంత్ర్యము అలాంటివి. అవి పరిపాలనకు ఉపకరించే సాధనాలు. వాటిని మార్చడానికి శాసనసభకు అధికారం ఇవ్వరాదు. (1789)

కొంతమంది జనులు పంచేంద్రియాలలో ఏదో ఒక లోపంతో పుట్టారు. కనుక మానవుడికి పంచేంద్రియాల ద్వారా జ్ఞానం సంపాదించే శక్తిలేదని అనలేము. అలాగే కొంతమంది ప్రజలలో నైతిక భావన లోపించినంత మాత్రాన మానవ జాతికి నైతిక భావనాశక్తి లేదనడం పొరపాటు. (1814)

మన శాసనసభ్యులకు వాళ్ళ హక్కుల చుట్టూ వున్న హద్దులు, పరిమితులు తెలియవు. ప్రజల సహజమైన హక్కులను ప్రకటించడం, వాటిని అమలుపర్చడం, వాటిని ప్రజలకు లేకుండా చేయకుండటం ఇవి వారి విధులు. (1816)

**ప్రజాస్వామ్యం : రాచరికము :** మన ఫెడరల్ ప్రభుత్వంలో లోపాలు వున్నాయని నాకు తెలుసు. కాని అవి రాచరిక పరిపాలనలోని లోపాలకన్న చాలా చిన్నవి. కనుక వాటిని పట్టించుకోను. ప్రజలు తమ మంచిబుద్ధివల్ల వాటిని సరిదిద్దుకోవచ్చును. కాని రాచరికపు దుష్టత్వానికి విరుగుడు లేదు. (1787)

**మైనారిటీ :** మెజారిటీవారి అభీష్టము ఎప్పుడూ ఆమోదింపబడాలి అనే ధర్మమున్నా ఆ అభీష్టము సహేతుకమైనదిగా ఉండాలనేది పవిత్ర సూత్రము. మైనారిటీకి సమానమైన హక్కులున్నాయి. చట్టాలు మైనారిటీల హక్కులు సమానంగా రక్షించాలి. ఈ సూత్రానికి భంగం కలిగితే అది ప్రజలను అణగద్రొక్కడమే అవుతుంది... మన దేశంలో మత అసహనాన్ని పారద్రోలాము. అంత దుష్టమైన, నిరంకుశమైన రాజకీయ అసహనాన్ని మనము ఆమోదిస్తే మనము పొందగల లాభం ఏమీ లేదు. (1801)

**మెజారిటీ సూత్రం :** సమాన హక్కులున్న మానవుల సమాజపు మౌలిక సూత్రం, రిపబ్లికన్ రాజ్యాంగ ప్రప్రథమ సూత్రం ఏమంటే వోట్ల లెక్కింపు ద్వారా ప్రకటితమైన మెజారిటీవారి అభీష్టం ప్రకారం పరిపాలన జరగాలి. అలా జరుగనినాడు దౌర్జన్యం చోటుచేసుకొని మిలిటరీ నియంతృత్వం వస్తుంది. ఈ సత్యాన్ని ఫ్రెంచి విప్లవం రుజువు చేసింది. (1817)

**భేదాభిప్రాయములు :** నాతో విభేదించే హక్కు ఇతరులకు ఉందని అంగీకరించి నేను ఎంతో సహనంగా ఉంటాను. వారికి నేరం చేయాలనే దురుద్దేశమున్నదని ఆరోపించను. (1804)

**అధికార విభజన :** కార్యనిర్వాహకవర్గం (ప్రభుత్వం), న్యాయపరిపాలనా యంత్రాంగము, శాసనసభ వీటి మధ్య అధికారాలను పంపిణీ చేయటము మంచి రాజ్యపు ప్రథమ సూత్రం. (1787)

ఈ సంస్థల మధ్య అధికారం పంచబడాలి. ఒక సంస్థ మరియొక సంస్థపై దురాక్రమణ చేయరాదు. ఒకటి మరియొకదాన్ని అదుపులో వుంచాలి.

**రాష్ట్రాలు : కేంద్ర ప్రభుత్వం :** రాష్ట్రాలు కేంద్రంకన్న అధికృత కల్గి వుండాలని లేక కేంద్రం రాష్ట్రాలకన్న అధికృత కల్గిఉండాలని అనడం చాలా పొరపాటు. అధికారం ప్రజలది. వారు దానిని రెండు ప్రభుత్వాలకు పంచి పెట్టారు. (1821)

**స్వతంత్ర ప్రతిపత్తిగల న్యాయస్థానం :** ప్రభుత్వం యొక్క హుందా, స్థిరత్వం, ప్రజల నైతికస్థాయి, ప్రజాశ్రేయస్సు అన్నీ నిజాయితీగల్గిన, సమర్థవంతమైన న్యాయపరిపాలనపైన ఆధారపడుతవి. న్యాయాధికార రంగం ప్రభుత్వ రంగానికి, శాసనసభా రంగానికి భిన్నంగా ఉండాలి. స్వతంత్రంగా ఉండాలి. అంటే శాసనసభను, ప్రభుత్వాన్ని అదుపులో పెట్టగలిగి ఉండాలి. న్యాయస్థానాలు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయకుండా ప్రభుత్వమూ, శాసనసభ రెండూ అలాగే జాగ్రత్త వహించాలి.

## పత్రికా స్వేచ్ఛ

ప్రజలు పొరపడవచ్చు. వాటికై వారిని తీవ్రంగా శిక్షించరాదు. పత్రికల ద్వారా ప్రజలకు సమాచారం అందజేయటం, పత్రికలు ప్రజలలో బాగా వ్యాప్తి పొందడం, వీటివల్ల వారు మరల పొరపాటు పడకుండా చేయవచ్చు. మన ప్రభుత్వం ప్రజాభిప్రాయం మీదనే ఆధారపడింది. కనుక సమాచారం పొందే హక్కు ప్రజలకు ఉండాలి. పత్రికలు లేకుండా ప్రభుత్వం మాత్రమే ఉన్న సమాజమా లేక పత్రికలు మాత్రమే ఉండి ప్రభుత్వం లేని సమాజమా ఈ రెంటిలో దేనిని నీవు ఎంపిక చేస్తావు అని నన్ను అడిగితే పత్రికలున్న సమాజమే కావాలంటాను. అంటే ప్రతి పౌరునికి పత్రికలు లభ్యమవ్వాలని, ప్రతి పౌరుడు వాటిని చదవగల్గాలని నా భావన. (1787)

# మానవ హక్కులు - మహిళల హక్కులు

స్త్రీల హక్కులు మానవ హక్కులలో భాగం. మానవ సమాజంలో స్త్రీలు సగభాగం. కనుక మానవ హక్కులు వారికీ వర్తిస్తాయి అనేది నగ్నసత్యం. అసలు హక్కులు, బాధ్యతలు అనేవి బొమ్మాబొరుసు లాంటివి. బాధ్యతలను అంగీకరించకపోతే హక్కులు లేవు. హక్కులు లేనివారికి బాధ్యతలూ లేవు.

1776లో అమెరికన్ విప్లవంలో ఎలుగెత్తిచాటిన అంశం ఇంగ్లండ్ రాజుకు వ్యతిరేకంగా అమెరికన్ ప్రజలు కోరినది- 'ప్రాతినిధ్యం లేనిదే పన్నులు చెల్లించ అవసరం లేదు' అని. కాగా ఇన్ని శతాబ్దాల నుండి బాధ్యతలనే పేర్కొన్నారు. కనుక ఇప్పుడు హక్కుల విషయంపై నొక్కిపెట్టాల్సి వచ్చింది.

ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో హెచ్. జి. వెల్సు "మానవ హక్కుల ప్రణాళిక"ను తయారుచేయ తలపెట్టి- ప్రపంచ నాయకుల సాయంకోరుతూ మహాత్మా గాంధీని కూడా కోరాడు. గాంధీ బాధ్యతలపై కూడా నొక్కిపెట్టమని ఆనాడు సలహా చెప్పారు.

ఇంతవరకు స్త్రీలపట్ల బాధ్యతలనే ఉటంకించటం జరుగుతూ ఉన్నది. కనుక హక్కుల ప్రస్తావన ఇటీవల వరకు రాలేదు. భార్యగా, తల్లిగా ఆమె విద్యుక్తధర్మాల గురించి విపులంగా చెప్పటం జరిగింది. మానవజాతిని కొనసాగించే ధర్మనిర్వహణలో ఆమె చేస్తున్న ప్రత్యేకమైన పని, పిల్లలను కనడం, సందర్భంగా దానికి అవసరమైన ప్రత్యేక సౌకర్యాలు (Maternity Leave etc.), ఏకాంతతకు (Privacy) వలసిన ప్రత్యేక సదుపాయాలు (Separate Latrines, Lavatories) తప్ప ఇతరత్రా స్త్రీలు అదనంగా ఏమీ కోరలేదు. కాని మానవ హక్కులను తమకూ తప్పక వర్తింపచేయమని మాత్రం హెచ్చరిక చేస్తున్నారు.

ప్రసవకాలంలో స్త్రీకి అవసరమైన విశ్రాంతిని ఆసరాగా తీసుకొని ఆమెను ఆనాటి నుండి ఇంటిపనికి పరిమితం చేశారు. వేటాడే సమాజంలో, అరణ్యాలలో కాయగూరలను, పండ్లను, ధాన్యాలను ఏరుకొని తినేరోజుల్లో స్త్రీ సామాజిక జీవితంలో ముఖ్యపాత్ర వహించింది. కాగా నాగలి వచ్చి పొలాలను దున్ని పైరులు వేసి పెంచే

కాలానికి ఆమె స్థితి దిగజారిపోయింది. ఆమెను హీనస్థితికి చేర్చారు. దీనికి కారణాలు అనేకం వాటి అన్నింటిజోలికి మనం పోనవసరంలేదు. కాగా ఒకదానిని మాత్రం పేర్కొనవచ్చు. సంతానం తనది అని నమ్మడానికి ఆమెను తన స్వంతం చేసుకోవాలి అనే ఆలోచన కలిగింది భర్తకు. అందుకే ఆమెపై ఆంక్షలు అంటే సిగ్గు, లజ్జ, వినయం, అణకువ, భయభక్తులు అనేవి మంచి లక్షణాలుగా ఆమెకు బోధ సాగించారు. ధర్మశాస్త్రాల ద్వారా అలా దిగజారిన నాటి మహిళ ఈనాటికీ రెండవ తరగతి పౌరురాలుగానే పరిగణించబడుతుంది. ఎన్నో కష్టాలు పడి మరెన్నో త్యాగాలు చేసి ఆమె పౌరసత్వ హక్కులను పొందింది. 19వ శతాబ్దంలో న్యూజిలాండులో స్త్రీలకు ఓటుహక్కు వస్తే, స్విట్జర్లాండు స్త్రీలకు 1978లో వచ్చింది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలుగా చెలరేగిన ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్న ఫ్రెంచి స్త్రీలకు 1944లో ఓటుహక్కు వచ్చింది. కాగితం మీద వివక్ష లేదుగానీ ఆచరణలో స్త్రీలు భర్తల ఇష్టప్రకారం, తండ్రుల ఆజ్ఞననుసరించి, కుమారుల ఆదేశాలను పాటించి ఓటు వేస్తున్నారనేది నిర్వివాదాంశం. దీనికి భిన్నంగా ఒక్క 1971 లోక్‌సభ ఎన్నికల్లో జరిగింది దానికి ముందూ, తర్వాత కూడా స్త్రీల ఓట్లు వారివి కావు. ఏనాడు వారు స్వతంత్రించి వారి ఓట్లను స్వేచ్ఛగా వేయిలేదు. అసలు స్త్రీలను ఓట్లు అడగరు. "మీ ఇంట్లో వున్న ఓట్లు నాకు వేయించు రామయ్యా!" అని అభ్యర్థి కోరతాడు. ఓటుహక్కును రాజ్యాంగం ఇచ్చిందికదా అని ప్రతివాదన చేసి లాభం లేదు. రాజ్యాంగం స్థిరపరచిన అప్రజాస్వామ్య హక్కును సమాజం తన ఆచరణ ద్వారా కాలరాస్తోంది. పురుషులకు ఓటుహక్కు, స్త్రీలకు ఓటుని వినియోగించుకోలేని స్థితి కల్పించడం అసమానత్వ ప్రదర్శన మాత్రమే.



బ్రిటిష్ స్త్రీలకు 1921లో ఓటుహక్కు వస్తే వారితోపాటు భారత స్త్రీలకు ఆ హక్కు వచ్చింది. కువైట్ దేశంలో ఈనాటికి ఓటుహక్కు ఇంకా ఇవ్వనేలేదు. ఇప్పటికి కొన్ని మున్సిపాలిటీల్లో పోటీచేసే హక్కు స్త్రీలకు లేదు. ఆఖరికి బ్యాంకు అకౌంట్లు పెట్టుకునే హక్కు లేని దేశాలింకా వున్నాయి.



ప్రతి వ్యక్తి జీవించడానికి, స్వేచ్ఛగా మనడానికి, ఆనందప్రాప్తిని సాధించడానికీ మౌలికంగా హక్కులున్నాయి. అసలు ఇక్కడ స్వేచ్ఛ అనే భావనను ముందుగా పరిశీలించాలి. ప్రతి జీవి చిన్న పురుగు నుండి మనిషి దాకా బ్రతకాలని

కోరుకుంటుంది. మనుగడ సాగించడానికి ఆరాటపడుతుంది. అయితే మానవునికి ఆలోచనా, శక్తి, ఉద్వేగము, కోపం, సంతోషం వగయిరా భావాలు ఉన్నాయి మానవుని స్థాయిలో అది స్వేచ్ఛా పిపాసగా అంటే స్వేచ్ఛ కోసం ఆరాటంగా మారుతుంది. ఈ స్వేచ్ఛ (స్వ+ఇచ్ఛ=స్వంతకోరిక) అన్ని రంగాలకు వర్తిస్తుంది. సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, నైతిక, మానసిక రంగాలన్నింటా కనిపిస్తుంది. ఈ అన్ని విభాగాలలో మనిషి స్వేచ్ఛను ఆటంకపరిచే శక్తులు, అడ్డువచ్చే అంశాలు, అవరోధాలు ఎదురవుతాయి. వీటిని దాటడానికి మనిషి ఎల్లప్పుడూ తపన చెందుతూ వుంటాడు. స్వేచ్ఛ అనగానే నిర్బంధమైన స్వేచ్ఛ అని ఎవరూ భావించరాదు. ఒకని స్వేచ్ఛ మరొకరి స్వేచ్ఛపై అదుపును పెడుతుంది. మనమంతా సమాజంలో బ్రతుకుతున్నాం. సమాజం యొక్క మౌలికసూత్రం సహకారం. అందువల్ల ఒకరి స్వేచ్ఛ మరొకరి స్వేచ్ఛను హరించరాదు. కనుకనే మన రాజ్యాంగంలో కూడా మౌలిక హక్కులను పేర్కొంటూ వాటిని నీతికి, సభ్యతకు, ఆరోగ్యానికి, సామాజిక భద్రతకు లొంగివుంటాయని స్పష్టీకరించటం జరిగింది.

స్వేచ్ఛ అనే భావనకు సహకారం అనే మౌలిక భావాన్ని కూడా జోడించటం జరిగింది. అయితే ఇక్కడ మరో విషయం గమనార్హం. స్వేచ్ఛను పొందడానికి స్వేచ్ఛను లేకుండా చేస్తున్న శక్తులను, అంశాలను గురించి తెలుసుకోవాలి. అప్పుడే బాధ నుండి విముక్తి లభిస్తుంది. చలివల్ల బాధపడిన ఆదిమ మానవుడు, వర్షంవల్ల వెతలు చెందిన మన పూర్వీకుడు కొండ గుహలను ఆశ్రయించాడు. తరువాత ఇళ్ళు కట్టాడు. శీతోష్ణస్థితిని అదుపుచేసుకోవటానికి యంత్రాలు కనుగొన్నాడు. ఇదంతా మానవుని సత్యాన్వేషణా కృషి. స్వేచ్ఛాపిపాసకు తోడుగా వుండేది సత్యాన్వేషణ. సత్యాన్వేషణ వల్లనే శాస్త్రజ్ఞానం పెరిగింది.

ఇలా మానవ సమాజాన్ని నియంత్రణంచేసే మౌలిక భావాలు స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ, సహకార భావన అని తేలింది.

స్వేచ్ఛ అంటే జంతుస్థాయి జీవితాన్ని గడపటానికీ వీలు, వెసులుబాటు అని అర్థంకాదు. ఆహార, నిద్రా, మైథునాలు జంతువులకు, మానవులకూ ఒకటే. కాకపోతే మానవుడు బుద్ధిజీవి. ఆలోచించగలడు. భాషను, పనిముట్లను నిర్మించుకోగలడు; తన

భవిష్యత్తును తను దిద్దుకోగలడు. తన ఊహాశక్తిని వినియోగించుకోగలడు. తన జ్ఞానాన్ని, ఆలోచనలను తన ముందు తరాలకు అందచేయగలడు. వ్యక్తి తన అంతర్గత శక్తుల వికాసాన్ని కోరుకుంటాడు. తన భుక్తికోసం కేవలం ఏ రెండు గంటలు మాత్రమో పనిచేసి, మిగిలిన కాలాన్ని తన ఇచ్ఛ వచ్చిన రీతిన కవిత్వం చెప్పుకుంటూనో, పాటలు పాడుకుంటూనో, నాటకాలు వేస్తూనో, చిత్రాలు గీస్తూనో, శిల్పసాధన చేస్తూనో, గ్రంథరచన సాగిస్తూనో లేక గుర్రపుస్వారీ, ఆటలు, పుస్తక పఠనం ఇలా ఎన్నో రీతుల వినియోగించుకోగల సమాజాన్ని ఆశించాడు జిజ్ఞాసాపరుడైన మానవుడు. అది ఆతని సుందర స్వప్నం. దానిని 'యుటోపియా' అనుభవంలోకి రాజాలని వూహాచిత్రణ అంటారు కొందరు. ఏదయినా ఇతర మేధావులు అందరూ ఇంచుమించుగా అలాంటి కలలే కన్నారు. అందరూ ఆనందాన్నే ఆశించారు.

అసలు ఆనందం ఎలా లభిస్తుంది ? ఈ పదాన్ని అమెరికన్ రాజ్యాంగంలో వాడారు. ప్రతి పౌరునికి జీవించడానికి, స్వేచ్ఛను పొందడానికి, ఆనందం అనుభవించడానికీ హక్కు వున్నదని వ్రాసారు అమెరికన్లు. ఇప్పుడు తాత్విక విషయాల జోలికి పోతున్నామని ఎవరూ భావించవద్దు. వీలయినంత వరకు తాత్విక, మత విషయాలను ఇక్కడ ఉటంకించ తలుచుకోలేదు.

మనిషికి మనస్సు వుంది. ఆలోచన వుంది. కోరికలూ వున్నాయి. అంతేకాదు అవసరాలు కూడా వున్నాయి. ఈ అవసరాలు అనేవి అనేక రకాలుగా వుంటాయి. అవి భౌతిక, శారీరక, మానసికమైన అవసరాలు. ఈ మూడింటిని అధిగమించిన అవసరాలు మరకొన్ని వున్నాయి. కొందరు వాటిని ఆధ్యాత్మిక అవసరాలని, మరి కొందరు సమ్యక్ అవసరాలని పేర్కొంటారు. అవి తీరితే కొంతలోకొంత ఆనంద ప్రాప్తి కలుగుతుంది. ఇందులో వ్యక్తిగత సమతుల్య మానసికస్థితి, రాగద్వేషాలకు అతీతమయిన దృష్టి, మానవాళి యెడల సమదృష్టి, ప్రకృతి యెడల సమ్యక్ దృష్టి ఇమిడివున్నాయి.

అమెరికన్ మానసిక శాస్త్రజ్ఞుడు ఎరిక్ ఫ్రామ్ చేసిన విశ్లేషణ ఇది. ఈ అవసరాలు తీరిన ప్రతి మానవునికి ఆనందప్రాప్తి కలుగుతుంది. ఇవన్నీ ఒక్కసారి తీరవు. సమాజ గతిని అనుసరించి క్రమక్రమంగా తీరుతాయి; స్వేచ్ఛ అన్నా కూడా

మానవుని వ్యక్తి వికాసానికి అవరోధాలుగా వున్న వాటిని క్రమక్రమంగా తొలగించుకోవటమే. ఇలా వ్యతిరేకార్థంలో చెప్పుకోవలసి వచ్చింది. లేకపోతే నిర్వచనం సమగ్రం కాదు.

వ్యక్తివికాసం అనగానే ప్రతి వ్యక్తిలో వున్న అంతర్గత శక్తులు- అందే సృజనాత్మకమైనవి, శుభప్రదమైనవి, సమాజానికి మంగళప్రదమైనవి మాత్రమే సుమండీ- పెరిగి పరిఢవిల్లటానికి వీలు, వెసులుబాటు అని అర్థం చెప్పుకోవాలి. ఉదాహరణకు సంగీతమంటే చెవికోసుకునే మనిషి, లయజ్ఞానం కలిగిన వ్యక్తి సంగీత సాధన చేసుకొనే అవకాశం వుంటే అది ఆ వ్యక్తి వికాసానికి దోహదం కలిగినట్లు భావిస్తాం. ఇలా ఎన్నో ఉదాహరణలు చెప్పుకుంటూపోవచ్చు. కొంత మౌలికభావాల చర్చను చేసి అసలు విషయాన్ని- స్త్రీల హక్కుల విషయం గురించి విశ్లేషించటం సమంజసం.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే నినాదాలపై 1789లో ఫ్రెంచి విప్లవం సాగింది. 1917 నాటి రష్యన్ విప్లవం యొక్క ఇతర వైఖరులు, లక్షణాలు మనకు అంగీకారమయినా, కాకపోయినా ఆ విప్లవం మానవుల ఆర్థిక అవసరాలను సమాజం దృష్టికి తెచ్చింది. భారత దేశంలో మౌలిక హక్కులుగా కొన్నింటిని పేర్కొని, మరికొన్నింటిని ప్రభుత్వానికి ఆదేశక సూత్రాలుగా వ్రాయటం జరిగింది.

మౌలిక హక్కుల అమలుకు పౌరుడు కోర్టుకు వెళ్ళవచ్చు. ఆదేశక సూత్రాల అమలుకు ఆ సౌకర్యం లేదు. కాగా ఆదేశక సూత్రాలకు భిన్నంగా, వ్యతిరేకంగా ప్రభుత్వాలు కేంద్రంగాని, రాష్ట్రంగాని సంచరిస్తుంటే వాటిని ప్రతి పౌరుడు న్యాయ స్థానాల ద్వారా నిరోధించవచ్చును.

ఇంతకూ హక్కులపరంగా స్త్రీలు కోరేది ఏమిటి అని ప్రశ్నిస్తే స్వేచ్ఛ, సమానత్వం, వివక్ష నిర్మూలన, మాతృత్వ విధినిర్వహణ సందర్భంగా కొన్ని అదనపు సదుపాయాయి, వ్యక్తి వికాసానికి దోహదం చేసే అవకాశాలు అని నిర్దేశించవచ్చు. వీటిని ఒక్కొక్కదానిని తీసుకొని వివరంగా, క్షుణ్ణంగా చర్చించే ముందు, మామూలుగా వినవచ్చే ప్రతి వాదనను పేర్కొని దానిని విచారించడం మంచిది.

స్త్రీలకు ప్రస్తుతం ఏమీ ఇబ్బందులు లేవు. వారు భర్త చాటున వుంటూ, శ్రమ చేయవలసిన అవసరం లేకుండా, హాయిగా నీడనవుంటూ, ఇంటి పెత్తనం సాగిస్తూ సుఖజీవితం గడుపుతున్నారు. అనవసరంగా హక్కుల పేరుతో ఆందోళనలు సాగించి చిక్కులు పడుతున్నారనేదే ఈ వాదన సారాంశం. ఈ వాదనలో పసలేదు, అసలు ఈ వాదనకు ఆధారాలు లేవు. ఈనాటి సమాజాన్ని పరికిస్తే ఈ వాదనలో చిత్రించిన పరిస్థితి బహు సంఖ్యాకులైన స్త్రీలకు లేనేలేదు. మొదటి నుండి సమాజం లోని శ్రామిక వర్గాల స్త్రీలు పనిపాటలు చేస్తూనే వున్నారు. క్రింది తరగతి స్త్రీలు కాయకష్టం చేస్తూనే వున్నారు. సమాజం పారిశ్రామికీకరణం కావడంతో, నగరాభివృద్ధి కావడంతో శ్రామిక స్త్రీలపై బరువు, బాధ్యతలు ఎక్కువ అయినాయి. మధ్యతరగతి స్త్రీలు కూడా సంపాదిస్తే తప్ప కుటుంబ నిర్వహణ సాధ్యపడని పరిస్థితి ఈనాడు ఏర్పడింది. ఇక ఇంటిపని సరేసరి. అది వారికోసం వేచివుంటుంది. ఏదో బహు కొద్దిమంది పురుషులు సాయంచేస్తారు. వారుకూడా అన్ని పనులు చేయరు. ఇకపోతే వున్నతవర్గాల స్త్రీలు శ్రమ చేయటంలేదు. కాని వారి పరిస్థితిని సర్వేచేస్తే వారు బంగారు పంజరంలోని చిలకల్లా వున్నారని తేలుతుంది. అంతేకాదు వ్యక్తి వికాసానికి, స్వేచ్ఛకు నోచుకోని జీవితం వారిది. షోకేసుల్లో బొమ్మలు వారు.

కనుక ప్రతివాదన సమర్థనీయం కాదు. ఎంత త్వరగా అలాంటి పొరపాటు భావన నశిస్తే అంత మంచిది. స్త్రీల హక్కులను పేర్కొనేటప్పుడు ప్రపంచంలో అనేక దేశాలలో అనేక హక్కులు స్త్రీ పురుషులిద్దరికీ నిరాకరింపబడినాయి అని చెప్పక తప్పదు.

స్త్రీల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల విషయమై, సమానత్వాన్ని గురించి విశ్వమానవ హక్కుల ప్రకటనలో, భారత రాజ్యాంగంలో ఎలా చెప్పబడిందీ మున్ముందుగా విచారించడం అవసరం. అదే సందర్భంలో భారత స్త్రీల అనుభవం ఎలా ఉందో పరిశీలించడం సముచితం. అలాచేస్తే స్త్రీల హక్కులను గురించిన సమగ్ర అవగాహన కల్గుతుంది. సంపూర్ణ సమాచారం అందుతుంది. ఈనాటి దుస్థితి తెలిసి దానికి కారణాలను అన్వేషించటానికి ఉపయుక్తమవుతుంది.

**స్వాతంత్ర్యాలు :** స్వేచ్ఛ అవిభాజ్యం. ఒక రంగంలో స్వేచ్ఛ యిచ్చి మరో

పరిధిలో స్వేచ్ఛ లేకుండా చేస్తే అది మనజాలదు. ఒక రంగంలోని స్వేచ్ఛ మరొక జీవిత విభాగంలోని స్వేచ్ఛతో ముడిపడివుంటుంది. అయినా పరిశీలనా సౌకర్యం కోసం స్వేచ్ఛ యొక్క విభాగాలను విడివిడిగా అధ్యయనం చేయటం తప్పనిసరి అవు తున్నది. అపుడు వివిధ రంగాలలోని స్వేచ్ఛా రూపాలను స్వాతంత్ర్యాలని పేర్కొ నడం అనుచితం కాదు. ఈ స్వాతంత్ర్యాలను మనిషికి సంబంధించినవిగా, సామాజిక ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలుగా విభాగాలు చేసి, వాటిని గురించి చర్చిం చటం యుక్తియుక్తం.

ఇంతకూ ఏ ప్రాతిపదిక మీద ఈ స్వాతంత్ర్యాలు రూపొందించడం జరిగిందో గమనించటం సమంజసం. ప్రకృతిసిద్ధమైన మానవ హక్కులు (Natural Rights) వీటికి మూలమని అమెరికను రాజ్యాంగం ఉద్ఘాటిస్తున్నది. ఇతరులు ఎవ్వరూ హరించ టానికి వీలులేని (Inalienable) హక్కులని విశ్వమానవ హక్కుల ప్రకటన పేర్కొంటున్నది. వాటికి గీటురాళ్ళు ఏవి ? మానవుని అస్తిత్వం, వ్యక్తిత్వం, విలువ (Worthi ness), హుందాతనం (Dignity), జీవిత సార్ధక్యం, మానవ మౌలిక హక్కుల పట్ల విశ్వాసం, స్త్రీ పురుష సమానత్వం, సామాజికాభ్యుదయం, వ్యక్తి శ్రేయస్సు, జీవన ప్రమాణపు పెంపుదల తద్వారా విస్తృత స్వేచ్ఛా వాతావరణం సృష్టి ఇవి కీలకాధారాలు. వీటిని అనుసరించి ఐక్యరాజ్య సమితిని బలపరచటం, ప్రపంచ శాంతికి అవసరమైన సుహృద్భావ సృష్టికి కృషి చేస్తాయి. (విశ్వమానవ హక్కుల ప్రకటన ఉపక్రమణిక (PREAMBLE).

**హక్కులు-బాధ్యతలు :** సహకారం మానవ సమాజపు ప్రప్రథమ సూత్రం కనుక ఒకరి హక్కులు మరొకరి హక్కులకు భంగకరంగా పరిణమించతగదు. అలా జరిగితే సమాజం యొక్క అస్తిత్వం దెబ్బతింటుంది. అందుచేత బాధ్యతలను స్వీక రించదలచని వారికి హక్కులుండవు; అలాగే హక్కులున్నవారు విధిగా బాధ్యతలను పాటించాలి. ఈ ధర్మసూత్రాన్ని విశ్వమానవ హక్కుల ప్రకటన ఆమోదించింది. "ప్రతి వ్యక్తికి సమాజం యెడల బాధ్యతలు ఉన్నాయి; సమాజంలోనే ఆ మనిషి యొక్క వ్యక్తిత్వ వికాసాభివృద్ధి సంపూర్ణంగా సాధ్యమవుతుంది" (వి.మా హ ప్ర. 29వ అధికరణం). "ఏ వ్యక్తిగాని, మానవ సముదాయంగాని, రాజ్యాంగంగాని ఈ హక్కుల, స్వాతంత్ర్యాల విధ్వంసానికి పూనుకోరాదు" (వి.మా.హ.ప్ర. అధి 30).

**(A) అస్తిత్వం :** "ప్రతి వ్యక్తి మనిషిగా ఎల్లెడలా గుర్తింపబడాలి" (వి.మా.హ.ప్ర. అ 6). ఇంత స్పష్టంగా భారత రాజ్యాంగంలో వ్రాయబడలేదు. అయినా దాని అవగాహన, భావస్ఫూర్తి రాజ్యాంగం నిండా నిబిడీకృతమయింది. ఈ భావాన్ని ఇన్ని మాటలతో చెప్పడం లేక పునరుద్ఘాటన చేయడం అత్యవసరం. ఇప్పటికీ కొన్ని సమాజాలలో స్త్రీలు వస్తువులుగా, ఆస్తిగా, బానిసలుగా, రెండవ తరగతి పౌరులుగా మనుగడ సాగిస్తున్నారు. వారు భర్తల నీడలుగా బ్రతుకుతున్నారు. తండ్రుల ఆస్తిగా జీవిస్తున్నారు. ఈ శోచనీయ స్థితిని గ్రహించి ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల సమితి ఇలా ఉద్ఘాటించింది.

హుందాపరంగా, స్వేచ్ఛ విషయంగా మానవులంతా హక్కుగలిగి ఉన్నారు. వారికి హేతుత్వం ఉంది. అంతరంగం (Conscience) ఉంది. (వి.మా.హ.ప్ర. అ 1) ఈ సూత్రంలో మానవ అస్తిత్వం స్థిరపరచడం జరిగింది. క్రీ. శ. 4వ శతాబ్దంలో స్త్రీలకు ఆత్మలున్నాయా లేవా అని మతగురువుల సంఘం చర్చించినదన్న విషయాన్ని తెలుసుకుంటే ఈ సూత్రం యొక్క ఆవశ్యకత బోధపడుతుంది.

"జీవించడానికి, స్వేచ్ఛకు భద్రతకు ప్రతి వ్యక్తికీ హక్కు ఉంది" (వి.మా.హ.ప్ర. అ 3) ఆడపిల్లను పుట్టగానే చంపే సమాజాలు ఇంకా ఉన్నాయి. అలాంటి తెగలు కొన్ని ఇప్పటికీ భారతదేశంలో ఉన్నాయి. సహగమనం పేరుతో వితంతువులను చంపడం లేక చనిపోయేలాగా ప్రోత్సహించడం ఇంకా సాగుతూనేఉంది. భర్తను నచ్చనిపని చేసిన భార్యను మన దేశంలో భర్తలు బాధపెట్టటం, గాయపర్చడం, చంపడం సర్వసామాన్యమయింది. కొందరి భర్తల దృష్టిలో భార్యలు సాధనాలు, పనిముట్లు. భారత రాజ్యాంగం కూడా ఈ అన్యాయాన్ని గుర్తించింది. "ఏ వ్యక్తి యొక్క జీవితాన్ని, వ్యక్తి స్వేచ్ఛను శాసనబద్ధమైన విధానం ద్వారా తప్ప ఇతరత్రా హరించరాదు" (భారతరాజ్యాంగం 21వ అధికరణం). 22వ అధికరణంలో ఏ పరిస్థితుల్లో ఒక మనిషిని నిర్బంధంలోకి తీసుకోవచ్చునో, ఎలాంటి కర్తవ్యాలను ప్రభుత్వం ఆ పరిస్థితిలో తీసుకోవాలో, బందీకి వుండే హక్కులు అన్నీ వివరించబడినాయి (భా.రా. అ. 22).

"ఏ వ్యక్తినీ బానిసగా, అర్థబానిసగా వాడరాదు; తాబేదారుతనానికి లోను చేయరాదు" (వి.మా.హ.ప్ర. అ. 4). భారత రాజ్యాంగం కూడా ఈ విషయమై శ్రద్ధ వహించింది. "మానవులు క్రయ విక్రయాలకు లోనయ్యే వస్తువులు కాదు వారిని బానిసత్వానికి, వెట్టిచాకిరికి, సంప్రదాయపరంగా సాగే పరుమానం లేని చాకిరీకి లోనుచేయరాదు" (భా.రా. అ 23) వెట్టిచాకిరీ నిర్మూలన శాసనం వచ్చినా, నిర్బంధ శ్రమ నిషేధ శాసనం ఆమోదింపబడినా వెట్టిచాకిరీ, బలవంతపు చాకిరీ సమాజంలో విలయతాండవం చేస్తున్నాయి. బాలికలను పడుపువృత్తి కోసం అమ్మటం, కొనటం విరివిగా జరుగుతున్నది. "ఎవరూ క్రూర హింసకు, హింసకు, అమానుషత్వానికి, అవమానానికి లోను చేయబడరాదు" (వి.మా.హ.ప్ర. అ. 5). స్త్రీలపై జరిగే అన్యాయాలూ, అత్యాచారాలూ, దుర్మార్గాలు వర్ణనాతీతం.

## (B) సామాజిక స్వాతంత్ర్యాలు :

**(a) వివాహం - కుటుంబం :** "ప్రతి వ్యక్తికి కుటుంబం ఏర్పరచుకోవటానికి హక్కు ఉంది. అలాగే యుక్త వయస్కులయిన స్త్రీ పురుషుల వివాహం వారి సమ్మతితోనే జరగాలి. వివాహమపుడు, వైవాహిక దశలో, విడాకులప్పుడు వారిరువురికి సమానమైన హక్కులుండాలి (వి మా.హ.ప్ర. అ. 16). ఇలా ఇంత స్పష్టంగా భారత రాజ్యాంగంలో నిబంధన లేదు. కనుకనే, బాల్యవివాహాల నిషేధం పేర్కొనబడినా, బాల్యవివాహాలు చెల్లనివని ప్రకటించ లేదు. హిందువులలో, ముసల్మానులలో బాల్య వివాహాలు సాగుతున్నాయి. 15 సంవత్సరాలు నిండని బాలికలు, యువతులు భర్తలతో కాపురం చేయవలసిన పరిస్థితులు నెలకొని ఉన్నాయి. 15 సంవత్సరాలు నిండితే వివాహాన్ని కాదనవచ్చని హిందూ స్త్రీకి అధికారం ఇవ్వబడినా (హిందూ వివాహ చట్టం), రజస్వల అయిన తరువాత పెండ్లిని నిరాకరించవచ్చని ముస్లిం స్త్రీకి అధికారం ఉన్నదని ప్రకటించినా (ముస్లిం లా), 18 సంవత్సరాలు నిండని బాలికలు, యువతులు అయిష్టంగా దాంపత్యాలు సాగించవలసి వస్తున్నది. కొన్ని 'కేసులలో' రజస్వల కాని పిల్లతో దాంపత్యం బలవంతంగా జరిపిన సందర్భాలు ఉన్నాయి. ఇది నేరమయినా సాధారణంగా స్త్రీలు, సమాజం దీనిని ఎదిరించటం లేదు.

యువతులు తమంత తాముగా స్వతంత్రించి వివాహమాడటానికి సమ్మతించని సమాజాలు ఎన్నో ఉన్నాయి. మరో అంశం స్పష్టీకరించవలసియున్నది. స్త్రీకి వివాహమాడటానికి హక్కు ఉన్నదని అంటే వివాహమాడకపోవటానికి ఆమెకు హక్కు ఉన్నదని చెప్పటమే. అవివాహిత యువతులను శాసనం శిక్షించకపోయినా, సమాజం న్యూనతాభావంతో పరిగణిస్తున్నది. ఇది శోచనీయం, స్త్రీకి వివాహం విధి అనే భావం ప్రబలంగా ఉండి ఆచరణలో ప్రతిబింబిస్తున్నది.

**(b) విడాకుల హక్కు :** స్త్రీ వ్యక్తి అయినపుడు, పురుషునితో సమానమయిన హక్కు కలిగిన మనిషిగా పరిగణింపబడినప్పుడు ఆమెకు విడాకుల హక్కు ఉండటం న్యాయం. అందుకని వివాహం రద్దు అయ్యేటప్పుడు ఆమెకు పురుషునితో సమానంగా హక్కులున్నాయి (వి.మా.హ.ప్ర. అ. 16). భారత రాజ్యాంగంలో ఇంత స్పష్టంగా, ఇలా వ్రాయలేదు కనుకనే స్త్రీని ఇబ్బందులపాలు చేసే 'క్రైస్తవ విడాకుల శాసనం', 'ముస్లిం విడాకుల శాసనం', 'హిందూ వివాహ శాసనం' ఇంకా అమలులో ఉన్నాయి.

ఉదాహరణకు హిందూ వివాహ శాసనం 1955లో వచ్చింది. ముస్లిం వివాహ శాసనం 1939లో రూపుదాల్చింది. పార్శీలది 1936 నాటిది. క్రైస్తవులది 1869 నాటిది. ప్రత్యేక వివాహ శాసనం 1954లో రూఢీ అయింది. ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహమాడిన వారికి ఇది వర్తిస్తుంది. హిందూ వివాహశాసనంలోనూ, ప్రత్యేక వివాహ శాసనంలోనూ విడాకులు పొందడానికి స్త్రీలకు కూడా ఎక్కువ వెసులుబాట్లు వచ్చాయి. ఇరువురి సమ్మతిపైన విడాకులు పొందే హక్కు ఇవ్వబడింది,

ముసల్మాను భర్త ఏకపక్షంగా భార్యకు విడాకులు ఇవ్వవచ్చు. 'తలాక్' అనే పదాన్ని మూడుసార్లు ఒకేసారి ఉచ్చరించి గాని, లేక ఒక్కొక్కసారి మూడు పర్యాయాలు మూడు నెలల్లో అనిగాని విడాకులు ఇవ్వవచ్చు పెండ్లి అప్పుడు ప్రత్యేకంగా ఒప్పందంలో వ్రాసుకుంటే తప్ప స్త్రీకి అలాంటి హక్కు లేదు.

క్రైస్తవ శాసనంలో విడాకులు పొందేహక్కు ఇంచుమించుగా స్త్రీలకు మృగ్యమయింది. భర్తపై ఆమె రెండు నిందారోపణలు చేసి రుజువు చెయ్యాలి. వ్యభిచారం కాక అదనంగా రెండవ భార్యను స్వీకరించడం, అక్రమ సంబంధం కలిగివుండటం,

అసహజ సంపర్కానికి ఒడిగట్టడం లాంటివి రుజువు చేయాలి. ముస్లిం, పార్శీ శాసనాల కన్నా ఇది వెనుకబడివున్నది.

పార్శీ వివాహ శాసనంలో పరస్పర సమ్మతిపై విడాకులు గానీ, వివాహరథం కుంటుపడిందనే విషయం రుజువు అయితే విడాకులు కానీ లేవు. వివరాల జోలికి పోకుండా స్థూలంగా విడాకులకు సంబంధించి వివిధ మత ధర్మశాసనాలు విధించిన నిబంధనలను గురించిన సంక్షిప్త సమాచారం ఇది.

**(c) మనోవర్తి హక్కు :** వైవాహిక స్థితిలో స్త్రీ పురుషులకు సమానమైన హక్కు వుండాలి (వివాహ ప్ర. అ 16). మనోవర్తి విషయంలో భారత రాజ్యాంగం ఇలా పేర్కొన్నది. కనుకనే హిందూ, ముసల్మాన్ వివాహాలలో మనోవర్తిని గురించిన శాసన నిబంధనలు స్త్రీకి వ్యతిరేకంగా, నష్టదాయకంగా వున్నాయి. స్త్రీ భర్త ఇంటిలో కాపురము చేయడానికి వీలులేని సందర్భాలలో ఆమె కొన్ని ప్రాంతాలలో నిరాదరణకు లోనవుతున్నది. ఆమెకు మనోవర్తి హక్కు నిరాకరింపబడుతున్నది.

**(d) వివాహిత స్త్రీకి తన దేహంపై హక్కు :** స్త్రీ ఒక మనిషి (వి.మా.హ ప్ర. అ. 6). వైవాహిక దశలో ఆమె పురుషునితో సమానం (వి.మా. హ.ప. అ 16). ఇంత స్పష్టంగా, ఇలా నిర్ద్వంద్వంగా రాజ్యాంగం ప్రకటించలేదు. కనుకనే మనదేశంలో భర్త భార్యతో బలవంతంగా దాంపత్య జీవితం సాగించినా శిక్షార్హుడుకాడు. వివాహమాడినందువల్ల తన సాంగత్యాన్ని, శారీరక సన్నిహిత్వాన్ని, బలవంతంగానైనా, పొందడానికి భర్తకు భార్య అనుమతిని ఇచ్చినట్లేట. ఇలా ఆమె శారీరక భద్రతకు వ్యక్తిత్వానికి భంగం కలుగుతున్నది.

**(e) మతతత్వానికి సంబంధించిన హక్కు ;** అంతరంగ స్వాతంత్ర్యానికి, మతాన్ని పాటించడానికీ, ప్రకటించుకోవడానికి, ప్రచారం చేయడానికి, మతం మార్చుకోవడానికి ప్రతివ్యక్తికి హక్కు వున్నది (వి.మా.హ ప్ర. అ 18). ఇలాంటిదే భారత రాజ్యాంగం పొందుపరచింది. (భా. రా. అ 25) సూత్రాలు ఇంత స్పష్టంగా వున్నా ఏ వందమందో తప్ప కోట్లాది భారత స్త్రీలలో ఏ ఒక్కరూ,

స్వేచ్ఛాయుతంగా, మతం మార్చుకోలేరు. ఆచరణలో ఈ హక్కు భారత స్త్రీలకు నిరాకరింపబడింది.

**(f) గర్భస్రావపు హక్కు :** కొన్ని ప్రత్యేక పరిస్థితులలో గర్భస్రావం చేయించుకోవచ్చనే కేంద్ర శాసనం 1971లో వచ్చింది. ఇలాంటి శాసనం కెనడా లాంటి పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో కూడా లేవని తెలుసుకోవడం అవసరం. తల్లి ఆరోగ్యం కాపాడటానికీ, బిడ్డ అంగవైకల్యంతో పుడుతుందని తెలిసినపుడు, కుటుంబ నియంత్రణ పాటిస్తున్న స్త్రీకి ఆ సాధనాలు విఫలమై గర్భం వచ్చినప్పుడు, లేక ఆమె కోరని గర్భం వచ్చి ఆమె తీవ్ర మానసిక వ్యథకు లోనయినపుడు, ఆమెపై చేయబడిన అత్యాచార ఫలితంగా ఆమె గర్భవతి అయినపుడు వైద్యులు ఆమెకు గర్భస్రావం చేయవచ్చును. ఇది స్త్రీ విమోచనోద్యమానికి ఒక రకంగా విజయం. సెక్సు విప్లవానికి నాంది. స్త్రీ యొక్క లైంగిక బానిసత్వం నుండి ఆమెకు విముక్తి మార్గం. సంతానం కనే యంత్రంగా ఉండాల్సిన అవసరం లేని స్థితిని కల్పిస్తున్న రాయితీ. అయితే దీని విషయమై కొన్ని సమాజాలలో ఆక్షేపణలు, అభ్యంతరాలు వున్నాయి.

**(g) వారసత్వపు హక్కు ;** హిందూ సమిష్టి కుటుంబానికి పిత్రార్జితపు ఆస్తి వుంటే దానిలో కుమారులకు జన్మతః హక్కు ఏర్పడుతున్నది. కుమార్తెలకు అది లేదు. ఇది ఆంధ్రప్రదేశ్ మినహా భారతదేశం అంతటా చలామణి అవుతున్న న్యాయ పద్ధతి. ఆంధ్రప్రదేశ్‌లో కుమార్తెలకు పుట్టుకతో హక్కు ఇచ్చింది తెలుగు దేశం ప్రభుత్వం. ఆ హిందూ వారసత్వ సవరణ శాసనానికి భారత రిపబ్లిక్కు అధ్యక్షుని అనుమతి లభించింది. ఒక మహమ్మదీయుడు చనిపోతే భార్య, కుమారులు, కుమార్తెలు అతనికి వారసులు. అయితే కుమార్తెకు వచ్చే వాటా కుమారునికి వచ్చే వాటాలో సగభాగం పార్శీలలో కూడా కుమారునికి వచ్చే వాటాతో సగం మాత్రమే కుమార్తెకు వస్తుంది.

**(h) సంరక్షకత్వం ;** బిడ్డను నవమాసాలు మోసి కనిపెంచుతున్నది స్త్రీ. కానీ తన సంతానానికి ఆమె గార్డియను కాదు. హిందూ, ముసల్మాను న్యాయ శాస్త్రాలు అలాగే శాసిస్తున్నాయి. హిందూ కుటుంబాలలో తండ్రి లేకపోతే తల్లి

సహజమైన సంరక్షణకర్త. ఈ మాత్రం వెసులుబాటుకు కూడా ముస్లింమాత నోచుకో లేదు. ఆమె సంతానానికి తండ్రి, తండ్రిచే వీలునామాలో పేర్కొనబడిన అతను, తండ్రితండ్రి, లేక తండ్రి తండ్రిచేత వీలునామాలో నియమింపబడినవాడు వరుసగా గార్డియనులు అవుతారు.

**(i) దత్తత హక్కు :** హిందువులలో దత్తత వున్నది. ముసల్మాను, క్రైస్తవ సమాజాలలో లేదు పిల్లలను పెంచుకోవడం వున్నది. కాగా హిందూ సమాజంలో దత్తత జరిగేది పురుషునికి మాత్రమే. 1956 శాసనం ప్రకారం స్వతహాగా దత్తు చేసుకోడానికి కొన్ని సందర్భాలలో స్త్రీకి హక్కు కలిగినమాట వాస్తవమే. ఏ పురుషుడూ భార్య సమ్మతి లేకుండా దత్తు చేసుకోరాదని వ్రాయబడి ఉన్నదనే విషయం నిజమే. అయితే ఒకటి మాత్రం సత్యం. వివాహిత స్త్రీ తన భర్త సమ్మతి తోనైనా సరే దత్తుచేసుకోవడానికి అవకాశంలేదు. మేజరయి, మతిస్థిమితం కలిగిన ఒంటరి స్త్రీ (అవివాహిత, విధవరాలు, విడాకులు పొందిన స్త్రీ) తనకు దత్తుచేసుకో వచ్చును. ఇది స్త్రీ, పురుష సమానత్వానికి పూర్తిగా వ్యతిరేకమని స్త్రీల హోదాను గురించి దర్యాప్తు జరిపిన ప్రభుత్వ కమిటీవారు అభిప్రాయం వెలిబుచ్చారు.

**(j) నివాసపు హక్కు :** "ప్రతి వ్యక్తికీ తమదేశ సరిహద్దుల్లో నివసించడానికి, తన దేశాన్ని వదలిపెట్టి మరో ప్రదేశానికి వెళ్ళడానికి హక్కు వుంది." (వి.మా.హ.ప. అ 13). కక్ష సాధింపు చర్యలనుండి తప్పించుకోవడానికి ఇతర దేశాలలో ఆశ్రయంకోరే హక్కు ప్రతి వ్యక్తికీ వుంది (వి.మా హ.ప్ర. అ 14). భారతదేశంలో ఏ ప్రాంతంలోనైనా నివాసముండటానికి, స్థిరపడటానికి పౌరులందరికీ హక్కు వుంది. (భా.రా. అ.19) అయితే విదేశాలకు పోవడానికి ఇచ్చే అనుమతి పత్రం (PASS PORT) దేశంలో ప్రవేశించడానికి అనుమతి పత్రం (VISA), వీటి నిబంధనల విషయంగా వివాహిత స్త్రీలు ఇబ్బందులకు లోనవుతున్నారు. ఈ నిబంధనలను సవరించకపోతే స్త్రీకి పైన ప్రకటించిన హక్కులు నిరుపయోగమవుతాయి.

**(C) రాజకీయ హక్కులు :**

**(a)** పరిపాలనలో పాల్గొనడానికి ప్రతి వ్యక్తికి హక్కు వున్నది. (వి మా హ ప్ర. అ. 21 (i)). ఈ హక్కును గురించి ఎన్నికలు, కార్యనిర్వాహకవర్గం వీటికి సంబంధించిన అధికరణాలలో భారత రాజ్యాంగం స్పష్టీకరించింది.

**(b)** ప్రభుత్వ ఉద్యోగాలు పొందడానికి ప్రతి వ్యక్తికీ హక్కు వుంది (వి.మా. హ.ప్ర. అ. 21 (2)). ఈ విషయం కూడా భారత రాజ్యాంగంలో స్పష్టీకరించ బడింది (భా.రా. అ. 16).

ఇలా హక్కులు స్త్రీలకు ప్రకటించబడినా అనుభవంలో వారు ఈ హక్కులను అనుభవించలేకపోతున్నారు. ప్రభుత్వ విభాగాలైన శాసనసభ, కార్యనిర్వాహకవర్గం, న్యాయ వ్యవస్థల్లో స్త్రీల ప్రాతినిధ్యం, భాగస్వామ్యం అత్యల్పంగా వుంది. అంతేగాక ఇంచుమించుగా అన్ని ప్రాంతాలలో ఓటింగ్ విషయంలో కూడా స్త్రీలకు స్వాతంత్ర్యం లేకుండా పోతున్నది.

**(c) భావప్రకటనా స్వాతంత్ర్యం :** దీనిని విశ్వమానవ హక్కుల ప్రకటన నిర్వచనం చేసింది. అభిప్రాయ స్వాతంత్ర్యం భావ స్వాతంత్ర్యం, అభిప్రాయాలను, భావాలను వెలిబుచ్చడానికి, ప్రసారం చేయడానికి, అందుకోపడానికి ప్రతి వ్యక్తికీ హక్కు వుంది (వి.మా.హ.ప్ర. అ 19). భారత రాజ్యాంగం వాక్స్వాతంత్ర్యాన్ని, భావప్రకటనా స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది (భా. రా. 19(A)). అనుభవంలో ఈ హక్కు చాలామంది స్త్రీలకు మృగ్యమైంది.

శాంతియుతమైన సమావేశ స్వాతంత్ర్యాన్ని సర్వే సర్వత్రా అంగీకరించడం జరిగింది (వి.మా.హ.ప్ర. అ. 20 (i); భా.రా. 19 (B)). ఇంతగట్టిగా ఈ హక్కు గురించి చెప్పినా స్త్రీల సమావేశాలన్నా, స్త్రీల సభలన్నా చాలామంది పురుషులకు చులకన, నిరసన భావాలున్నాయి.

**(d) సంఘ స్వాతంత్ర్యం :** సంఘ స్వాతంత్ర్యాన్ని ఆమోదించడం జరిగింది (వి.మా హ.ప్ర. అ. 22 (2); భా.రా. అ. 19 (C)). శాసన లోపంగా ఇది ఎంతో ముచ్చటగాఉన్నా సమాజం స్త్రీల సంఘాలను గౌరవించడంలో వెనకడుగు వేస్తున్నది.

**(e) సంచార స్వాతంత్ర్యం :** దీన్ని అందరూ ఆమోదించారు (వి.మా. హ.ప్ర. అ. 13 (i); భా.రా. 19(d)). అయినా భారత స్త్రీ అందులో ముఖ్యంగా వివాహిత స్త్రీ ఒంటరిగా, నిర్భయంగా ప్రయాణం చేసే స్థితి మనదేశంలో లేదు.

**(f) వృత్తి స్వాతంత్ర్యం :** వృత్తి స్వాతంత్ర్యాన్ని ఆమోదించడం జరిగింది (వి.మా.హ.ప్ర. అ. 23; భా రా. 19 (g)). తనకు ఇచ్ఛవచ్చిన ఉన్నత వృత్తినిగానీ, వ్యాపారాన్ని గానీ, పరిశ్రమనుగానీ, ఉద్యోగాన్ని గానీ చేపట్టుటకు స్త్రీకి సర్వహక్కులను భారత రాజ్యాంగం ప్రసాదించింది. కాగా కొన్ని వృత్తులలో స్త్రీల ప్రవేశంపై ప్రభుత్వాలు, ప్రభుత్వ సంస్థలు కన్నెర్రజేయడం కనిపిస్తున్నది.

## (D) ఆర్థిక హక్కులు :

**(a)** పనిచేయడానికి, తన ఇచ్ఛవచ్చిన ఉద్యోగాన్ని చేయడానికి, న్యాయమైన అనుకూలమైన పని పరిస్థితులను కలిగివుండటానికి ప్రతి వ్యక్తికీ హక్కు వుంది. నిరుద్యోగభృతి పొందాలి తగిన భృతిని పొందడానికి, సమానమైన పనికి సమానమైన జీతానికి కూడా హక్కు వుంది (వి.మా హ.ప్ర. అ. 23). పని హక్కును భారత రాజ్యాంగం గుర్తించలేదు. నిరుద్యోగ భృతిని ఆమోదించలేదు. పని ఎన్నికను సమ్మతించలేదు. అయితే వీటిలో కొన్నిటిని గురించి రాజ్యాంగపు 4వ విభాగంలో ప్రస్తావించడం జరిగింది (భా.రా. 38, 39, 41, 42, 43, 43 (A) అధికరణాలు) జీవన ప్రమాణానికి సంబంధించి కొన్ని హక్కులను ఐక్యరాజ్యసమితి రూపొందించింది (వి.మా.హ.ప్ర. అ. 25). విశ్రాంతి, పనిలో విరామం, జీతంతో సెలవులు ఆమోదింపబడినాయి (వి.మా.హ.ప్ర. 24). భారతదేశంలో ప్రైవేటు రంగంలో స్త్రీల యెడ వివక్ష సాగుతున్నది.

**(b) మాతృత్వానికి, బాలబాలికలకు రక్షణ :** మాతలకు, బాలబాలికలకు ప్రత్యేకంగా సహాయం చేయాలి వారియెడ ప్రత్యేక శ్రద్ధ వహించాలి. పిల్లలు వివాహితులకు జన్మించినా, అవివాహితులకు జన్మించినా సమానులు; సమానమైన సామాజిక రక్షణకు పాత్రులు (వి.మా.హ.ప్ర. అ.25 (2)). భారత రాజ్యాంగపు ఆదేశక సూత్రాలు ఇంత స్పష్టంగా లేవు (భా.రా. అ. 42). ప్రైవేటురంగంలో ఈ సూత్రాన్ని అమలుపరచే అధికారులు లేకపోవడం విచారకరం.

## (E) సాంస్కృతిక హక్కులు :

**(a)** తనుగా తయారుచేసిన శాస్త్రీయ సాహిత్య కళాత్మక రూపాలకు ఆ వ్యక్తి హక్కుదారుడు. ప్రతి వ్యక్తికీ దేశ సాంస్కృతిక జీవితంలో పాలుపంచుకోవడానికి హక్కు వుంది (వి.మా.హ.ప్ర. అ. 27). ఇలాంటి నిబంధన భారత రాజ్యాంగంలో విడిగా లేదు. కాగా ఈ భావం ఆదేశక సూత్రాలలో నిగూఢంగా వుంది. స్త్రీల విషయంగా ఈ హక్కు చాలా తక్కువగా వినియోగంలోకి వస్తుందని గ్రహించడం అవసరం.

**(b)** విద్య : ప్రాథమిక విద్య ఉచితంగాను, సాంకేతిక విద్య అందరికీ అందుబాటులోనూ వుండాలి. ఉన్నత విద్య సమర్థతను బట్టి యోగ్యులకు పొందే అవకాశం అందరికీ వుండాలి (వి.మా.హ.ప్ర. అ. 26; భా.రా. అ. 41). రాజ్యాంగం అమలులోకి వచ్చిన 10 సంవత్సరాలలోగా 14 సంవత్సరాలు నిండేవరకు బాలబాలికలకు ఉచిత నిర్బంధ విద్యను అందించాలని భారత రాజ్యాంగం ప్రభుత్వాలను ఆదేశించింది. అయితే ఇది కేవలం ఆశగానూ, ఆకాంక్షగానూ మాత్రమే మిగిలింది. రాజ్యాంగం అమలులోకి వచ్చి 40 సం॥రాలు అయినా ఈ ఆదర్శం కనుచూపుమేరలోనే వుంది. ఈ పరిస్థితివల్ల ముఖ్యంగా కష్టపడింది, నష్టపడుతున్నది బాలికలని గమనించడం ఆవశ్యకం. స్త్రీలలో అక్షరాస్యులు 24% మాత్రమే వున్నారు. దీన్నిబట్టి విద్యావిషయకంగా స్త్రీల హక్కులు ఎంత నిరాదరణ చెందుతున్నాయో తెలుస్తుంది.

## (F) సమానత్వం :

స్త్రీ పురుషుల సమానత్వాన్ని గురించి విశ్వమానవ హక్కుల ప్రకటన స్పష్టీకరించింది (వి.మా.హ.ప్ర. అ 2). ఈ సూత్రాన్ని అంగీకరిస్తూ భారత రాజ్యాంగం వివరంగా అనేక అధికరణాలను రూపొందించింది. (భా.రా. అ 14, 15, 16, 17, 18). వీటి ప్రకారం మతం, జాతి, కులం, లింగ విభేదం, జన్మస్థానంలపై ఆధారపడి వివక్ష చూపరాదు. అందరికీ శాసనాలవల్ల కలిగే రక్షణ వుండాలి. సమానత్వం లభించాలి. ప్రభుత్వోద్యోగాలలో సమానమైన అవకాశాలు వుండాలి. విశ్వమానవ హక్కుల ప్రకటనలో రాజకీయ భావాలవల్ల, ఇతర అభిప్రాయాలవల్ల, సామాజిక

ప్రారంభంవల్ల, పుట్టుకవల్ల, లేక ఇతర హోదావల్ల వివక్ష ఏర్పడరాదు. అలాగే ఆస్తి సంబంధమైన తేడా వివక్షకు దారితీయరాదు.

**(a) అస్తిత్వం :** స్త్రీ ఫలానివారి భార్యగా లేక ఫలానివారి కుమార్తెగా, ఫలానివారి తల్లిగా మాత్రమే గుర్తించబడుతున్నది. ఇది వివక్షకు నిదర్శనం.

**(b)** సామాజికంగా ఆమె వివక్షకు లోనవుతున్నది. కుటుంబ యజమానిగా వుండే హక్కు ఆమె అనుభవించడంలేదు. వారసత్వ విషయంలో భార్యగా ఆమె హక్కులు అత్యల్పంగా వున్నాయి. వారసత్వం విషయంలో కుమారులకు, కుమార్తెలకూ తేడా వుంటున్నది. సంరక్షకత్వం పరిశీలనాంశంగా తీసుకుంటే తన సంతానపు ఆస్తికి ఆమె సంరక్షకురాలు కాదు. తన సంతానానికి ఆమె 'లా' ప్రకారం సంరక్షు రాలు కాదు. కాకపోతే పసితనంలో పిల్లలను పెంచే హక్కు, బాధ్యతలు మాత్రం ఆమెకు ప్రసాదించబడినాయి. వివాహిత స్త్రీ తనకు దత్తుచేసుకోవడానికి వీలులేదు.

**(c) ఆర్థికంగా :** ఉద్యోగాలు ఇవ్వడంలో, 'ప్రమోషన్'లలో శిక్షణ ఇందించడంలో, ప్రభుత్వ సహాయ సందర్భంగా స్త్రీ వివక్షకు లోనవుతోంది. స్త్రీలను కొన్ని వృత్తులకు మాత్రమే పరిమితంచేసి, ఆ వృత్తులలో వారికి తక్కువ జీతాలను, వేతనాలను, వరుమానాన్ని అందజేసి తేడా చూపించడం సర్వసామాన్యమై పోయింది.

**(d) రాజకీయంగా :** ఈ రంగంలో స్త్రీలకు ప్రవేశం, అవకాశం కల్పిం చడం విషయంలో వారియెడ ప్రత్యేక శ్రద్ధ లేకపోగా వారికి ఇబ్బందులు కలిగిం చడం చూస్తున్నాం.

**(e) సాంస్కృతికంగా :** విద్యాపరంగా, సాహిత్యాభిరుచి, లలిత కళా భ్యాసం సందర్భంగా స్త్రీలకు నిరుత్సాహం, నిరాదరణ, ప్రబలంగా వున్నాయనేది నిర్వివాదాంశం. వారిని తేడాగా చూడడం మామూలు విషయమైపోయింది.

సమానత్వ సిద్ధాంతం; హుందా విషయంలో, హోదా విషయంలో స్త్రీ పురుషు నితో సమానమని విశ్వమానవ హక్కులలో పేర్కొన్నాం. భారత రాజ్యాంగంలో స్పష్టీకరించినా సమానత్వం మృగ్యమవుతున్నది. (వి.మా.హ.ప్ర. భా.రా. 14, 15,

16). కుటుంబంలోని స్త్రీలకు రక్షణలేకుండా పోతున్నది. కుటుంబ సభ్యులు స్త్రీపై జరిపే అత్యాచారాలకు వారిని శిక్షించే బాధ్యతను ప్రభుత్వాలు, ప్రభుత్వాధికారులు చేపట్టటంలేదు. ఇంటిపని, పంటపని ఆమెకే కేటాయించడం అన్ని సమాజాలలో సాగుతున్నది. ఉద్యోగిగా, శ్రమజీవిగా, ఆమె సంపాదిస్తున్నా ఇంటిపని, పంటపని, పిల్లల పెంపకం ఆమె మాత్రమే చేయవలసి రావడంవల్ల ఆమె మూడు రకాల బరువు బాధ్యతలను నెరవేర్చవలసి వస్తున్నది. సమానత్వ సిద్ధాంతం సుందరంగా, ఆర్భాటంగా ప్రకటితమైనా ఆచరణలో ఎమ్మయింది.

స్త్రీల హుందాను, హోదాను కించపరచే శాసనాలు, వారిని అవమానపరచే నియమ నిబంధనలు ఇంకా అమలులో వున్నాయి. వీటిని ఏ ప్రభుత్వమూ ఇంత వరకూ పరిశీలించలేదు. ఏ రాజ్యాంగబద్ధమైన 'కమీషన్' వీటి విషయమై అధ్యయనం చేయలేదు. న్యాయస్థానాల విషయం సరేసరి. కేసువస్తే న్యాయ మూర్తులు అప్పుడు ఆ అంశాన్ని గమనిస్తారు. ఈ పరిస్థితి బాధాకరం; అగౌరవ ప్రదం. మచ్చుకు ఒక 'కేసు' ను గమనిద్దాం. భార్య మిండుగానిపై భర్త క్రిమినల్ కేసు పెట్టవచ్చును; భర్త రండపై భార్య అలాంటి కేసు పెట్టడానికి వీలులేదు. భార్య భర్త ఆస్తి అనే భావం ఇలాంటి శాసన నియమానికి ఆధారం. వ్యభిచారం నింద్యమే. కానీ అది నేరం కాకూడదు. అందులో ముఖ్యంగా స్త్రీ హుందాను తగ్గించే విధంగా నేరం అసలే కాకూడదు. కాకపోతే భార్యాభర్తలలో ఏ ఒక్కరి వ్యభిచార మైనా రెండవవారు విడాకులు కోరడానికి అవకాశం కలిగించవచ్చు.

**(f) అమానుషంగా చూడటం :** ఏ మనిషినీ క్రూర హింసకు, అమా నుష్యమైన లేక అవమానకరమైన శిక్షకు పాత్రులను చేయరాదు. అలాగే ఏ వ్యక్తినీ చిత్రహింసకు లోనుచేయరాదు (వి.మా.హ.ప్ర. అ 5). శాసనము నిర్ణయించిన విధా నంలో వుంటే ఇతరత్రా ఏ వ్యక్తి యొక్క స్వేచ్ఛను, ప్రాణాన్ని హరించరాదు. (భా రా. 621) జీవితమంటే పూర్తి జీవితమన్న మాట. అన్ని అవయవాలతో కూడి వున్నదన్నమాట. బ్రిటన్‌లోని అత్యున్నత న్యాయస్థానం జీవితమంటే రెండుకాళ్ళు వున్నదని నిర్వచించింది. అలాగే విశ్వమానవ హక్కులలోని ప్రతివ్యక్తీ "భారత రాజ్యాంగంలోని మనిషి" అనే పరిధిలోకి బాలిక కూడా వస్తుందని చెప్పనక్కరలేదు. అందువలన బాలికను చిత్రహింసలపాలు చేయరాదు.

# బాలికల హక్కులు

బాలిక అనే పదానికి అనేక రకాలుగా అర్థాలు చెప్పుకోవచ్చు. 1929 బాల్య వివాహ నిషేధ శాసనం ఇప్పటివరకు అనేకసార్లు సవరణ చేయబడింది. ఆ శాసనం ప్రకారం, ఆంధ్ర బాలబాలికల శాసనం ప్రకారం 18 సం॥లు నిండని స్త్రీని మాత్రమే బాలిక అంటారు. భారత శిక్షాస్మృతి మైనర్లను గురించిన నేరాల విషయం ప్రస్తావిస్తుంది. రైలు, బస్సు టిక్కెట్ల సందర్భంగా 12 సం॥ నిండకపోతే బాలికగా పరిగణింపబడుతుంది. 14 ఏండ్లు నిండని ఆడపిల్లను బాలిక అని పిలవడం సర్వసాధారణంగా జరుగుతున్నది. ప్రతి వ్యక్తికి అనేక రకాల వయస్సులు ఉంటాయి. శారీరక అభివృద్ధిని సూచించే వయస్సు, మానసిక పరిణతను తెలియజేసే వయస్సు, పుట్టిన తేదీనుండి లెక్కకు వచ్చే సంవత్సరాల వయస్సు ఇలా వుంటాయి. మొత్తంమీద అన్ని అంశాలను పరిగణలోకి తీసుకొని శాసనాలు చేసిన నిర్వచనాన్ని ఆమోదించడం మంచిది అని తోస్తుంది.

మానవజాతిలో సగంమంది స్త్రీలు. కేవలం ఉనికిని బట్టి మానవులందరికి ప్రకృతిసిద్ధంగా కొన్ని హక్కులు ఏర్పడుతాయి. రాజ్యాలు ఏర్పడిన తరువాత రాజ్యాంగ నిర్మాణం సాగింది. అమెరికన్, ఫ్రెంచి, రష్యన్ రాజ్యాంగాలలో మౌలిక హక్కులను పేర్కొనటం జరిగింది. 1948లో ఐక్యరాజ్యసమితి విశ్వమానవ హక్కుల ప్రకటనను ఆమోదించింది. అయితే భారత రాజ్యాంగంలో మౌలిక హక్కుల విభాగం, ఆదేశిక సూత్రాల విభాగం రెండూ వున్నాయి.

విశ్వమానవ హక్కుల ప్రకటన, భారత రాజ్యాంగం ఈ రెంటిని ప్రాతిపదికగా తీసుకొని బాలికల హక్కులను నిర్వచించటం సముచితం.

బాలికలపట్ల వివక్ష వున్నట్లు "భగవంతుడా! ఆడపిల్లను ఇంకెక్కడైనా పుట్టించు, మాకు మాత్రం మగబిడ్డను ప్రసాదించు" అథర్వణ వేదం సాక్ష్యం చెపుతోంది. తల్లి గర్భంలో పిండంగా ఉన్నప్పటి నుండే తేడా చూపబడుతోంది. ఆడ అని తెలియగానే జన్మించకుండా అడ్డుపడి గర్భస్రావాలు చేయిస్తున్నారు. అంటే 1984-85లో ఒక్క బొంబే పట్టణంలో 40 వేల గర్భస్రావాలు జరిగాయి. అందువల్ల

మగపిల్లలు వెయ్యిమంది వుంటే ఆడపిల్లల సంఖ్య 929 మందికి తగ్గింది. ఏటా ఒక కోటి 20 లక్షల అమ్మాయిలు జన్మిస్తే 15 లక్షల మంది మొదటి సంవత్సరంలోనే మరణిస్తున్నారు. ఇంకా 25 శాతం బాలికలు 15 ఏళ్ళు నిండకుండానే పోతున్నారు.

## జన్మించడానికి, బ్రతకడానికి బాలికకు హక్కు :

**పుట్టటానికి హక్కు :** పురుష ప్రాధాన్య సమాజంలో బాలికలపట్ల నిరాదరణ ఎక్కువగా ఉంటున్నది. వేదకాలం నుంచి ఈ నిరసన భావం ప్రబలంగా మనగల్గుతున్నది. నాకు పుత్రుడిని ప్రసాదించమని ఒక వేదంలో, నా భార్యగర్భంలో ఉన్న స్త్రీ శిశువును పురుష శిశువుగా మార్చమని మరోవేదంలో ప్రార్థనలు ఉన్నాయి. ఇస్లాం మత స్థాపకుడు మహమ్మదు కాలం నాటికి స్త్రీ శిశువులను బ్రతికుండగానే పూడ్చిపెట్టే దురాచారం అరేబియాలో ఉన్నదని, దానిని ఆయన నిరసించాడని, నిషేధించాడని మనకు తెలుసు. భారతదేశంలో కొన్ని ప్రాంతాలలో ఆడపిల్ల పుట్టగానే నోటిలో వడ్లగింజ వేసి చంపే దురలవాటు ఉండేది. అంతేకాదు; ఈనాడు కూడా ఆడపిల్ల కలిగిందనే వార్త వినగానే తండ్రి దుఃఖితుడవటం, తల్లి అవమానంతో క్రుంగిపోవడం మనం చూస్తున్నాం. తనేదో తప్పిదం చేసినట్లు తల్లి బాధపడటం గమనిస్తున్నాం. శరీరశాస్త్ర జ్ఞానం స్త్రీకు లేనందువల్ల ఆడపిల్లను కనడం తమ లోపమని స్త్రీలు భావిస్తున్నారు. నిజానికి ఆడపిల్ల కల్గటం, మగపిల్ల పుట్టటం పురుషుని మీద ఆధారపడుతుంది. ఇందులో స్త్రీయొక్క బాధ్యత ఏమీలేదని స్త్రీలకు తెలియకపోవటం శోచనీయం.

సమాజంలో స్త్రీ పురుషులు సమాన సంఖ్యలో ఉన్నారు. కనుకనే ప్రతి స్త్రీకి భర్త ప్రతి పురుషునికి భార్య లభిస్తున్నారు. స్త్రీ శిశువులు వద్దనుకుంటే, వారిని సరిగా పోషించకుంటే అసలు వారిని పుట్టకుండా చేసుకుంటే సమాజం అస్తవ్యస్తమవుతుంది.

ఈ పరిశోధనా పత్రపు శీర్షిక అపార్థాలకు దారితీసేదిగా ఉంది. స్త్రీ శిశువు జన్మించడానికి హక్కు కలిగిఉందని అంటే స్త్రీ శిశువును కనడానికి స్త్రీకి హక్కు ఉందని అర్థం చేసుకోవాలి. ఆమె ఆడపిల్లను కంటే ఆమెను భర్త నిందించరాదని, బాధపెట్టరాదని ఆమె గర్భంలో ఉన్న శిశువు స్త్రీయని తెలిసిన తరువాత గర్భస్రావం

చేయించుకోమని భర్త ఆమెను బలవంతం చేయరాదని దానిభావం. అంతేకాని స్త్రీకి తన గర్భంమీద ఉండే హక్కును కాలదన్నమనికాదు. ఆమెకు ఉన్న గర్భస్రావపు హక్కును తోసిరాజనటం కాదు.

**బ్రతకడానికి హక్కు :** మధ్యతరగతి కుటుంబాల్లో, పేద కుటుంబాలలో బాలికలను నిర్లక్ష్యంగా చూస్తారు. పోషణ విషయంలో, ఇంటిచాకిరి విషయాల్లో ఆమె పట్ల వివక్ష సాగుతున్నది. చదువు ప్రసక్తి వస్తే ఆమెను చదువు వద్దంటారు. చదువు చెప్పించినా ఏదో నామాకాలపు చదువు చెప్పిస్తారు. ఇంట్లో పుట్టిన పిల్లలను పెంచే బాధ్యత ఆమె నెత్తిన వేస్తారు. ఎంతోకొంత కట్నరూపకంగా వరునికి యిచ్చి పెండ్లి చేసి ఆమెను వదిలించుకుంటారు. ఎంతైనా ఆమె 'పరాయి ధన్', 'ఆడపిల్ల' కదా!

కుటుంబంలో తల్లిదండ్రుల నిరాదరణను, నిర్లక్ష్యాన్ని సహించి, భరించి బాలిక బ్రతికి బట్టకడ్తే అది ఆమె అదృష్టం.

శాసనపు దృష్టిలో స్త్రీ పురుషులు సమానులు అని విశ్వమానవ హక్కుల ప్రకటన 7వ అధికరణం, భారత రాజ్యాంగపు 14, 15(1)వ అధికరణాలు ఘోషిస్తున్నాయి. వివక్ష చూపవలసి వస్తే స్త్రీలకు బాలబాలికలకు అనుకూలంగా వివక్ష ఉండాలని భారత రాజ్యాంగపు 15(3) అధికరణం ప్రకటిస్తున్నాయి.

బాలబాలికలకు ప్రత్యేక రక్షణ, సహాయం ఇవ్వాలని విశ్వమానవ హక్కుల ప్రకటన 25వ అధికరణం చెప్తున్నది. బాలబాలికలను, యువతను దోపిడీ నుండి నిరాదరణ నుండి రక్షించాలని భారత రాజ్యాంగపు 39వ అధికరణం 'రాజ్యం అనుసరించవలసిన మార్గదర్శక సూత్రాలలో' భాగంగా చెప్పింది. 14 సంవత్సరాలలోపు బాలబాలికలు ఫ్యాక్టరీ లో కాని, ప్రమాదకర వృత్తులలో కాని పనిచేయరాదని భారత రాజ్యాంగపు 24వ అధికరణం ఎలుగెత్తి చాటుతున్నది. బాలబాలికలకు ప్రాథమిక విద్య ఉచితంగా ఇవ్వాలని, సాంకేతిక విద్య, ఉన్నత విద్య వారికి అందుబాటులో ఉండాలని విశ్వమానవ హక్కుల ప్రకటన 26 వ అధికరణం వివరిస్తున్నది. రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత 14 సంవత్సరాలు నిండేవరకు బాలబాలికలకు ఉచిత నిర్బంధ విద్య గరపాలని, భారత రాజ్యాంగపు 45వ అధికరణ ఆదేశిస్తున్నది.

ఇన్ని సూత్రాలను, ఇన్ని ఆదేశాలను విశ్వమానవ హక్కుల ప్రకటన, భారత రాజ్యాంగం ప్రకటించినా బాలికల స్థితి దుర్భరంగా ఉంది. ఆడపిల్లను పుట్టనీయక పోవటం, భార్యను బలవంతంచేసి ఆడపిల్ల పుట్టకుండా గర్భస్రావం చేయించడం, పుట్టిన తరువాత ఆమెను సరిగా పోషించక, చదువు చెప్పించక, ఆమెకు పనిలో విశ్రాంతి, విరామం లేకుండాచేసి ఆమెను అష్టకష్టాలు పెట్టటం, పురుష ప్రాధాన్య విలువలను పురుషులు మాత్రమే కాక స్త్రీలు కూడా అనుసరించటం శోచనీయం.

**1. బానిసత్వం - వ్యభిచారం :** ఏ వ్యక్తినీ బానిసత్వంలోగాని, దాస్యం లోగాని ఉంచరాదు. బానిసత్వం, బానిస వ్యాపారం అన్ని రూపాలలో నిషేధింపబడింది. (నాల్గవ అధికరణం విశ్వమానవ హక్కుల ప్రకటన) ప్రతి వ్యక్తి ప్రతిచోట శాసనం దృష్టిలో మనిషిగా పరిగణింపబడాలి. (6వ అధికరణం, విశ్వమానవ హక్కుల ప్రకటన)

మానవులను వస్తువులుగా పరిగణించి వ్యాపారం చేయుట, వెట్టిచాకిరి, నిర్భందపు శ్రమ చేయించడం నిషేధింపబడ్డాయి. (భారత రాజ్యాంగం 23వ అధికరణం)

ఇలాంటి ప్రకటనలు అనేకం ఉన్నా బాలికలను బానిసలుగా విక్రయించడం, వారిచేత వారిని కట్టుబానిసలుగా పని చేయించటం సాగుతూనే ఉంది. వారిని వ్యభిచార రంగంలోకి నెట్టి వారిచేత వ్యభిచారం కొనసాగించటం జరుగుతూనే ఉంది. శాసనరీత్యా దేవదాసి విధానం రద్దుచేయబడినా ఎల్లమ్మ దేవతకు ముక్కుపచ్చలారని బాలికలను అంకితం చేయడం చూస్తున్నాం. ఆంధ్రప్రదేశ్‌లో జోగినులు అని నామకరణం చేసి బాలికలను వ్యభిచార జీవితంలోకి నెట్టి వారిని అవినీతిపరులైన పురుషులకు బలిచేయడం జరుగుతున్నది. వారు వివాహం చేసుకొనుటకు వీలులేదు. వారికి దాంపత్య జీవితానికి అవకాశంలేదు. ఇది "స్త్రీ పురుషులు వివాహమాడుటకు కుటుంబాన్ని నెలకొల్పుటకు హక్కు కలిగి ఉన్నారు" అనే విశ్వమానవ హక్కుల ప్రకటన 16వ అధికరణముకు భంగకరము.

**2. విద్య :** విశ్వమానవ హక్కుల ప్రకటనల 26వ అధికరణం ఇలా చెబుతున్నది. ప్రతి వ్యక్తికి విద్యను పొందుటకు అర్హత ఉన్నది. ప్రాథమిక స్థాయిలో

పసితనంలో ఉచిత విద్య కొనసాగాలి. ప్రాథమిక విద్య అందరికి నిర్బంధం చేయాలి. సాంకేతిక విద్య, వృత్తి విద్య అందరికి అందుబాటులో ఉండాలి ప్రజ్ఞనుబట్టి ఉన్నత విద్య ప్రతిఒక్కరికి చెందేలా ఉండాలి. మానవ వ్యక్తిత్వాభివృద్ధికి విద్య దోహదం చేయాలి. మానవహక్కుల యెడ మౌలిక స్వేచ్ఛలపట్ల గౌరవాన్ని పెంపొందించే దిగా ఉండాలి. "భారత రాజ్యాంగపు 45వ అధికరణలో ఇలా చెప్పబడింది. రాజ్యాంగము అమలులోనికి వచ్చిన 10 సం॥రాల లోగా బాలికలకు 14 సం॥రాలు నిండే వరకు ఉచిత నిర్బంధ విద్య గరపాలి.

మన దేశంలో నిరక్షరాస్యత అత్యల్పంగా ఉన్నదని మన అందరికి తెలుసు. ఆం. ప్ర. లో అతి కష్టము మీదనైనా దస్కత్ చేయగలవారి సంఖ్య 18 శాతం. (1981 - జనాభా లెక్కలు) పురుషులతో పోల్చిచూస్తే స్త్రీలను విద్య విషయంగా నిరాదరణ చేయటం జరుగుతుంది. శ్రామిక కుటుంబాలలో బాలికలను పాఠశాలలకు పంపటంలేదు. తల్లిదండ్రులు ఇంట్లో లేనప్పుడు తన కన్న చిన్నవారు అయిన పిల్లలను సాకటం, ఇంటిపని చేయటం బాలికలకి నిర్దేశించిన విధులు. ఇలా బాలికలకు బాల్యం లేకుండా పోతున్నది. 6 సం॥రాలు రాగానే వారు యువతులవలె వ్యవహరించాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది. పసితనంలోనే వారు గృహ నిర్వహణ బాధ్యతను, మాతృత్వ బాధ్యతను వహించాల్సి వస్తున్నది.

**3. విశ్రాంతి - విరామం:** విశ్వమానవ హక్కుల ప్రకటన 24వ అధికరణంలో ఇలా ఉంది. "పనిలో విరామానికి, విశ్రాంతికి ప్రతి వ్యక్తికి హక్కు ఉన్నది. అంతేగాక పనిగంటల పరిమితి సహేతుకంగా తగ్గించబడాలి. నిర్ణీత వ్యవధిలో జీతంతో కూడిన సెలవలు ఉండాలి". భారత రాజ్యాంగపు 24వ అధికరణం ఇలా ప్రకటిస్తున్నది. "14 సం॥రాల వయస్సుగల బాలబాలికలను కర్మాగారములలోగాని, గనులలోగాని పనిచేయనీయరాదు. అలాగే వారిని ప్రమాదకర ఉద్యోగాలలో నియమించరాదు".

భారత రాజ్యాంగపు 42వ అధికరణం ఏమంటున్నదో గమనిద్దాం". న్యాయమైన మానవీయమైన పని పరిస్థితులను అలాగే పిల్లల తల్లులకు సౌకర్యాలను కలిగించి ఆదుకోవాలి."

ఈ ప్రవచనాల అర్థం ఏమిటి ? 14 సం॥లోపు బాలికలను ఫ్యాక్టరీలలో కర్మాగారాలలో కార్మికులుగా పని చేయనీయరాదు. ఈనాడు మనదేశంలో ఈ సూత్రాలకు భిన్నంగా జరుగుతున్నది. అనేకమంది బాలికలు, కేవలం బీదరికం ఫలితంగా బీడీ పరిశ్రమలోను, టపాకాయల తయారీ కర్మాగారాలలోను పని చేయవల్సి వస్తున్నది. అంతేగాక తమ స్వంత పొలాలలోను, ఇతరుల పొలాలలోను శ్రమిస్తున్నారు. వారి పని పరిస్థితులు దయానీయంగా వున్నాయి. ఇండ్లలో పనిగత్తెలుగా ఉండేవారు దీర్ఘకాలం పని చేస్తున్నారు. వారి పనిగంటలలో ఏ విధమయిన క్రమము లేదు. వారికి నామమాత్రము అయిన విశ్రాంతిగాని, విరామముగానీ లేదు. తల్లిదండ్రుల ఆదేశాలమేరకు ఇండ్లలో పనిచేసే బాలికలస్థితి శోచనీయంగా ఉంది. శ్రమ, కష్టము అలసట వారి జీవిత లక్షణాలు.

**4. జీవన ప్రమాణం :** "తనకు తన కుటుంబానికి తగిన జీవన ప్రమాణాన్ని కలిగి ఉండటానికి ప్రతి వ్యక్తికి హక్కు వున్నది. ఆహారం, దుస్తులు, గృహవసతి, ఆరోగ్యరక్షణం, అవసరమయిన సామాజిక సేవలు, నిరుద్యోగం, వ్యాధి, అంగవైకల్యం, వైధవ్యం వార్ధక్యం తమ అదుపులోకి తేలేని పరిస్థితులలో జీవనం లభించకపోవడం లాంటి సందర్భాలలో భద్రత ఇవన్నీ జీవన ప్రమాణపు పరిధిలోకి వస్తాయి." (విశ్వమానవ హక్కుల ప్రకటన 25వ అధికరణం)

భారత రాజ్యాంగపు 47వ అధికరణం ప్రకారం ప్రజల యొక్క జీవన ప్రమాణాన్ని పోషకాహారాన్ని వృద్ధిచేయవలసిన విధి రాజ్యంపై ఉంది. అలాగే ప్రజల ఆరోగ్యాన్ని మెరుగు పరచడం రాజ్యము యొక్క బాధ్యత. మత్తుపదార్థాల వినియోగాన్ని, ఆరోగ్యానికి భంగకరమైన మాదకద్రవ్యాల వాడకాన్ని నిషేధించడము రాజ్యం యొక్క బాధ్యత.

ఆహారం, వస్త్ర సంపద, గృహవసతి, ఆరోగ్యరక్షత ప్రతి వ్యక్తికి అందుబాటులో ఉండాలి. ఈ సందర్భంగా బాలిక నిరాదరణకు గురిఅవుతున్నది.

బీదరికం మాత్రమే కాకుండా ఆమె పరిస్థితిని దుఃఖభాజనం చేసే అంశాలు అనేకం ఉన్నాయి. బాలుడితో పోలిస్తే ఆమె నిరాదరణకు లోనవుతున్నది. ఆహారం, అందులో ముఖ్యంగా పోషకాహారం, దుస్తులు వీటి విషయంగా ఆమె అవసరాలను తల్లిదండ్రులు పట్టించుకోవడంలేదు. నిర్లక్ష్యం చేస్తున్నారు.

**5. చిత్రహింసలు చెయ్యరాదు :** "ఏ వ్యక్తినీ క్రూరహింసకు, అమానుషమైన లేక అవమానకరమైన శిక్షకు పాత్రులను చేయరాదు. అలాగే ఏ వ్యక్తినీ చిత్రహింసకు లోనుచేయరాదు" విశ్వ మానవ హక్కుల ప్రకటన 5వ అధికరణం).

"శాసనము నిర్ణయించిన విధానములో తప్ప ఇతరత్రా ఏ మనిషి యొక్క వ్యక్తిగత స్వేచ్ఛను ప్రాణాన్ని హరించరాదు" (21వ అధికరణం భారతరాజ్యాంగం).

"జీవితమంటే పూర్తి జీవితం అన్నమాట, అన్ని అవయవాలతో కూడి ఉన్న దన్నమాట". బ్రిటనులోని అత్యున్నత న్యాయస్థానం "జీవితం అంటే రెండు కాళ్ళు ఉన్న"దని నిర్వచించింది.

విశ్వ మానవ హక్కుల ప్రకటనలోని 'ప్రతివ్యక్తి' భారత రాజ్యాంగంలోని 'మనిషి' అనే పదాల పరిధిలోనికి బాలిక వస్తుందని వేరే చెప్పనక్కరలేదు.

బాలికను చిత్రహింసపాలు చేయరాదు. అలాగే ఆమెను అమానుషంగా చిత్రించ రాదు. అవమానకరమైన శిక్షకు లోనుచేయరాదు. శ్రామికవర్గాల కుటుంబాలలో బాలికలను చావబితక కొడతారు. క్రూరంగా హింసిస్తారు. మధ్యతరగతి కుటుంబాలలో శిక్ష పేరుతో పిన్నవయస్సులోని బాలికలను స్నానాల గదులలో బంధిస్తారు. ఇంత కన్నా దుర్మార్గం ఇంకొకటి ఉండదు.

అలవాటుగా బిక్షుకవృత్తిని లేపట్టినవారూ, తద్వారా జీవనోపాధిని సంపాయించుకునేవారూ, బాలికలను దొంగిలించి వారిని వికలాంగులనుచేసి బిక్షుక వృత్తిలో ప్రవేశపెట్టడం జరుగుతున్నది. అటాంటి కేంద్రాలు కలకత్తా నగరంలో పనిచేస్తున్నాయి అని ఒకసారి పత్రికలలో వచ్చింది. ఇది బాలికల యెడ ఘోర అపచారం.

**6. వివక్ష :** ఈ విషయంగా విశ్వమానవ హక్కుల ప్రకటన ఏమంటుందో చూద్దాం. "శాసనం దృష్టిలో అందరూ సమానం. వివక్ష లేకుండా అందరికి శాసనం వల్ల సమానమైన రక్షణ ఇవ్వాలి. వివక్షనుండి అందరికి రక్షణ కావాలి. అంతేకాదు వివక్షను ప్రోత్సహించటం తగదు" (7వ అధికరణం).

"మతం, జాతి, కులము, లింగభేదం, జన్మస్థానం లేక వీటిలో ఏ ఒక్కదాని పైన ఆధారపడి ఏ పౌరునియెడ రాజ్యం వివక్ష చూపరాదు" (భారత రాజ్యాంగము (15) (i). అయితే (15)(3) అధికరణం ప్రకారం స్త్రీలకు బాలబాలికకు అనుకూలంగా ప్రత్యేక సదుపాయాలను రాజ్యము కల్పించవచ్చును.

ఈ సందర్భంగా విశ్వమానవ హక్కుల ప్రకటన తీసిపోలేదు. "బాల్యంయెడ, మాతృత్వంయెడ ప్రత్యేకశ్రద్ధ చూపవలెను. సహాయం చేయవలెను. వివాహబంధంలో కాని, బంధం వెలుపలకాని జన్మించిన బాలబాలికలందరికీ సమానమైన రక్షణ ఇవ్వవలెను. 25 (2) అధికరణం.

భారత రాజ్యాంగము ఇలా అంటున్నది "బాలబాలికలను, యువతీయువకులను ఇతరులు దోచుకోకుండా, దురాగ్గంగా వాడుకోకుండా రక్షించవలెను. అలాగేవారు భౌతికంగా, నైతికంగా, నిరాదరణకు పాత్రులు కాకుండా కాపాడబడాలి" (39వ అధికరణం భారత రాజ్యాంగం).

ఇంత ఆడంబరంగా, ఆర్భాటంగా చేసిన ప్రకటనల సారాంశం ఏమిటి?

1) బాలిక యెడ వివక్ష పనికిరాదు.

2) బాలికను దోపిడినుండి నిరాదరణ నుండి రక్షించవలెను.

సమాజంలో స్త్రీల యెడ వివక్ష ప్రబలంగా ఉన్నదని సామాజిక శాస్త్రజ్ఞులందరికి తెలుసు. బాలికల విషయంలో పరిస్థితి భిన్నంగా లేదు. ఆహారము, వస్త్ర వసతి, వేతనాలు, పని పరిస్థితులు వారియెడ ప్రవర్తన వీటి విషయంగా కుటుంబంలో, పొలాలలో, కర్మాగారాలలో, సమాజంలో బాలిక వివక్షకు గురిఅవుతున్నది.

## మౌలిక హక్కులు - ఆదేశిక సూత్రాలు :

పైన ఉదహరించిన బాలికల హక్కులు మానవ హక్కుల క్రిందికి వస్తాయని మన అందరికి తెలుసు. వాటిని రాజ్యాంగంలోని మౌలిక హక్కుల జాబితాలోకి తెస్తేతప్ప వాటిని న్యాయస్థానాల్లో అమలు పరచలేరు. రాజ్యం అనుసరించవలసిన

ఆదేశిక సూత్రాలను ప్రభుత్వాలు విధిగా అమలుపరచనక్కర లేదు. ఐతే ప్రభుత్వాలు ఎలాంటి నీతిని అనుసరించాలో ఆ సూత్రాలు తెలియజేస్తాయి. రాజ్యం ఒక విధానాన్ని రూపొందించేటప్పుడు అవి ప్రాధాన్యత వహిస్తాయి. ఆదేశిక సూత్రాలను అమలు పరచకపోతే ప్రభుత్వాన్ని తప్పుపట్టలేము. అలాగ అన్నంత మాత్రాన ఆ సూత్ర భిన్నమైన నీతిని, విధానాన్ని, ప్రభుత్వాలు అనుసరించవచ్చునని అర్థం చెప్పకోరాదు.

## బాలికల హక్కుల ప్రకటన - ఫలితం :

బాలికల హక్కులను రూపొందించినంత మాత్రాన ప్రకటించినంత మాత్రాన ఒరిగేదేమిటి? ఇది కేవలం లాంఛనం మాత్రమేనా? లేక దీనివలన ఉపయోగం ఏమయినా ఉన్నదా? ఈ పద్ధతివల్ల నిస్సందేహంగా చాలా లాభాలు ఉన్నాయి.

1) బాలికయెడ ప్రజలయొక్క విద్యుక్తధర్మాన్ని వారికి గుర్తుచేయటం.

2) నిద్రాణమైన ప్రజానీకాన్ని మేల్కొల్పి బాలికల రక్షణకు అవసరమైన సమర్థవంతమైన చర్యలు ప్రజలు తీసుకొనేలాగా వారికి పూనిక కలిగించుట, బాలికల హక్కులకు శాసనపరమైన ఆమోదాన్ని పొందుట, వాటిని అమలు పరచుట.

3) అజ్ఞానాంధకారంలో మునిగివున్న తల్లిదండ్రులు యాజమానులు ప్రభుత్వోద్యోగులు రాజ్యనీతిని రూపొందించువారు వీరి అందరిని ఈ సందర్భమైన ప్రబోధానికి లోను చేయటం.

బాలికల హక్కులను, శ్రేయస్సును పెంపొందించే ఒక్క చర్యనయినా మనం పట్టగలిగితే మనం బాలికల సం॥ విఫలం కానట్టే ఎంచుకోవలెను.

బాలికలకి ఎక్కువ పనికి తక్కువ వేతనం కాదుకదా కనీసం సమాన వేతనం కూడా లభించటం లేదు. పరిశ్రమల్లో, షాపుల్లో, హోటళ్ళలో, ఇల్లు కట్టడానికి, మెకానికల్ షాపుల్లో, చిన్న చిన్న పరిశ్రమల్లో మరెన్నింటిలోనో బాలలు పని చేస్తున్నారు. ఇంటివద్ద బీడీలు, తదితర సామగ్రి తయారు చేసే బాల కార్మికులు చట్టం పరిధిలోకి రాకున్నారు. 1971-81 దశాబ్దంలో 14 సంవత్సరాల వయస్సుగల బాలురు పనిలో పాల్గొనే రేటు 3.5 శాతం తగ్గగా, పనిలో పాల్గొనే బాలికల రేటు

2.3 శాతం పెరిగింది. 1981 లెక్కల ప్రకారం 14 సంవత్సరాల వయస్సుగల బాల కార్మికులు 26 కోట్ల 30 లక్షల మంది. ఇందులో 13 కోట్ల 50 లక్షల మంది బాలికలు. అగ్గిపెట్టెల పరిశ్రమలో పనిచేసే 14 సంవత్సరాలలోపు వున్న బాలలలో 90 శాతం బాలికలే. ఇటువంటి పనులలో నైపుణ్యం ఏ మాత్రం పెరగక, ఒక రకమైన స్తబ్ధత, యాంత్రిక జీవనం అలవడుతుంది. ఇంట్లో పనిపిల్లగా గాని, వ్యవసాయ పనుల్లోగాని, చిన్న పిల్లల్ని చూసుకోవటం ద్వారాగాని కుటుంబ ఆదాయానికి చిన్నపిల్ల శ్రమ ప్రధానమైన దోహదాన్ని ఇస్తోంది. ఇది ఆమె బాల్యాన్నేగాక, నిష్కపటత్వాన్ని కూడా దొంగిలిస్తోంది. ప్రతిగా ఆమెకు అజ్ఞానాన్ని, బలహీనతలను ప్రసాదిస్తోంది.

సగటు వివాహ వయస్సు 16 ఏళ్ళని జనాభా లెక్కలు తేల్చి చెప్పాయి. 15-19 ఏళ్ళ మధ్య అమ్మాయిల మరణాలు 20 శాతం వున్న సంఖ్య ఇంకా హెచ్చు స్థాయికి పెరుగుతోంది అంటే అవి యుక్తవయస్సు దాటని తల్లుల మరణాలేనని మనకు తెలుసు. బాల్య వివాహాలు బాలికల మీద ఇంటి బాధ్యతను, పిల్లల బాధ్యతను పెంచుతున్నాయి. గ్రామీణ బాలిక ఇంటిచాకిరి, ఉపాధికోసం బైటిచాకిరి చేయక తప్పడంలేదు. బాలురు 15 శాతం పనిచేస్తుంటే బాలికలు 55 శాతం పనిచేస్తున్నారనేది లెక్కలద్వారా తేల్చారు.

వ్యభిచారంలోవున్న స్త్రీలలో 20 శాతం బాలికలేనని, ఒక్క బొంబాయిలోనే 20 వేలమంది బాలికలు వున్నారని అంచనాలొచ్చాయి. కుటుంబంలోపల బాలికలపై జరిగే అత్యాచారాలు, లైంగిక దోపిడి వర్ణనాతీతం. దేవదాసీల పేరుతో, జోగినీ వ్యవస్థ ద్వారా వారు వ్యభిచారంలోకి నెట్టబడుతున్నారు. వ్యభిచారిణుల కూతుళ్ళు కులవృత్తిగా ఆదేపనికి దిగజారి పోతున్నారు. తల్లిదండ్రులు చేసిన అప్పులకు కూతుళ్ళను అమ్ముకునే దుస్థితివల్ల బాలికలు గతిలేక వృత్తిలోకి దిగి తమ జీవితాలను సర్వనాశనం చేసుకుంటున్నారు.

బాలబాలికల హక్కులను గురించి ప్రకటించి ఇప్పటికి 30 సంవత్సరాలు దాటిపోయింది. పిల్లల హక్కులు అంటే ఇందుతో బాలబాలికలకు కూడా హక్కులు కలిసే వుంటాయి. ఈ హక్కులు పౌర, సాంఘిక, వైజ్ఞానిక సంబంధమైనవిగా విభ

జించవచ్చు. పిల్లల పౌరహక్కులంటే స్వంత పేరు, జాతీయత కలిగివుండే హక్కు. తిండి పెట్టకపోవడం, దెబ్బలు కొట్టడం నుండి రక్షణ, తల్లిదండ్రులతో కలిసివుండే స్వేచ్ఛ మొదలైనవి వున్నాయి. ఆర్థిక హక్కుల్లో సాంఘిక భద్రత, సరియైన అభి వృద్ధికి అవసరమైన జీవనస్థాయి హక్కు, పనిలో శ్రమ, దోపిడి నుండి రక్షణ వున్నాయి. అలాగే సాంఘిక హక్కుల్లో అత్యున్నత ఆరోగ్యస్థాయిని చేరుకునే హక్కు, వైద్యసేవలు పొందుట, వికలాంగులకు ప్రత్యేక శ్రద్ధ, ఎత్తుకొనిపోకుండా, లైంగి కంగా, సాంఘిక దురన్యాయాలకు లోనుకాకుండా రక్షణ, దత్తతల క్రమబద్ధత వున్నాయి, సాంస్కృతిక హక్కులలో విద్య నేర్పే హక్కు, సరియగు సమాచార సేకరణకు అవకాశాలు, విశ్రాంతి, వినోదాలకు అవకాశాలు, కళలు, సాంస్కృతిక రంగాల్లో పాల్గొనే హక్కు వున్నాయి.

ముఖ్యంగా ప్రాధమిక హక్కులుగా పిల్లలకు బ్రతికే హక్కు, రక్షణ హక్కు, ారి అభివృద్ధికి గల హక్కులను గ్యారంటీగా ఇవ్వాల్సివుంటుంది, వాళ్ళను కొన్ని ఇరాచారాలనుండి కాపాడాలి. ముఖ్యంగా తమకు సంబంధించిన విషయాల్లో వారి అభి ప్రాయాలను వెలిబుచ్చే అవకాశం తప్పక కలిగించాలి. బాలికలకు పాలిచ్చే కాల పరి మితి తక్కువ. బాలికలకు వైద్యసౌకర్యం కలిగించడంలో నిర్లిప్తత, 9 ఏళ్ళ బాలి కలు చిన్నపిల్లలను సాకాలి. ఆ వయస్సు బాలురు బడికి వెళతారు. బాలికలపట్ల చూపుతున్న వివక్షతవల్ల పసివయస్సులోనే స్త్రీ పురుష వివక్షతకు పునాదులు వేయ బడుతున్నాయి. అంతేకాదు బాలికగా వున్నప్పుడే ఆమె హక్కులను నిరాదరణ చేస్తే మహిళగా మారినా ఆమె ఏ హక్కూ పొందలేదు. ఈనాటి బాలికే రేపటి మహిళగా మారుతుందికదా! విజ్ఞాన రహితులై బాలికల హక్కులను ధ్వంసం చేయటం మహా ఘోరం. అందువల్ల మహిళలకు విద్యా విజ్ఞానాలతోపాటు వారి హక్కులు కూడా మృగ్యమయిపోతాయి. కనుక మానవ హక్కులతోపాటు మహిళల హక్కులు, బాలి కల హక్కులు రక్షించటం మన ప్రథమ కర్తవ్యం.

విశ్వమానవ హక్కుల ప్రకటనలో, భారత రాజ్యాంగంలో స్త్రీలకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, సమానత్వాన్ని ప్రసాదించడం గమనించాం. ఆర్థిక హక్కులు, సాంస్కృతిక హక్కులు కొన్ని సామాజిక హక్కులు అమలుచేయడానికి వీలులేకుండా భారత రాజ్యాంగంలో, ఆదేశక సూత్రాలలో మాత్రమే ఉటంకించబడినందున మహి ళలకు ఐక్యరాజ్యసమితి గుర్తించిన మానవ హక్కులు అందుబాటులో లేకపోయినాయి.

మహిళల యెడ వివక్ష విలయతాండవం చేస్తున్నది. విశ్వమానవ హక్కుల ప్రకటన కేవలం ఆదర్శాల పుట్టగా మిగిలిపోయింది. అయితే అందులో నిర్దేశింపబడిన హక్కులకు, ప్రయోజనాలకు రూపకల్పన చేసేనిమిత్తం పౌరహక్కులు, రాజకీయ హక్కులు వీటి విషయంగా ఒక అంతర్జాతీయ ఒప్పందాన్ని, సాంస్కృతిక, ఆర్థిక అంశాలపై మరొక అంతర్జాతీయ ఒప్పందాన్ని ఐక్యరాజ్యసమితి తయారుచేసింది. ఇవి 1976లో అమలులోకి వచ్చినా, వీటిని అమలుపరుస్తామని భారతదేశం ఇంతవరకు తన సమ్మతిని తెలియజేయలేదు. ఆ కారణంగా స్త్రీల హక్కులకు భంగం కలుగుతున్నదని, మహిళల యెడ వివక్ష సాగుతున్నదని భారత మహిళలుగానీ, ఆసక్తిగల ఇతరదేశ ప్రభుత్వాలుగానీ ఐక్యరాజ్యసమితికి ఫిర్యాదులు చేయడానికి అవకాశంలేదు. మనదేశ ప్రభుత్వం మహిళల స్థితిగతులను గురించి, వారి హక్కుల పరిరక్షణ గురించి ఐక్యరాజ్యసమితికి నివేదికలు పంపనవసరం లేదు. అంటే భారతదేశంలోని పౌరులను అందులో ముఖ్యంగా మహిళలను ప్రభుత్వాలు అన్యాయం చేస్తున్నా, దేశంలో పురుషులు స్త్రీల హక్కులను కాలరాస్తున్నా ఐక్యరాజ్యసమితి, ఇతర దేశాలు, ప్రపంచ ప్రజలు పట్టించుకోవడానికి వీలులేదు. భారత మహిళల పరిస్థితులు దయనీయంగా వున్నాయని తెలుతున్నది. స్త్రీలను మానవులుగా పరిగణించడం లేదని గుర్తించవలసి వున్నది. ఒకవేళ కొన్ని సమాజాలలో స్త్రీ పురుషులు సమానులని అంగీకరించినా వారిని ద్వితీయశ్రేణి మానవులుగా పరిగణించడం సర్వసాధారణమైంది. మహిళలు మానవ హక్కులకు సంపూర్ణంగా నోచుకోలేని పరిస్థితి ఇది; న్యాయసూత్రాలకు, మానవ ధర్మాలకూ ఇది వ్యతిరేకం. దీన్ని సహించరాదు; సహించడం భావ్యంకాదు. 15 సంవత్సరాల నుండి స్త్రీలలో ఉధృతంగా ఉద్భవించిన జాగృతీ చైతన్యాల ఫలితంగా మహిళాలోకపు స్థితి, పరిస్థితి మారగలదని ఆశించడం పేరాస కాదు.

చివరగా విశ్వమానవ హక్కుల ప్రస్తావనతో ఈ గ్రంధాన్ని ముగించటం నా ముఖ్య కర్తవ్యం, అది స్త్రీ కాని, పురుషుకు కాని అన్యాక్రాంతం చెయ్యటానికి వీలు కానివి. నైతిక విలువలతో మిళితమైనవి, మనిషిగా పుట్టినందుకు మానవత్వంతో తొణికిసలాడేవి అసలయిన మానవ హక్కులు. ఇవి వ్యక్తి గౌరవాన్ని, హోదాను నిలుపుతాయి. ఈ హక్కుల ప్రాతిపదికల జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో చట్టాలను, సిద్ధాంతాలను తయారుచేస్తే దేశ దేశాల మధ్య, వ్యక్తికి, వ్యక్తికి మధ్య శాంతి లభిస్తుంది, సదవగాహన పెంపొందుతుంది. ఏదయినా అశలు ప్రజలు చైతన్యవంతు

లయితేనే ఈ మానవ హక్కులను రక్షించుకోటానికి, అనుభవించటానికి అర్హులవుతారు. కనుక ప్రజలే సూత్రధారులు, పాత్రధారులూ కావాలి.

ఈనాడు సంస్కృతికంగా, నాగరికంగా, మతపరంగా, తాత్వికంగా మానవులంతా ఒకటే అని, మానవ హక్కులు అనుభవించే హక్కు ప్రతి వ్యక్తికీ వుందని వక్కాణిస్తున్నారు. కాని ఆ భావం అందరికీ అనుభవైకవేద్యం కావటంలేదు. అందువల్లే ఈ హక్కులను గూర్చి ఇంతగా ప్రచారం చెయ్యాల్సి వస్తోంది. ఇవి సహజమైన హక్కులు గనుక సహజ సూత్రాలని కూడా గుర్తింపుపొంది 18వ శతాబ్దంలో చట్టబద్ధం చేశారు. అంటే ఈ సహజ సూత్రాలకు ఒక మౌలిక స్థానం ఏర్పడి ప్రభుత్వాలకు ప్రజలకు మధ్య ఒక ఒప్పందం ఏర్పడింది. లేకపోతే రాజ్యాలు విచ్చలవిడిగా స్వైరవిహారం చేసేవి. వ్యక్తులు ఛిన్నాభిన్నంగా వ్యవహరించేవారు. ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం ఈ హక్కుల ఆవశ్యకతను గుర్తించి తమ తమ రాజ్యాంగాలలో పొందుపరచటమేకాక అంతర్జాతీయ మానవహక్కుల ప్రకటనను కూడా అనేక రాజ్యాంగాలు ఆమోదించాయి. అందువల్లే (మధ్యవర్తిత్వాన్ని ఆహ్వానిస్తే తప్ప) ఒకదేశపు అంతరంగిక వ్యవహారాల్లో మరో దేశం జోక్యం చేసుకోదు. మానవహక్కుల పరిరక్షణ నానాజాతి సమితి తన విధులలో చేర్చకపోయినా ఆ విధి నిర్వహణలో ప్రముఖంగా కృషి చేస్తూండడంవల్లనే ప్రపంచశాంతి నిలబడగల్గుతోంది. అంతేకాదు 1945లో "హక్కుల కమీషన్" ఏర్పాటుచేసి అంతర్జాతీయ మానవ హక్కులను తయారుచేసే బాధ్యతను అప్పచెప్పింది. ఇందులో రాజకీయ, పౌర సంబంధమైన ముఖ్యలక్షణాల్లో జీవించే హక్కు, స్వేచ్ఛగా బ్రతికే హక్కు, భద్రతకు హక్కు, భావప్రకటనకు హక్కు, మతాభిమానంవంటి హక్కులు వున్నాయి. అంతేకాదు బానిసత్వం, చిత్రహింసల విముక్తికి కూడా హక్కు వుంది. ఈ కమీషన్‌లో జాతి, వర్గ, వివక్షతలను తొలగించే కమిటీని కూడా ఏర్పరచడం ముదావహం. వివిధ రంగాలలో మానవ హక్కుల ఉల్లంఘన అంశాలను చేపట్టటానికి, రక్షించటానికి 'యునెస్కో' కూడా కృషి చేస్తోంది.

ముఖ్యంగా స్త్రీలకు ఈనాడు ఎన్నిరకాల హక్కులు వున్నాయో. వాటి స్వరూప స్వభావాలు ఏమిటో తెలియజేయాలి. ఆ తరువాత వాటిని అనుభవించగల ధైర్యాన్ని కలుగజేయాలి. అలాంటి రాజ్యం, సమాజం, కుటుంబం వున్ననాడే ఈ అస్త్రశస్త్రాలు

వుండవు. చెప్పుచేతల్లో పెట్టుకోవాలనే వాంఛ ఉన్నప్పుడే జీవి తలెత్తక తప్పదు. డార్విన్ అన్నట్లు 'అణచబడ్డ ప్రతి జీవి వత్తిడికి తట్టుకోలేక ప్రతిఘటిస్తుంది". అంటే సమాజాన్ని సవ్యంగా నడిపించే విలువలు మాత్రమే నిలుస్తాయి. మిగతావి అంతరిస్తాయి. ఏదైనా స్త్రీని బంధించే పాతకాలపు విలువలు, నాటి ఆదర్శాలు విడనాడి మనం ఆధునికులం కావాలి. దానికి ముఖ్యంగా స్త్రీలలో జాగృతి, చైతన్యం, ఆత్మవిశ్వాసం కలగాలి.

అసలు హక్కులు యాచించేవి కావు, ఒకరిచ్చేవి అంతకన్నా కావు. హక్కు అనేది జన్మతః వచ్చేది; యాచించేది ధర్మం. హక్కుల్ని అనుభవించగల శక్తి, సామర్థ్యాలు స్త్రీలలో రావాలంటే వారి దృక్పథంలో మార్పు రావాలి. 'చట్టాలకు కట్నాలు పోతయ్యా?' అన్నట్లు చట్టాల ద్వారా, ఆర్డినెన్సుల ద్వారా స్త్రీలలో మార్పు తేవటం దురూహ్యం. చట్టం అనేది కేవలం ఒక పనిముట్టు. అది కొంత రక్షణనిస్తుంది; మరికొంత భయాన్ని కలిగిస్తుంది అంతే, కానీ మనలో దాస్యవిముక్తి రానంతకాలం, మనలో ఆత్మవిశ్వాసం లేనంతకాలం, మనలో శాస్త్రీయ దృక్పథం పుంజుకోనంతకాలం మనల్ని రక్షించేవారూ వుండరు. మనం సమానత్వాన్ని సాధించనూలేము. స్వేచ్ఛావాయువుల్ని పీల్చనూ లేము. మన హక్కులను మనం అసలే అనుభవించలేము. కనుక స్త్రీలు సామాజిక కార్యకర్తల విషయంలో ప్రేక్షకులుగా వుండరాదు. స్వేచ్ఛగా, చైతన్యంకల వ్యక్తులుగా, ఆర్థిక, రాజకీయ రంగాలలోకి చురుకుగా దూకాలి. తమ బానిసత్వ సంకెళ్ళను తెంచుకోవాలంటే పాత ఆచారాలను, కట్టుబాట్లను అధిగమించాలి. దానికి ముమ్మందుగా వారి భావాలలో, దృక్పథంలో మర్పు రావాలి. అనాడే స్త్రీ తనకున్న హక్కుల్ని అనుభవించగలుగుతుంది. తద్వారా కుటుంబానికి, సమాజానికి, దేశానికి నిజమైన శాంతి, అభ్యుదయం కలుగుతాయి. అసలు మానవ హక్కులు ఏ ఒక్క వ్యక్తికి, దేశానికి, ప్రభుత్వానికి తమ అంతరంగిక అంశం కానేకాదు. దానికి ఎల్లలు లేవు. దేశ, కాల, హద్దుల పరిధిని అధిగమించి విశ్వమానవులందరికీ సర్వకాలాల్లో ఆచరణయోగ్యమై అమలుపర్చగలవే విశ్వ మానవ హక్కులు. హక్కులను చట్టాలలో పొందుపరచినా, ప్రభుత్వాలు హామీ ఇచ్చినా ప్రజల్లో చైతన్యం లేకపోతే ప్రయోజనం శూన్యమవుతుంది. కనుక స్త్రీ పురుషులెల్లరూ వీటిని తెలుసుకోవటం, గౌరవించటం, ఆచరించటం, ప్రచారం చెయ్యటం తమ కర్తవ్యంగా భావించటానికే ఈ హక్కుల పత్రాన్ని వెలువరించటం జరిగింది.

# స్త్రీల సమస్యలు : హక్కులు - బాధ్యతలు

"పురుషులకు లేని ప్రత్యేక చిక్కులు స్త్రీలకు ఉన్నాయా?" అని ఒక మిత్రుని ప్రశ్న. అసలు స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? వుంటే అవి పురుషులకు సంబంధించినవి కావా? స్త్రీ బాగుపడితే పురుషుడూ, పురుషుడు బాగుపడితే స్త్రీ బాగా వున్నట్లే కదా? ఇద్దరి సమస్యలకూ అవినాభావ సంబంధం లేదా? ఇద్దరి సమస్యలూ ఒకటి కావా? వనితలు ఎదుర్కొంటున్న చిక్కులనే పురుషులు మరో రూపంలో ఎదుర్కోవటం లేదా? పురుషులంతా సుఖ సంతోషాలతో జీవిస్తున్నారా? ప్రత్యేకంగా స్త్రీలను గురించి ఎదుకింత "హంగామా" అని విమర్శించడం జరుగుతోంది. కనుక చర్చనీయాంశమయింది.

ప్రకృతి స్వభావాన్ని బట్టి స్త్రీ పురుషులకు శారీరక, మానసిక పరిణామాలు ఎలా విభిన్నాలో వారి సమస్యలు సైతం వేరే. బాలురకు, యువకులకు, వృద్ధులకు వేరు వేరు సమస్యలెలా వుంటాయో స్త్రీ పురుషులకు కూడా వేరు వేరుగా సమస్యలు వున్నా స్త్రీలకు మాత్రం ప్రత్యేక సమస్యలు వున్నాయనేది నగ్న సత్యం. అంతస్తుల లోను, గౌరవాదరాలలోను, స్త్రీ పురుషు లిద్దరికీ భేదం లేదన్న వాదన లాంఛన ప్రాయంగానే నిలిచి పోయింది స్త్రీ పుట్టిన నాటి నుండి పరాధీనయే. పురుష దండన, పుత్ర దండన అనేవి ఆమె ఆజన్మాంతం అనుభవిస్తూనే వుంది. అలాంటివి అనేకం ఆచరణలో వున్నాయి. మన ఆచారాన్ని బట్టి స్త్రీ అత్తింటికి వొస్తుంది, కాని పురుషుడు అత్తింట్లో నివాసముండడు కదా! బాల వితంతువయినా ఆమె మళ్ళీ పెళ్ళాడితే ఆ వివాహాన్ని సంఘం గర్హిస్తుంది. వ్యభిచారం జరిగితే అది చెడింది అంటూ తప్పంతా స్త్రీలగానే నిరూపిస్తారు. అలాగే ఒక కన్య తల్లి అయితే ఇక ఆ తల్లి చావాలి లేదా సంఘ బహిష్కృత అయినా కావాలి. భార్యా భర్తల ఆశయాలు వేరుగా వున్నప్పుడు భర్త లక్ష్యాలుమాత్రం నెరవేరటం సహజం. ఆమె కోర్కెలు, లక్ష్యాలు, ఆదర్శాలు పరిగణనలోకి అది ఆకాశ కుసుమంలాంటిది. ఏ కన్యకో విధవ రాలికో జరుగుతుంది లేదా భర్తను పరిత్యజించాల్సిన పరిస్థితి రావచ్చు. ఆమె ఆరు సంవత్సరముల నుండి జీవితాంతం రోజంతా ఆమె ఎంత చాకిరీ చేసినా పోషింపబడేది ఆడ మనిషే అవుతోంది. విద్యకాని, ఉద్యోగంకాని అఖరికి ఓడ్డలెందర్ని కనాలన్నా

అన్నీ భర్త ఆజ్ఞలపై ఆధారపడి వుంటాయి. ఇలా ఎన్నో మరెన్నో ఆతవారిని కృంగదీసే అంశాలు వున్నాయి.

ఏదయినా స్త్రీలకు ప్రత్యేక సమస్యలు లేవని, వారి సమస్యలు మానవాళి సమస్యలలో భాగమని, వారి సమస్యల పరిష్కారానికి ప్రత్యేక కృషి అనవసరమని, వారి కోరికలు సాధించడానికి ప్రత్యేకంగా సంఘాల నిర్మాణం సాగించవలసిన ఆగత్యం లేవని కొందరు వాదిస్తుంటారు. ఇలా వాదించే వారిలో అనేక రకాలవారు ఉన్నారు. స్త్రీల శ్రేయస్సును కాంక్షిస్తూనే నిజాయితీగా నిర్మలమైన మనస్సుతో ఆలోచించేవారు మొదటిరకం. అలాకాక స్త్రీలు చైతన్యవంతులయితే వారు తమ హక్కులను తాము గుర్తిస్తే, తమ కోరికలను తాము వెలువరిస్తే స్త్రీలచేత పూర్వం చేయించుకున్నట్లే దాస్యం చేయించుకోలేమని భయపడి స్వార్థబుద్ధితో స్త్రీలకు ప్రత్యేక సమస్యలు లేవనేవారు రెండవ రకం. ఈ తరగతి వారి కుతంత్రాలను మనం వెలికి తీయాలి. తమకు వ్యక్తిత్వం ఉందనే విషయం గమనించక, తమ హక్కులేవో తమకు తెలియక, తమ అభ్యుదయానికి కావలసిన సాధన సంపత్తిని గుర్తించలేక సతమత మవుతూ అజ్ఞానాంధకారంలో మునిగి ఉండే స్త్రీలు మూడవ రకం. ఇందులో మొదటిరకం వారిని సహృదయంతో అర్థం చేసుకొని వారి వాదనలోని పసను పసిగట్ట డానికి ప్రయత్నించాలి. మూడవ రకానికి చెందిన స్త్రీలను సానుభూతితో చూస్తూ వారికి విషయాలు తెలియజేయడానికి శ్రద్ధ వహించాలి. ఇక స్వార్థ చింతనతో, కుయుక్తులతో, కుంటిసాకులతో, కుతర్కాలతో వాదనకు దిగి స్త్రీలను అన్యాయం చేయాలనే దుర్మార్గ ప్రవృత్తిగల పురుషులను ఎండ కట్టాలి. వారికి బ్రెయిన్ వాష్ చెయ్యాలి.

ఇక అసలు సమస్యను పరిశీలిద్దాము. మానవాళిలో స్త్రీలూ, పురుషులూ ఉన్నారు. ఇరువురు ఒకరితో మరొకరు సన్నిహిత సంబంధం కలవారు. స్త్రీలేని కుటుంబం, పురుషుడులేని కుటుంబమనజాలదు. స్త్రీ పురుషుల కలయిక లేకపోతే మానవ జాతిలో సృష్టి ఆగిపోతుంది. కనుక వారిరువురూ ఒకరిపై మరొకరు ఆధార పడిన వారు అని మనం ముందుగా గుర్తించాలి. ఇరువురి సహకారంతో కుటుంబం, సమాజం నడుస్తున్నాయికదా! పైగా ఇరువురూ మానవ వ్యక్తులే. అంటే స్త్రీ ఒక వ్యక్తి అన్నమాట. అలాగే పురుషుడు. ప్రతి వ్యక్తికీ కొన్ని లక్షణాలు ఉంటాయి.

ప్రతిజీవి బ్రతకాలని ఆశిస్తుంది. అందుకోసం ఆరాట పడుతుంది. చీమలు వానా కాలంలో తిండికోసం ముందుజాగ్రత్త వహిస్తాయి ప్రతి పురుగూ, పిట్టా, జంతువు తమ శత్రువుల బారినుండి రక్షించుకోవటానికి అనేక విధాలుగా ప్రయత్నిస్తూ వుండ టం మనం చూస్తూనే వుంటాం. కాగా మనిషికి మెదడు ఉంది. ఆలోచన శక్తి ఉంది. ఉద్వేగాలు ఉన్నాయి. ఆవేశ కావేషాలు ఉన్నాయి. వీటిని వెలువరించటానికి భాష ఉంది. ముందుతరాల వారికి తమ భావాలను అందించటానికి అవసరమైన సాధన సంపత్తిని మనుష్యులు సంతరించుకున్నారు. ప్రకృతి శక్తులనుండి బాధలేకుండా చేసుకోవటానికి తమ దేహాలను మలుచుకొనే ఇతర జీవులవలె కాకుండా మానవులు ప్రకృతిని తమకు అనుకూలంగా మలుచుకుంటున్నారు. ఇలా తమ స్వేచ్ఛకోసం, వ్యక్తిత్వ వికాసం కోసం మానవులు శ్రమిస్తున్నారు. ఈ ప్రయత్నాన్ని అభ్యుద యంగా భావిస్తున్నాం. ఒకరుగా అభ్యుదయం సాధించుకుంటే వ్యక్తిగత అభ్యుదయం అంటాం. అందరూ కలిసి అభ్యుదయం వైపు పయనం సాగిస్తే సామాజిక అభ్యుదయం అంటాం. సామాజిక అభ్యుదయంలో స్త్రీ పురుషు లిద్దరూ భాగస్వాము లనేది నగ్నసత్యం.

కాగా సమాజంలో, కుటుంబంలో స్త్రీ పురుషుల హోదాను గురించి అనేక అభిప్రాయాలు చలామణిలో ఉన్నాయి. శారీరక నిర్మాణం విషయంగా కొద్దిపాటి తేడాలు తప్ప తతిమ్మా అంశాలన్నింటిలో స్త్రీ పురుషులు ఆలోచనలలో, ఉద్వేగాలలో శక్తిసామర్థ్యాలలో సరిసమానులు అనే అభిప్రాయం మొదటిది. అలాకాక స్త్రీ ప్రకృతి వేరు, పురుష స్వభావంవేరు అనే భావం కొంత ప్రచారంలో ఉంది. దీనిని రెండవ వైఖరిగా పేర్కొన వచ్చును. ఈ భావాన్ని మహాత్మాగాంధి, రస్కిన్ ప్రభుతులు ఆమోదించి ప్రచారం చేశారు. అంటే దీని అర్థం స్త్రీ పురుషులు సమానులే కాని వారి శక్తియుక్తులు వేరు వేరని, స్త్రీ ప్రకృతి జడ రూపమని, పురుషశక్తి చైతన్య వంతమని, కనుక స్త్రీ పురుషుని కన్న తక్కువ అని కొంతమంది ప్రచారం చేస్తున్నారు.

పై చెప్పిన మూడు వైఖరులలో చివరిది ఏమాత్రము ఆమోదయోగ్యంకాదు. పురుషులు చేస్తున్న పనులన్నింటిని ఇంచుమించుగా స్త్రీలూ చేస్తున్నారు. తెలివి తేటలలో దేహదారుఢ్యంలో, యంత్రాలను వాడే నేర్పరితనంలో, సృజనాశక్తిలో,

కళానైపుణ్యంలో దేనిలోనూ-స్త్రీలు పురుషులకు తీసిపోవటంలేదు. అలాంటప్పుడు ఈ భావాన్ని అంటిపెట్టుకొని ఉండటంలో ఔచిత్యంలేదు. ఇక మరో వైఖరిని గురించి ఆలోచిద్దాం. పురుషుడు చేయలేని పని స్త్రీ చేస్తున్నది. గర్భాన్ని ధరించి, తొమ్మిది నెలలు మోసి, ప్రసవించి, తరువాత కన్నపిల్లకు పాలివ్వగల శక్తి కేవలం స్త్రీకే ఉన్నమాట వాస్తవం. అది ఆమె ప్రత్యేక లక్షణం అంటే పురుషుని కన్న ఆమెకుగల అదనపు శక్తి సామర్థ్యం అన్నమాట. దానివల్ల మానివాళి మనుగడకు ఆమె దోహదం చేస్తున్నది. అందుకు ఆమెను పురుషులు అభినందించాలి. ఆమెకు ప్రత్యేక సౌకర్యాలు కలుగచేయాలి. అంతేగాని ఆ కారణాన, దానిని సాకుగా తీసుకొని ఆమెను నిష్క్రియా పరురాలని-అంటే ఏమీ చేయలేని దానినిగా-చేయరాదు. అది మానవాళికే అపచారం. అది కృతజ్ఞత లేకపోవడం. ఏరుదాటి తెప్ప తగుల వేసే మనస్తత్వం. ద్రోహం. కుత్సితం. ఈ సాకుతో ఆమెను వంటయింటికీ, పడకటింటికీ పరిమితం చేసి, ఆమెను దాస్య శృంఖలాలలో కట్టిపడవేసి ఆమెను మర బొమ్మగా తయారు చేయటం అన్యాయం. స్త్రీజాతి యెడల అన్యాయమేకాక పురుషు లకు కూడ ఆత్మ వినాశకరం. సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక రంగా లన్నింట తన సహచరి తనకు దీటుగా ఉండి, తనతో సహకరిస్తూ ఉంటే పురుషుడికే లాభం. ఈ విషయాన్ని దూరదృష్టి గల పురుషులు గ్రహిస్తున్నారు. కేవలం ఈ రోజుతో పబ్బం గడుపుకోవాలనే మనస్తత్వం గలవారు గుర్తించలేరు. అలాంటి వారు తామే నష్టపోతున్నారు.

ఈనాటి ప్రజాస్వామిక యుగంలో స్త్రీ పురుషులు సమానులని అందరూ అంగీ కరిస్తున్నారు. కొందరు లాంఛనప్రాయంగా ఆమోదిస్తుంటే మరికొందరు మన స్ఫూర్తిగా ఆ సూత్రాన్ని విశ్వసిస్తున్నారు. గుండెలోనుండి కాక పెదవుల మీదినుండి ఆ భావాన్ని వెలువరించేవారి సంఖ్య ఎక్కువగా ఉంటున్నది. వారు కుహనా తర్కంతో, తప్పుడు వాదనలతో స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించడానికి, ఆమె సమాన హోదాను అంగీకరించటానికి వెనుకాడుతున్నారు. వారి వాదనలకు విలువ కట్టడం అనవసరం.

స్త్రీ పురుషులు సమానులన్నారు కదా కనుక స్త్రీలకు ప్రత్యేకంగా పాయిఖానా లక్కరలేదు, ప్రత్యేకంగా సదుపాయాలు అక్కరలేదనే వారూ ఉన్నారు. ఇటీవల

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో స్త్రీ పురుషుల సమాన హక్కుల బిల్లును వ్యతిరేకిస్తూ కొందరు పురుషులు చేసిన వితండవాదన వైవిధంగా ఉంది. ఇది అక్కసుతో కూడిన దృక్పథం. స్త్రీలు సమానత్వం కోరుతున్నారనే బాధతో, వారిని ఇబ్బంది పెట్టాలని చేసే కుటిల ప్రయత్నం ఇది.

'ఇకపోతే స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా?' అనే అంశాన్ని విడమర్చి విశదీకరించవలసి ఉన్నది. వారి సమస్యలు అనేక విధాలుగా పుట్టున్నాయి. శారీరక నిర్మాణంలో గల తేడాలనుబట్టి, కుటుంబంలో వారి స్థితిగతులనుబట్టి, సమాజంలో వారి హోదాను బట్టి, రాజకీయాలలో వారి ప్రవేశము, ప్రమేయం, భాగస్వామ్యం మొదలుగాగల అంశాలవల్ల, ఆర్థికంగా వారు పురుషులపై ఆధారపడి వుండవలసిన దుర్గతి వల్ల, సాంస్కృతిక రంగంలో వారికి ఉన్నతస్థానాన్ని యివ్వనందువల్ల అనేక సమస్యలు స్త్రీలకు ఉత్పన్నమవుతున్నాయి. వాటిని గురించి వివరంగా తెలుసుకోవటం అవసరం.

శారీరక నిర్మాణం విషయం పరికిస్తే పిల్లలను కనడానికి అనువైన పద్ధతిలో స్త్రీ శరీర నిర్మాణం ఉన్నది. గర్భిణిగా ఉన్నప్పుడు కొన్ని నెలలు ఆమెకు విశ్రాంతి అవసరం. అలాగే ప్రసవకాలంలో ఆమె బరువు పనులు చేయటానికి వీలులేదు. ప్రసవానంతరం కొన్ని నెలలు ఆమె బండపనులు చేయటం మంచిదికాదు. అంతేగాక పిల్లలకు కొన్ని నెలలు పాలివ్వవలసి ఉంటుంది. తల్లిపాలు డబ్బా పాలకన్నా మంచివనే విషయం అందరూ ఒప్పుకుంటున్న విషయమే. అందువల్ల ఈ సందర్భంగా ప్రత్యేక సదుపాయాలు స్త్రీకి ఒనగూర్చవలసి యున్నది. గర్భిణి స్త్రీకి పోషకాహారం, ప్రసవానికి తగినన్ని ప్రత్యేక నర్సింగుహోమ్స్, పని సమయంలో పిల్లలకు రక్షణ లాంటి సదుపాయాలు లభించకపోవటం శోచనీయం కాదా?

ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక, కౌటుంబికపరమైన ప్రత్యేక సమస్యలు స్త్రీల పరంగా ఎలావున్నాయో పరిశీలిద్దాం. కుటుంబంలో ఆమె స్థానం వల్ల కలిగిన సమస్యలు కోకొల్లలుగా వున్నాయి. సమాజం వేటాడి ఆహారం సంపాదించుకునే రోజుల్లో స్త్రీ పురుషులు ఇరువురూ వేటకు వెళ్ళేవారు. ఇరువురూ సమానంగా బాధ్యతలు నిర్వహించేవారు. వ్యవసాయక దశలోకి సమాజం రావడంతో పరిస్థితులు మారాయి. పొలం దున్నడం పురుషుని వంతు అయింది. విత్తనాలు చల్లడం,

కలుపు తీయడం, కోతలు కోయడం, నాట్లు వేయడం స్త్రీలకు కేటాయించడం జరిగింది. పనివిభజన పేరుతో స్త్రీకి ఇంటిపని కూడా అప్పగించబడినది. ఆమె శారీరక ప్రత్యేకత-పిల్లలను కనడం. దాన్ని ఆసరాగా తీసుకొని ఆమెను ఇంటిపట్టున ఉంచాలనే ప్రయత్నం సాగింది. కాని ఇద్దరూ పనిచేస్తే తప్ప పొట్టగడవని దశలో బయట పనికూడా ఆమె చేయక తప్పలేదు. అలా ఆమె ఇంటిపని, బయటపని రెండూ చేయవలసి వచ్చింది. ఇంటిపని స్త్రీయే చేయాలనే పద్ధతి సర్వే సర్వత్రా అమలులో ఉంది. ఇది స్త్రీపై అదనపుభారాన్ని మోపుతున్నదిఅనేది సత్యదూరంకాదు.

భారతదేశంలో స్త్రీ వివాహమయిన తరువాత అత్తింటికి కాపురానికి వెళ్తుంది. పుట్టిన చోటునుంచి తరలి మెట్టిన ఇంటిలో కాపురం చేస్తుంది. సమిష్టి కుటుంబాలలో అత్త పోరున, ఆడబిడ్డ ఆరళ్ళను ఆమె అనుభవిస్తున్నది. ఈ బాధ పురుషులకు లేదు. ఇది స్త్రీకి ప్రత్యేక సమస్యలలో ముఖ్యమైనది. పిల్లలను పెంచే బాధ్యత స్త్రీకి కేటాయించడం జరిగింది. నిజానికి పిల్లలను కనడం వేరు, పిల్లలను పెంచడం వేరు. పిల్లలను స్త్రీ మాత్రమే కనగలదు. కాని పిల్లలను తండ్రి కూడా పెంచవచ్చు. అయినా ఈ బాధ్యతను స్త్రీకి మాత్రమే అప్పచెప్పటం వల్ల ఆమెకు పని బరువు ఎక్కువ అవుతున్నది. ఈ సమస్య మరి పురుషులది కాదు. కేవలం స్త్రీలదే.

వంటపని ఇంటిపనిలో భాగమయినా వంటపనిని ప్రత్యేకంగా పేర్కొనాలి. వంటపని చేయడానికి పురుషుడు ముందుకురాడు. పెద్ద పెద్ద పెళ్ళివంటలు చేయడం వృత్తిగా ఉన్న పురుషుడు కూడ ఇంటిలో భార్యనే వండి వార్చమంటాడు. ఉద్యోగిని అయినా లేక పారిశ్రామికురాలయినా భర్తతో ఇంచుమించుగా సమానంగా సంపాదిస్తున్నా ఆమెకు వంటపని తప్పదు. ఆడదానికి 'వంట, పంట, వంట' అని మూడు సార్లు రాశాడని ఎగతాళిగా మాట్లాడతారు పురుషులు. ఇది స్త్రీలకు ఉన్న ప్రత్యేక సమస్య, బాధ కాక మరేమిటి ?

ఇంట్లో అందరూ తినేటప్పుడు ముందు మగాళ్ళకు పెట్టి, తర్వాత పిల్లలకు పెట్టి అడుగూ బొడుగూ ఇంటావిడ తింటుంది. కుటుంబంలో పిల్లలకు ముందు పెట్టడం సహజం, న్యాయం. వారు రెక్కలు రానివారు, ఎదగాల్సినవారు, తల్లిదండ్రుల మీద ఆధారపడేవారు. మరి ఆలుమగలు ఇద్దరూ పనిచేస్తున్నప్పుడు ఇద్దరికీ

బలమైన తిండి కావాలి కదా? బాగా ఆస్తిలేని కుటుంబాలలో ఉన్నకాస్త చెరిసగం తినాలి. అలా జరుగుతున్నదా? జరగటం లేదు. కారణం పురుషుడు గొప్ప; స్త్రీ తక్కువ. పురుషుడు యజమాని; స్త్రీ పనికత్తె. కనీసం తిండికి కూడా నోచుకోలేని స్థితిలో ఉన్నది. ముఖ్యంగా శ్రామికవర్గ స్త్రీ. ఈ పరిస్థితి అన్యాయమని అందరికీ తెలుసు. ఇది కేవలం స్త్రీల సమస్య అని గుర్తించడం అవసరం.

సామాజికంగా పురుషులకు లేని సమస్యలు స్త్రీలకు ఇతోధికంగా ఉన్నాయి సామాజిక రాక్షసి స్త్రీని అడుగడుగునా తరతరాలుగా వేధిస్తున్నది. ఇవి చెప్పాలంటే అనంతంగా వుంటాయి. వాటిలో కొన్నింటిని పరిశీలిద్దాం—

**శీలము, వేర్పాటు :** స్త్రీకి శీలమే భూషణమట. శీలమంటే సత్యం పలకటం, సహనం ప్రదర్శించడం, దయ, సానుభూతి కలిగిఉండడం కాక లైంగిక నీతిని మాత్రం పేర్కొంటున్నారు. పురుషుడు బహు భార్యాత్వాన్ని అవలంబించవచ్చని హిందూ, ముసల్మాను మతాలు అతనియెడ పక్షపాతబుద్ధితో వ్యవహరించాయి. స్త్రీకి సర్వసాధారణంగా ఏవో కొన్ని కొండజాతులలో తప్ప ఏక భర్తృత్వం నియమం కలదు. ఆమె ఒకే భర్తను కలిగిఉండాలి. ఇది ద్వంద్వ నీతి. ఈ అంశాన్ని అటుంచినా మరో విషయం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. లైంగిక ప్రవర్తనలో కాలుజారిన స్త్రీని కులట అని, పతిత అని పేర్లు పెట్టి నిందిస్తారు. కాని అదే పనిని పదే పదే చేస్తున్న పురుషుని పీసమెత్తు కూడా విమర్శించరు. దీనివెనుక 'స్త్రీ పురుషుని ఆస్తి' అనే భావం ఇమిడివుంది. ఆమె దేహం అతని సొత్తు. దానిని ఇతరులు తాకరాదు. ఇలా ఆంక్షలు పెట్టి ఆమె శీలం భంగం అవుతుందేమోననే భయంతో ఆమెకు ముసుగులు, మేలి ముసుగులు, పరదాలు, బురఖాలు ఏర్పాటు చేశారు. కాస్త కలిమిఉంటే ఈ ఆచారాలులేని కుటుంబాలవారు కూడా వీటిని అమలుపరుస్తారు. పర పురుషునితో స్త్రీ మాట్లాడరాదు. నిన్నమొన్నటి వరకు హిందూ సమాజంలో మధ్యతరగతి స్త్రీ తలుపు చాటున ఉండి పరాయి మగాడితో మాట్లాడవలసి వచ్చేది. స్త్రీని వేరుగా ఉంచడం, చూడటం అలవాటయింది. సభలలో కూడా స్త్రీలు వేరుగా పురుషులు వేరుగా కూర్చోవలెననే సంప్రదాయం పుట్టింది.

**విద్య :** ఆడపి చదువుకొని ఉద్యోగాలు చేయాలా, ఊళ్ళేలాలా? అనే భావంతో

ఆమెను చదువుకు దూరం చేయడం జరుగుతున్నది. చదివించినా అది నానాకాలపు చదువు మాత్రమే. అంతటితో సరిపెట్టారు. భర్తకన్న ఎక్కువ చదువు, నైపుణ్యం సంపాదిస్తే అది తప్పు.

సామాజిక వ్యవహారాలలో కుల తగవులలో పెత్తనం అంతా పురుషులదే. స్త్రీని ఆ పంచాయితీలలోకి రానివ్వరు.

మత కార్యక్రమాలు మంచివని తలంచినా ఏ ఒక్క దేవాలయంలోనో తప్ప అన్ని దేవాలయాలలోను- అన్ని మఠాలలోను స్త్రీ పూజారిగా ఉండరాదు. కాని ఆమె భజనకు పనికివస్తుంది. పూజాదులకు వస్తువులు సమకూర్చటానికి పనికివస్తుంది.

**భార్యలకు దండన :** భార్యను దండించే హక్కును మతాలు, సంప్రదాయాలు భర్తకు ప్రసాదించాయి. 'నా భార్యను నేను కొట్టుకుంటాను. నీకేమిటి ?' అని త్రాగుబోతు భర్త అనడం, కలుగజేసికొని వారించపూనిన పెద్దమనిషిని భార్య కూడా నిందించడం తరచు చూస్తున్నాం భార్యలను దండించడం అభ్యున్నతికి పేరుపొందిన పాశ్చాత్య దేశాలలో కూడా చూస్తున్నాం, వింటున్నాం. ఇక మధ్య ప్రాచ్య రాజ్యాల విషయం చెప్పనక్కరలేదు. ఎంత మందపు త్రాడుతో ఆమె వీపు చిట్లకొట్టాలో నిర్ణయించాయి దేశాచారాలు ముఖ్యంగా తూర్పుదేశాలలో వీటిని ఒక పద్ధతిలో జరుపుతూ వుంటారు. ఇలా ప్రపంచమంతటా భార్యను దండించే హక్కును భర్తలు చలాయిస్తున్నారు. వేల సంవత్సరాలుగా ఇది స్త్రీల ప్రత్యేక సమస్యగాక మరెవ్వరి సమస్య అని ప్రశ్నిస్తే సమాధానం రాదు.

**అవమానాలు, అత్యాచారాలు :** ఇద్దరు మగవాళ్ళు పోట్లాడుకుంటూ వారి వారి కుటుంబాల ఆడవాళ్ళను చెడ తిట్టారు. సామాన్యంగా తిట్టే తిట్టు 'లంజకొడకా' కూడా స్త్రీ పరంగా ఉంటున్నది. అవతలి మగాడిని తిట్టడానికి అతని తల్లిని తిట్టవలసిన అగత్యమేమిటి? అతని తల్లి, అక్కచెల్లెళ్ళు, భార్య మొదలయిన స్త్రీలు అతని ఆస్తి కనుక అవతలి మనిషి మీద కోపం వస్తే అతని ఆస్తిని చెడగొట్టపూనడం మామూలుగా జరుగుతున్న పని. కనుక అవతలి మగాడు స్త్రీలను బండబూతులు తిట్టడం, అంతేకాదు అతనిపై పగతీర్చుకోటానికి అతని భార్యను, తల్లిని, అక్క

చెల్లెళ్ళను చెరచటం కూడా ఆ ప్రక్రియలో భాగమే. అదే మనస్తత్వం గోచరిస్తుంది. ప్రాణముండి, మెదడు ఉండి, ఆలోచించగల శక్తి ఉండి తనతో సమానంగా చాకిరీ చేసే స్త్రీని పురుషుడు తన సొంతం చేసుకున్నాడు. ఆవు, బర్రె, మేక, కోడి లాంటి పెంపుడు జంతువులు, పశువుల లాగా ఆమె అతనిది. అపైపై, అతనికి సర్వాధికారాలు వుంటాయి. "నేను మనిషిని" అని నిలబడటానికి స్త్రీ చేసే ప్రయత్నం ఆమెకున్న ప్రత్యేక బాధానివారణ కోసం కాక మరిదేనికి ?

**భార్య శరీరంపై హక్కు :** భార్య శరీరంపై భర్తకు పూర్తి హక్కు ఇచ్చాయి మతం, శాసనం, సంప్రదాయం. ఆమెకు ఇష్టం లేకపోయినా మగనికి మనసైతే ఆమె అతని కోర్కె తీర్చవలసిందే. అతని పొందును కాదనటానికి వీలులేదు. ఆమె అతని చేతిలో కీలుబొమ్మ.

**సంతానం కనటం :** భర్తకు ఇష్టమయినంతకాలం ఆమె సంతానాన్ని కనవలసిందే. బలహీనురాలినని, రోగిష్టి దానినని తప్పించుకోరాదు, మగపిల్లవాడు పుట్టే వరకు పిల్లలను కనమంటే పదిమంది ఆడపిల్లలు పుట్టినా మరల పురుడు పోసుకోవటానికి తయారుకావలసిందే. ఒకవేళ పిల్లలకు చేయలేక ఒకరితోనో ఇరువురితోనో సరిపెట్టుకుందామని ఆమె ఆలోచించినా అతడు వ్యతిరేకిస్తే ఆమె మాట సాగదు. ప్రస్తుతపు శాసనం ప్రకారం పిల్లలను ఆపుచేసుకునే ఆపరేషను చేయించుకోవటానికి ఆమెకు హక్కు ఉన్నా, ఆ హక్కును ఆమె వినియోగించుకుంటే భర్త తగవు పెడతాడు. ఇంట్లో నుంచి వెళ్ళకొట్టాడు. చుట్టూ ఉన్న సమాజం ఈసడిస్తుంది. చివరకు ఇరుగు పొరుగు అమ్మలక్కలు కూడా ఆడిపోసుకుంటారు. ఆమె జీవితం అల్లకల్లోలం అవుతుంది. ఆమె శరీరంపై ఆమె హక్కును పొందడం నిక్కచ్చిగా స్త్రీ సమస్యయే?

**స్వంత ఆర్జన పనికిరాదు :** ఇటీవలివరకు మధ్యతరగతి కుటుంబాలలో స్త్రీ ఉద్యోగం చేయటం తప్పుగా భావించేవారు. ఇప్పటికీ ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య బహు తక్కువ. శ్రామికవర్గంలో ఆ పేచీ లేదు. కాగా చదువుకున్న వర్గాలు సమాజాల ఆచారాలను, సంప్రదాయాలను. భావాలను చాలావరకు నిర్దేశిస్తున్నాయి. వాటినే శ్రామిక వర్గాలు కూడా ఆమోదిస్తున్నాయి. కనుక విధి లేక, గత్యంతరం లేక శ్రామికవర్గ పురుషులు తమ భార్యలను కూలికి పోనిస్తున్నారు కాని కాస్త డబ్బు

రాగానే మాన్పిస్తున్నారు, ఉద్యోగం పురుష లక్షణమట. లక్షలమంది స్త్రీలు పొలాల్లో నాట్లు వేస్తుంటే, కలుపులు తీస్తుంటే, పైరు కోత కోస్తుంటే వారి కష్టాన్ని వాడుకుంటున్న సమాజం ఎందుకు ఈ దొంగమాటలు చెప్తున్నది? దానికి కారణం ఒకటే- ఆడది కనుక సంపాదిస్తే ఆమె స్వాతంత్ర్యాన్ని కోరుతుందనే భయం. కనుకనే ఆ పనిని మంచి విషయంగా చెప్పక గతిలేక చేసేదానినిగా వర్ణిస్తున్నారు. దాని అంతర్యం ఇది. ఇది స్త్రీలు చేసిన కుతంత్రం కాదు కదా! ఈ విధానానికి బలి అవుతున్నది వారేకదా? ఈ పద్ధతి మారాలని ప్రధానంగా స్త్రీలే పోరాడాలి, త్యాగాలు చెయ్యాలి.

**వివాహం :** ఆడది విధిగా పెండ్లిచేసుకోవాలట. ఆమె ఈడేరితే తల్లిదండ్రుల కొమ్ముల మీద కుంపటియట. ఆమె భారమట ఆమె బరువును వారు దించుకోవాలిట. ఒక అయ్య చేతిలోపెట్టి వారు తమ బాధ్యతను నెరవేరుస్తారుట.

పెండ్లికి ఒప్పించటానికి పెళ్ళాడటానికి మగాడికి కట్నం యిస్తారు. ఆడపిల్ల తల్లిదండ్రులు మధ్యతరగతి కుటుంబాలలో, కట్నం ఇవ్వలేని వారి పిల్లలకు పెళ్ళికాదు. పెండ్లి కూడా కన్య ఇష్టాయిష్టాలపై ఆధారపడదు. తల్లిదండ్రులు నిర్ణయించిన వరునినే ఆమె చేపట్టాలి. శ్రామిక కుటుంబాలలో ఓలి పద్ధతి ఉంది కొన్ని కులాలలో మారుమనువు ఆచారం కూడా కన్పడుతుంది. కాని పిల్ల మగడి వద్దంటే ఓలిని ఆమె మగనికి తిరిగి ఇవ్వాలి. ఆమెవద్ద పైకం ఉండదు. దానిని అంతకు ముందే ఆమె తల్లిదండ్రులు ఖర్చుపెట్టుకొని ఉంటారు. అది వారి సొత్తు. కనుక ఈ మగని పీడ వదిలించుకోడానికి ఆమె ఎవరో ఒకరిని పెండ్లాడటానికి అంగీకరించి ఆ రెండవ పురుషునిచేత ఓలి మొదటి భర్తకు ఇప్పించాలి. రెండవ మగడు ఆమెను ఆదరించకపోతే ఆమె అవస్థ వర్ణనాతీతం. ఒకసారి ఒక కులంలో ఆమె గతిలేక ఏడుసార్లు మారుమనువు చేసుకోవలసి వచ్చింది ఈ పద్ధతిలో కూడా ఆమె ఒక వస్తువుగా ఎంచబడుతుంది. తల్లిదండ్రులు ఆమెను పైకం తీసుకొని మరి ఒకనికి ఇస్తారన్న మాట.

ఇక కట్నం ఇచ్చే విషయంలో స్త్రీ బాధ చెప్పనక్కరలేదు. తల్లిదండ్రులు ఎదురు వరునికి పైకం లేక ఆస్తి ఇచ్చి తమ పిల్లను అతని అధీనంలో పెడ్తారు.

మొత్తంమీద ఆమె తల్లిదండ్రుల పెత్తనం నుండి పెనిమిటి అధీనంలోకి పోతుంది. ఆమెకు వ్యక్తిత్వం లేదు; స్వాతంత్ర్యం లేదు.

**రాజకీయంగా :** నిన్న మొన్నటి వరకు స్త్రీకి ఓటు హక్కు లేదు. ఉన్నా భర్త చెప్పినట్లు వోటు వేయల్సిందే. లేకపోతే ఆమెకు తన్నులు తప్పవు. సాధింపులు పెరుగుతాయి. రాజకీయ పార్టీ లో స్త్రీలను ఉన్నత స్థానాలకు రానీయరు. అలంకార ప్రాయంగా లేక కన్నీళ్ళ తుడుపుగా 30 స్థానాలున్న చోట ఒకరికి మాత్రం సభ్యత్వం దక్కుతుంది. ప్రజా ప్రాతినిధ్య స్థానాలలో సుమారు 300 మంది ఉన్న శాసనసభలో పన్నెండుమంది స్త్రీలుంటున్నారు. 525 మంది ఉన్న పార్లమెంటులో స్త్రీలు 18 నుండి పెరిగి పెరిగి ఈనాడు 42 వరకు వచ్చారు. ఇలా 100కి 50 మంది ఉన్న స్త్రీలకు ప్రాతినిధ్యం 100కి అయిదు మాత్రమే.

అత్యున్నత స్థానాలలో స్త్రీలను చేరనివ్వరు. సుప్రీంకోర్టులో ఈనాటికి ఒక్క లేడీజడ్జిని వేశారు. హైకోర్టులో దేశం మొత్తంమీద పన్నెండు లేక పదిహేను మంది కన్నా లేరు. ప్రభుత్వ కార్యదర్శులుగా 100కి నల్గురు కూడా లేరు. ప్రభుత్వ ప్రణాళికలవల్ల సహాయం ఇంచుమించుగా అంతా పురుషులకే చెందుతుంది. ఉచితంగా ఇచ్చే భూములు, ఇళ్ళు, స్త్రీలకు ఇవ్వటంలేదు అప్పులు పురుషుల పేరనే వుంటున్నాయి స్త్రీలకు చెందే సహాయం నామమాత్రమే. పంచాయితీలలో, పంచాయితీ సమితులలో, జిల్లా పరిషత్‌లలో స్త్రీల స్థానం అలంకార ప్రాయం. స్త్రీలకు న్యాయం చేకూరుస్తున్నామని చెప్పుకోటానికి ఇచ్చేవి చాలా కొద్ది మాత్రమే. మంత్రివర్గాలలో స్త్రీలకు శిశుసంక్షేమం లాంటి శాఖలు మాత్రమే ఇస్తారు అంటే స్త్రీలు కుటుంబాన్ని చూసుకోవటం, పిల్లలను పెంచటంలో మాత్రమే నేర్పరులు అన్న భావం బలంగా ఉందన్నమాట. వృత్తి విద్యల్లో, ఉద్యోగాలలో ఉన్నత శిక్షణావకాశాలు, ప్రొమోషన్లు మొదలైన వాటిలో స్త్రీలను నిరాదరణ చేస్తున్నారు. ఇలా ఎన్నో ఇంకెన్నో చెప్పాలంటే సవాలక్ష వున్నాయి.

**ఆర్థికంగా :** కూలిరేట్లలో తేడా వుంది. ఆడ కూలీలకు కూలి తక్కువ. స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకేపని చేసినా స్త్రీలకు తక్కువకూలి ఇస్తున్నారు.

కొన్ని వృత్తులకు స్త్రీలే తగుదురని చెప్తూ ఆ వృత్తులకు కూలి జీతాలు తక్కువ చెల్లిస్తున్నారు. నాట్లు వేయడానికి స్త్రీలే తగుదురట. కాని పొలంలో పని చేసే పురుషులకు కూలి ఎక్కువ. ఏ పని కష్టం దానికున్నది. కాలవ్యవధి సమానం. నాట్లు వేస్తే, ప్రత్తి ఏరితే, కలుపు తీస్తుంటే నడుములు విరిగిపోతాయి. అవి తేలిక పనులు కావు. కాని ఆ పనులంటే చులకనభావం చూపిస్తున్నది సమాజం.

ఇద్దరూ ఒకే వృత్తి చేస్తున్నా క్రొత్త పని నేర్చుకోవటానికి అవకాశాలు ఇవ్వరు. ఉదాహరణకు, కట్టుబడి పనిచేసే స్త్రీ పురుషులున్నా, రాళ్ళు అందించే పురుషుడు 2, 3 ఏళ్ళల్లో తాపీపని వాడవుతున్నాడు. ఆ పని అతనికి నేర్పుతున్నారు. తట్టలు మోసే స్త్రీ ఆజన్మాంతం తట్టలు మోయవలసిందే కుటుంబంలో స్త్రీ పురుషులిద్దరూ పనిచేస్తున్నా ఆమె సంపాదనపై పెత్తనం పురుషునిదే. తండ్రి లేక భర్త ఆమె ఆదాయాన్ని భుక్తం చేసుకుంటారు ఆమె తన స్వంత ఖర్చులకు వారిని బిచ్చమెత్తవలసి వస్తున్నది. ఆస్తిని భార్య కూడా సమానంగా సంపాదించినా ఆస్తి సాధారణంగా ఆమె భర్త పేరనే ఉంటున్నది. శాసనాల ప్రకారం స్త్రీకి భర్త ఆస్తిలో తక్కువ వాటా వస్తోంది. ముస్లిం 'లా' ప్రకారం పిల్లలుంటే 1/8 లేకపోతే 1/6 మాత్రమే. హిందూ 'లా' ప్రకారం ఆమె అతని కుమారులతో, కుమార్తెలతో అత్తతో సమానంగా పంచుకుంటుంది అతని స్వార్జితపు ఆస్తిలో. అతని పిత్రార్జితపు ఆస్తిలో పుట్టుకతో హక్కున్నది కుమారులకు. ఇపుడు కుమార్తెలకు అలాంటి హక్కు ఇవ్వాలని తెలుగుదేశం ప్రభుత్వం బిల్లు ప్యాసు చేయించింది. అంటే పిత్రార్జితపు ఆస్తిలో కుమార్తెలు, కుమారులు, భర్త పంచుకోగా వచ్చిన భర్త ఆస్తిలో విధవరాలు, కుమారులతో, కుమార్తెలతో, అత్తతో సమానంగా పంచుకుంటుంది. దీనినిబట్టి ఆస్తిని పెంచి పెద్దచేసి జాగ్రత్త చేసిన భార్యకు ఎంత అన్యాయం జరుగుతున్నదో గమనించవచ్చు. ప్రభుత్వ ప్రణాళికల విషయంగా స్త్రీలను చిన్నచూపు చూడటం జరుగుతున్నది.

**సాంస్కృతికంగా :** విద్యకు దూరంగా ఉంచబడిన స్త్రీ సాహితీ సంస్కృతులకు దూరం అవుతోంది. మనిషిని ఉదాత్తుని చేసే కళలలో, సాహిత్యంలో ఆమెకు ప్రవేశం తక్కువగా లభిస్తున్నది. ఇప్పటికీ నాటకాలలో వేషాలు వేయటానికి వివాహిత స్త్రీలు ముందుకు రావడంలేదు. కవిత్వం, లలితకళలు, సంగీతం మొదలుగా

గల వాటిలో స్త్రీలకు సముచిత స్థానం లభించడంలేదు. ఇంటిపనితో సతమతమయ్యే స్త్రీలు సాంస్కృతిక కార్యక్రమాలలో బహు తక్కువగా పాల్గొంటున్నారు. దానివల్ల స్త్రీలూ నష్టపోతున్నారు. సమాజమూ నష్టపోతున్నది. స్త్రీల సాంస్కృతిక వెనుకబాటుతనం ప్రధానంగా స్త్రీల ప్రత్యేక సమస్యయే అనేది నగ్నసత్యం.

ఇలా ఎన్నో అంశాలను ఉటంకించవచ్చును. పైన పేర్కొనబడిన అంశాలు సోదాహరణంగా చెప్పబడినవి మాత్రమే. జాబితా సమగ్రము కాదు. సమస్యా కూలంకషంగా చర్చించడానికి వీలులేదు కొద్ది సమయంలో. కాకపోతే విషయాన్ని ద్యోతనం చేయించడం జరిగింది. ఇన్ని అంశాలు స్త్రీలను బాధిస్తున్న విషయాలుగా విశదీకరించబడినా స్త్రీలకు వేరే సమస్యలు లేవని ఎవరైనా ఇంకా వాదించపూనుకుంటే మనం చేయగలిగింది లేదు. అది వారి అమాయకత్వమన్నా కావాలి లేక అజ్ఞానమన్నా అయ్యుండాలి. ఈ రెండూ కాకపోతే వారి ఉద్దేశ్యాలు తప్పక సందేహాస్పదం అయినట్లుగా ఎంచుకోవాలి.

స్త్రీలకు ప్రత్యేక సమస్యలు ఉన్నాయని చెప్పినంత మాత్రాన పురుషులకు ప్రత్యేక సమస్యలు లేవని కాదు. కాగా స్త్రీల ప్రత్యేక సమస్యలు బహు సంఖ్యాకం. పురుషుల ప్రత్యేక సమస్యలసంఖ్య అల్పాతిఅల్పం. అదీగాక ఇంతవరకు సమాజంపై పెత్తనం సాగిస్తున్నది పురుషులు. కనుక పురుషులు తామే సమాజము, సమాజమే తాముగా వ్యవహరించారు. స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయని గ్రహించిన ఉదార పురుషులు కొద్దిమంది. వారు స్త్రీ జనాభ్యుదయానికి కృషి చేశారు. మహిళా పురోగతికి దోహదం చేశారు. అది కాదనలేని మాట; కాదనరాని మాట.

మహిళా దశాబ్ది మూలంగా స్త్రీలలో ప్రపంచ వ్యాప్తంగా చైతన్యం వెల్లివిరిసింది. స్త్రీల సమస్యలపై దృష్టి సారించడం జరిగింది. స్త్రీ శక్తిపై స్త్రీలకు విశ్వాసం పెరిగింది. స్త్రీలకు ప్రత్యేక సమస్యలు ఉన్నాయని గుర్తించిననాడు మహిళాభ్యుదయానికి స్త్రీలు బాటలు వేసుకోగలరు. ఇక్కడ మరో మాట చెప్పాలి. ఒకవేళ స్త్రీల సమస్యలు వేరే లేవని భావించినా ప్రత్యేక అధ్యయనం నిమిత్తం వేరు వేరు సమస్యలను ప్రత్యేకంగా పరిశీలించటం అవసరం. ఆ పద్ధతి ఫలప్రదం. స్త్రీలకు సంబంధించిన సమస్యలను అన్నింటినీ ఒకచోట ఏర్చికూర్చితే అవే స్త్రీ సమస్యలు అవుతాయి. స్త్రీల సమస్యలను పరిష్కరించుకోటానికి స్త్రీలే ముమ్మందుగా ఉద్యమించాలి.

# మత ధర్మశాసనాలు : మహిళలు

మల్లాది సుబ్బమ్మ




స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం
హైదరాబాద్-500 028

కరపత్రం నెం. ౫

ప్రతులు 1000
డిసెంబరు, 1982

రచన : మల్లాది సుబ్బమ్మ

ప్రచురణకర్త
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
మెహిదీపట్నం-హైదరాబాద్
ఫోను : 35429

మహిళోద్యమ కార్యకర్తలకు ఉచితం
వెల రు. 3.00

ప్రతులకు :
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028

---

ముద్రణ:- నాట్యకళ ప్రెస్ ఖైరతాబాద్, హైదరాబాద్-4

# మత ధర్మశాసనాలు : మహిళలు

## పూర్వ చరిత్ర :

మన మహిళల హక్కులన్నీ మన చట్టాల్లోవున్నాయి; ఇంకా మన "పొలిటికల్ సైన్సు" పుస్తకాలల్లో వున్నాయి. ఇక బాధ్యతలు అడక్కండి అవి మన బుర్రలనిండా ఉన్నాయి., అవి మన అనుభవంలో నిత్యం జరుగుతూ వున్నాయి. ఇది విస్మరించరాని పచ్చి నిజం. మతధర్మ శాసనాలను గురించి చర్చించేముందు అసలు హక్కులంటే ఏమిటి? అవి ఎన్నిరకాలు వున్నాయి? వాటిలోవున్న లోపాలు ఏమిటి? అవి ఎలా సవరింపబడాలి? లేనిహక్కులకోసం ఎలా 'డిమాండ్' చెయ్యాలి? అనే విషయాలన్నీ స్త్రీలకు తెలియాలి అంటే వారిలో దానికి తగిన విద్యావిజ్ఞానాలు వుండాలి. ముందుగా ఎన్నిరకాల హక్కులువున్నాయో తెలియాలి. వాటిని అనుభవించగల ధైర్యస్థయిర్యాలు స్త్రీలలో వుండాలి. ఏ హక్కులైనా అనుభవించకపోతే అవి నిరుపయోగమైపోతాయి. అంటే-నశించిపోతాయి. (**Dead Rights**). హక్కు అన్నా, చట్టమన్నా అదొక కత్తి లాంటిది. ఆ కత్తి ఆపరేషన్‌చేసి మనిషిని బ్రతికిస్తుంది. లేదా అదే కత్తి తుప్పుపట్టి రాలిపోతుంది. కనుక హక్కులు అంత విలువైనవి., బరువైనవి, అవసరమైనవి కూడా ననే అవగాహన మనలో వుండాలి.

భారత రాజ్యాంగంలో సమానత్వం అనేది మౌలిక హక్కుగా వ్రాయబడింది స్త్రీల పరిస్థితిని మెరుగుపర్చటానికి రాజ్యాంగం 14, 15 ఆర్టికల్సులో పొందుపరచి సమానత్వ సిద్ధాంతంవల్ల పురుషులతోపాటు స్త్రీలకు హక్కు ఇవ్వబడుతుంది. అయి. స్త్రీలలో తాము తక్కువ అనే భావం అనాదిగా వున్నది. అందువల్ల 1954 లో ప్రవేశ పెట్టబోతున్న హిందూ కోడ్‌బిల్లును స్త్రీలే వ్యతిరేకించారు. ఆ బిల్లులో పిత్రార్జితఆస్తిలో వారసత్వం పురుషులకు కూడా వుండరాదనేది, హిందూ విధవల స్వాధీనంలో ఉన్న ఆస్తులకు వారు హక్కుదారులవుతారన్నది మౌలికమైన మార్పు. ఈ బిల్లు చట్టరూపం కాకుండా అనాడు హిందూ స్త్రీలంతా మూకుమ్మడిగా ప్రదర్శనలు జరిపారు. కరపత్ర స్వామీజీ ఆధ్వర్యాన వారు పార్లమెంటుకు మెమోరాండాలు సమర్పించారు. అంబేడ్కర్ లాంటి నాయకుల గొంతులను నొక్కిపట్టి పార్లమెంటులో అలజడి రేపారు. బ్యానర్లతో ఊరేగింపులు చేశారు. నెహ్రూతో తాను పోటీచేస్తానని కరపత్రస్వామీజీ బెదిరించాడు. అలా గొప్పమెజారిటీతో ఆనాడు ఆ బిల్లును ఆడవారే అలా అణగత్రొక్కారు. తాము పురుషులకన్నా తక్కువ అనే భావంవల్లనే వారు తమ హక్కులను కోరడంలేదు. తరువాత 1955, 1956 సంవత్సరాలలో హిందూ కోడ్‌బిల్లులో కొంతభాగాన్ని నాలుగు ముక్కలుచేసి నాలుగు శాసనాలుగా చేసింది నెహ్రూ ప్రభుత్వం.

మన చట్టాలు స్త్రీలపట్ల చూపుతున్న వైఖరి గమనిస్తే కొన్ని ప్రశ్నలు ఉదయిస్తాయి. చట్టాలు స్త్రీలకు పూర్తిన్యాయం చేస్తున్నాయా లేదా? చట్టాల వ్యాఖ్యానంలో చట్టందృష్టిలో స్త్రీ పురుష సమానత్వాన్ని అవి నిరూపిస్తున్నాయా అంటే లోపాలు కొన్నివున్నాయి. ధర్మశాస్త్ర నిర్ణేతలు, చట్ట నిర్మాతలు పూర్తిగా పురుషులు కావటం వివక్షకు ఒక కారణమైతే, తమ హక్కులగురించిన పరిజ్ఞానం స్త్రీలలో లోపించటం లేక వాటికొరకై పోరాటాలు జరపకపోవటం మరో కారణమయింది. ఏదైనా మొత్తంమీద మన పూర్వీకులైన శాస్త్రకారుల అసమానత్వ భావాల బలమే మన చట్టాలలో బీజ రూపం తాల్చివున్నాయి. ఆనాడు స్త్రీలపై వారికున్న దృష్టిదోషమే ఈనాటి శాసన కర్తలలో కాని, న్యాయశాస్త్ర నిర్ణేతల్లో కాని, న్యాయవాదుల్లో కాని ఘనీభవించి వున్నాయి. ఏ కొద్దిమందో వ్యతిరేకించినా వారి భావాలను అణచివేయటం సర్వసాధారణమయింది. అందుకు ఉదాహరణలు: 1955 లో హిందూకోడ్‌బిల్లును ఎదిరించటం, తిరిగి 1986లో ముస్లిం స్త్రీల మనోవర్తి తీర్పును సనాతన ముస్లింలంతా కలిసి 'సవాల్' చేసి నిరసిస్తూ తీర్పుకు వ్యతిరేకంగా చట్టాన్ని ప్రవేశపెట్టించటం లాంటివి అవి. ఇంత అయినా చట్టాల్లో కొన్ని మంచివి, శ్రేయస్కరమైనవి వున్నాయి. కాని అవి అనుభవించలేని అసమర్ధత మన స్త్రీలలో మెండుగావుంది. కారణం-ప్రాచీనకాలపు ఆచారాలకు, సనాతన సాంప్రదాయాలకూ వారు విలువ ఇవ్వటంవల్ల వున్న హక్కులను వాడుకోలేక పోతున్నారు. ఈనాటి చట్టాలవల్ల ముఖ్యంగా రెండురకాల నష్టాలు వున్నాయి. మొదటది స్త్రీ పురుష వివక్షను భాష్యంద్వారా న్యాయపరంగా సమర్థించడం, రెండవది మానవ హక్కులను కాలరాయడం. కనుక నిశితదృష్టితో మనచట్టాలను, వాటిలోపాలను పరిశీలించడం మన కర్తవ్యం.

"స్త్రీలు: చట్టాలు" అనే అంశాన్ని గురించి తెలియాలంటే దానికి కొంత పూర్వచరిత్ర తెలియాలి. అంటే శాసన నిర్మాణ కాలానికిముందు దేశపరిస్థితి, శాసనాలనాటి ఆచారాలు, అనుభవాల అవగాహనలాంటివి అందులో వున్నాయి. ఇంకా మతధర్మశాస్త్రాల ఆధారాలు వున్నాయి. ప్రవక్తల నిర్దేశాలువున్నాయి. ఆచారాల ప్రసక్తివుంది. పురుషప్రపంచ భావన వుంది. ఇలా అనేకానేక సంస్కృతుల సమ్మేళనమే మన మత ధర్మశాసనలుగా రూపొందాయి. అందువల్ల మన దేశంలోని మహిళల హక్కులు, స్థితిగతులు వారు అనుసరించే మతంమీద ఆధారపడి వుంటాయని ముందుగా మనం గ్రహించాల్సిన విషయం. ఇక మతధర్మశాసనాల పుట్టుక మార్పులు, చేర్పులు, సవరణల గురించి ప్రస్తావించుకుందాం.

మన దేశంలో అనేక మతాలకు చెందినవారు వున్నారు. అందులో హిందూ, ముస్లిం, క్రైస్తవ, పారశీక మతాలు ముఖ్యమైనవి. మనది లౌకికరాజ్యం అని చెప్పుకుంటున్నాం. నేరాలు, సుంకాలు, పన్నులు మొ॥ వాటివిషయంగా సర్వులకు శాసనాలు ఒకటిగానే వున్నాయి. అయితే వివాహం, దత్తత, సంరక్షకత్వం, వారసత్వం, మనోవర్తి, విడాకులు లాంటి అంశాలకు వేరు వేరు మతాలవారికి వేరు వేరు శాసనాలు వున్నాయి. వీటిని మతధర్మశాసనాలు అంటాం. రాజ్యాంగం 44వ అధికరణం ప్రకారం భారతీయులందరికీ వర్తించే ఒకే ఒక వ్యవహార సంహిత. (కామన్ సివిల్‌కోడ్) ను ప్రభుత్వం రూపొందించాలని, కృషిచేయాలని రాజ్యాంగం స్పష్టీకరించింది. మన రిపబ్లిక్ రాజ్యస్థాపన జరిగి 36 ఏళ్లు నిండాయి. అయినా ఈ సందర్భంగా ఏ ప్రయత్నమూ జరగలేదు కారణం మైనారిటీ వర్గాల కోర్కెల, హక్కుల పరిరక్షణకు తాము బద్ధకంకణులగా వుంటున్నామని వారిని భ్రమింపచేస్తున్నట్లుగా తోస్తుంది. ఈ పరిస్థితికి దోహదకారణాలు అనేకం వున్నాయి. అల్పసంఖ్యాకులలో తగినంత పలుకుబడిగలిగిన సంస్కర్తలు లేకపోవటం, వారి మతభావాలకు విరుద్ధంగా సవరణలు తెచ్చి వారిని రెచ్చగొట్టరాదనే పాలకుల వైఖరి, అధికార పార్టీలు, ప్రతిపక్ష పార్టీలు అందరూకూడా సంస్కరణలకు పూనుకుంటే అల్పసంఖ్యాకుల ఓట్లు తమకు రావనే భయాందోళనలు ఇవన్నీ ఈ శోచనీయ పరిస్థితికి కారణాలు. ఇతర అభ్యుదయ దేశాలలో అలా కాదు. మతాలు వేరైనా పౌరులందరికీ వర్తించే శాసనాలలో తేడా వుండదు.

భారతదేశంలో అనేకమంది పురుషులు తమ భార్యలను గౌరవిస్తామని గొప్పగా చెప్పుకుంటూ వుంటారు., అర్ధాంగులుగా పరిగణిస్తామని పొగుడుకుంటూ వుంటారు. ఇదొక ఎత్తుగడ అంటే దూషిస్తారు. ఆఖరికి చట్టాలలో కూడా పురుషులకు వున్నన్ని హక్కులు స్త్రీలకు లేవనేది నిర్వివాదాంశం. కనుక మహిళాభ్యున్నతికి కృషిచేయపూనుకున్న మహిళా కార్యకర్తలకు వివిధచట్టాలలో మన మహిళల స్థానాన్ని, వారి హక్కులను అవగాహన చేసుకోవటం అవశ్య కర్తవ్యం.

ధర్మశాస్త్ర ప్రతిపాదితమైన హైందవ ధర్మసూత్రాలను బ్రిటిష్ పాలనా శాసనాలద్వారా కొంత మార్పుచేయడం జరిగింది. దేశం స్వాతంత్ర్యం పొం॥ రాజ్యాంగం ఏర్పడ్డ పిదప భారీఎత్తున మార్చడం జరిగింది. అలాంటి మార్పులు ఇత మతాలలో కొద్దిగామాత్రమే జరిగాయి. 1857 లో సిపాయి తిరుగుబాటు జరి బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిలో మార్పువచ్చి వారు పట్టించుకోలేదు. విక్టోరియారాణి ప్రకటనలో భారత ప్రజల మతవిషయాలలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకునే లేదని ప్రకటించింది. తరువాత సంస్కరణోద్యమానికి బ్రిటిష్ ప్రభుత్వం యొక మద్దతు మనకు లభించలేదు. కాని వారు దానిని ఏనాడూ వ్యతిరేకించలేదు. సిపా

తిరుగుబాటుకు పూర్వం అధికసంఖ్యాకులైన హిందువుల విషయంలో కొంతగా కొంత జోక్యంచేసుకున్న ఫలితంగా 1829 లో సతీసహగమన చట్టం 1856 లో విధవా వివాహ శాసనం వచ్చాయి. 19 వ శతాబ్దపు శాసనాల నిర్మాణం బ్రిటిష్‌వారి పట్టుదల వల్ల జరిగింది. 'శారదా యాక్టు' (బాల్య వివాహ నిరోధశాసనం) 1929 లో వచ్చింది. ఇది కేంద్ర శాసనసభలో శారదా అనే ఒక సభ్యుని కృషివల్ల జరిగింది. తర్వాత 1946 లో వివిధ శాఖలకు చెందిన వివాహాలు అంటే ఒకే కులం, ఒకే గోత్రం, లేక ప్రవరలో జరిగినా చెల్లుతాయి అనే చట్టం వచ్చింది. అలాగే 1946 లో ఆమోదింపబడిన మనోవర్తిశాసనం అమలుజరిగింది. ఇంకా 1949 లో భిన్నమతాల, కులాల, వర్ణాలకు చెందిన వివాహం చట్టసమ్మతం చేశారు. ఇవన్నీ దేశ స్వాతంత్ర్య సముపార్జన సమయంలో శాసనరూపం తాల్చాయి. 1947 లోని బొంబాయి విడాకులచట్టం, 1946 లోని బొంబాయి బహుభార్యాత్వ నిషేధ చట్టం, 1949 లోని మద్రాసు బహుభార్యాత్వ నిషేధం విడాకుల చట్టం 1935 భారత ప్రభుత్వ చట్టంలో నిర్దేశింపబడిన రాష్ట్ర స్వపరిపాలనా ఫలితాలు. 1936 లోని పార్శీ వివాహ విడాకుల చట్టం ఈ వైఖరికి నిదర్శనం. ముస్లిం స్త్రీకి విడాకుల హక్కును ప్రసాదించే చట్టం 1939 లో జరిగిందే ఈనాటికీ అమల్లోవుంది. 1956, 60, 64, 76, 78 లలో మార్పుచేయబడిన హిందూ వివాహ శాసనం, 1956 లోని హిందూ వారసత్వ శాసనం, 1956 లోని హిందూ దత్తత మనోవర్తిచట్టం, 1956 లోని హిందూ సంరక్షకత్వ శాసనం ఇవన్నీ అభ్యుదయకరమైనవి. ప్రజాభిప్రాయానికి అనుగుణంగా హిందూ శాసనాలను మార్చటానికి మన ప్రభుత్వం వెనుకాడలేదని మనం గ్రహించవచ్చు. కాని 1872 లో క్రోడీకరింపబడిన క్రైస్తవ వివాహ శాసనంలో 1869 నాటి క్రైస్తవ విడాకుల శాసనాలలో సవరణలు జరుగకపోవటం చాలాశోచనీయం. పార్శీవివాహం మరియు విడాకులశాసనం 1936 లో చట్టం రూపంధరించినది. అలాగే నిలిచిపోయాయి. 1939 నాటి ముస్లింల విషయంకూడా జరిగింది. అలాగే ఒకవైపున స్వప్రయోజనపరులు, రెండవవైపున పాలకవర్గాలు ఇద్దరూ కలిసి అల్పసంఖ్యాక వర్గాల వ్యవహార శాసనాలను (**Civil-laws**) మార్చే విషయంలో కుట్రచేసి జోక్యం కలిగించుకోవటం లేదనేదానికి పైవి ఉదాహరణలు, గీటురాళ్ళు.

ఈనాడు అమలులోఉన్న శాసనాలలో ముఖ్యమైనవి వివాహానికి, వారసత్వానికి, దత్తతకు, మనోవర్తికి, మైనారిటి మరియు సంరక్షత్వానికి సంబంధించినవి. బాల్య వివాహ నిరోధశాసనం, వరకట్న నిషేధశాసనం, శిక్షాస్మృతిలో వచ్చిన మార్పులు ద్వితీయశ్రేణికి చెందినవి. వీటి ఫలితంగా స్త్రీల హోదాలో కొంత మార్పు వచ్చినమాట వాస్తవం.

## ఉపోద్ఘాతం:—

భారతదేశంలో భిన్నజాతుల వారున్నారు. భిన్న భాషల వారున్నారు. విభిన్న ఆచారాలు, సంప్రదాయాలు కల ప్రజలున్నారు. ఇవన్నీ ఒక ఎత్తు, భిన్న మతాల వారి ఉనికి మరో ఎత్తు. ముఖ్యంగా నాలుగు మతాలు ఉన్నాయి. హైందవం, ఇస్లాం, క్రైస్తవం, పార్సీ ఇలా నాలుగు ముఖ్యమైన మతాల ప్రజానీకం ఈ ఉప ఖండంలో నివసిస్తున్నారు. మరల హైందవంలో అనేక శాఖలు. అద్వైతులు, ద్వైతులు, విశిష్టా ద్వైతులు, కేవలా ద్వైతులు, శుద్ధా ద్వైతులు ఇలా ఎందరో. పైగా శైవులు, వీర శైవులు, వైష్ణవులు, వీర వైష్ణవులు, శాక్తేయులు, జైనులు, బౌద్ధులు ఇలా మరెన్ని రకాల మతవాదులో! అలాగే క్రైస్తవులలో రోమను కాథలికులు, ప్రొటెస్టెంట్లు పెద్ద శాఖలు. ప్రొటెస్టెంట్లలో మెథాడిస్టులు, లూథరనులు, బాప్టిస్టులు, విశ్వాసులు ఇలా ఎన్నో ఉపశాఖలు దర్శనమిస్తాయి. ఇస్లాంలో సున్నీలు, షియాలు ప్రధాన శాఖలకు చెందినవారు. పార్సీల సంఖ్య బహు స్వల్పం. కనుక భారతదేశ పార్సీలలో పెక్కు శాఖలను పరిగణించ పనిలేదు.

ఇన్నిరకాల విభజనతో భారత ప్రజానీకం ఎలా సమైక్యంగా నిలబడగలదా యని ఎవరికైనా సందేహం కలుగుతుంది. అశోకుని కాలం నాటినుండి భారతదేశ సమైక్యతకు నిదర్శనాలు కనిపిస్తున్నా చాలాకాలం కొన్ని శతాబ్దాలు భారతజాతి అనై క్యతతో క్రుంగిపోయింది. బ్రిటిషు ప్రభుత్వ పాలన పరోక్షంగా దేశ ప్రజలలో ఐక్యతకు దోహదం చేసింది. కాగా దేశంలో ఐక్యతా భావం ఆటు పోట్లకు గురి అవు తున్నది.

స్త్రీలకు సంబంధించి వేరు వేరు మతాలవారు వేరు వేరు ధర్మశాసనాలు రూపొందించుకున్నారు. ఏ మతం వారి ధర్మశాస్త్రం వారిదే. అలాగ ఏర్పరచుకో డమే కాక ఆయా మతాలవారు వాటిని పోషించుకుంటూ వచ్చారు. వాటి సవరణ వ్యతిరేకిస్తూ వచ్చారు. హిందూ మతస్థులు మాత్రం కాలగతి ననుసరించి మారడ జరిగింది. వారిలో సంస్కరణోద్యమాలు విజృంభించాయి. వాటి ఫలితంగానే హైంద వంలో అనేక శాసనాలు రావడం జరిగింది.

హైందవం యొక్క విస్తృతి పెద్దది. బౌద్ధులు, జైనులు, ఆర్యసమాజం వారు, బ్రహ్మ సమాజస్థులు, వీరంతా హిందూ మతస్థుల క్రిందనే పరిగణింపబడతారు. హేతువాదులు, నాస్తికులు కూడా కొన్ని పరిస్థితులలో హిందువులే. హిందూ వివాహ

శాసనం వగైరాలలో ఉన్న 'హిందువు' అనే పదానికి ఇలా అర్థంచెప్పారు. ఈ దేశంలో పుట్టి పెరిగి, లేక ఇక్కడ స్థిర నివాసము ఏర్పరచుకున్న వారందరూ శాసనాల దృష్టిలో ఒక పరిస్థితిలో హిందువులే. కేవలం హిందూ మతాన్ని అనుసరించేవారే హిందువులు కానక్కరలేదు. పై చెప్పిన అర్హత-జన్మతః కలిగింది లేక స్థిర నివాసం వల్ల ఏర్పడింది ఉండి, ఇస్లాం, యూదా, క్రైస్తవ, పార్సీ మతాలకు చెందని ఏ వ్యక్తి అయినా హిందువే. అంటే ఆ నాలుగు మతాలకు చెందకుండా ఉన్న వారంతా హిందువులే. యూదులసంఖ్య అత్యల్పము. కనుక భారతదేశ పరిస్థితిని గమనించేటప్పుడు వారిని పరిగణించ నవసరము లేదు. అలా ప్రధానంగా నాలుగు మతాలు ఈ దేశంలో కనిపిస్తున్నాయి.

ఈ మతాల ధర్మశాసనాలు స్త్రీల జీవితాలను శాసిస్తున్నాయి. కనుక వాటిని గురించి మనం ఆలోచించవలసి వస్తున్నది. స్త్రీ జీవితానికి పరమావధి వివాహమూ, సంతానలబ్ధి పొందడమూ అని మతాలవారు నిర్దేశించారు. కనుక హోదా, వివాహం, దాంపత్యజీవితం, వైధవ్యం, మనోవర్తి, విడాకులు, పునర్వివాహం, జారత్వం, సంరక్షకత్వం, దత్తత, మైనారిటీ, వారసత్వం, ఇలాంటి విషయాలలో ప్రతి మతమూ కాస్తో కూస్తో కట్టుదిట్టంగానే శాసనాలు చేసింది. అవి ఆయా మతస్తుల హోదాను నిర్ణయిస్తున్నాయి.

మతాలు పుట్టిపెరిగిన ప్రాంతాల, కాలాల స్థితిగతులు-అంటే సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక స్థితిగతులు-వాటి స్వరూప స్వభావాలపై చాలా వరకు ప్రభావం చూపిస్తాయి. పశుపాలన ప్రధాన వృత్తిగా నున్న సమాజం ఒక రకమైన మతపు పుట్టుకకు అవకాశం ఇస్తే, బానిస సమాజంలోనుండి మరో మతం జన్మ పొందుతుంది. భూమియే ప్రధాన ఉత్పత్తి సాధనంగా ఉన్న సమాజంలో మరో స్వభావం గల మతం ఉత్పన్నమవుతుంది. అలాగే వ్యాపారం బాగా చలామణీ అయ్యే సామాజిక వ్యవస్థలో నూతన మత ఆవిర్భావం జరుగుతుంది. కనుక మతాలను సమాజాలను విడదీసి చూడలేము, చూడరాదు. ఆ మతాలు ఆదేశించే నైతిక సూత్రాలను, ప్రవర్తన నియమావళులను, న్యాయ నిబంధనలను పరిశీలించేటప్పుడు ఈ అంశాన్ని గమనంలో ఉంచుకోవాలి. లేకపోతే కాలం మారినా, పరిస్థితులు వేరైనా ఏనాడో ఆ మతం ఆమోదించిన సూత్రాలనే పట్టుకొని వ్రేళ్ళాడగల ప్రమాదం ఉంది. ఈ ప్రపంచంలో ప్రతి వస్తువూ, వ్యక్తి, సమాజమూ, సామాజిక వ్యవస్థా, సంస్థాగత నిర్మాణమూ, అన్నీ మారుతున్నాయి. కాలగతి ప్రభావాన్ని అవి దాటిపోలేవు. మార్పు ప్రకృతి సిద్ధము. మార్పులేని జీవులు స్థాణువులు అవుతారు.

మనిషి ఒంటరిగా బ్రతకలేడు, బ్రతకటంలేదు. సమాజంలో బ్రతుకుతున్నాడు. అతని వంటివారు, ఆమె వంటివారు పదిమంది, వందమంది, వేలమంది కలిస్తే అది సమాజం అవుతుంది. పలువురు ఒక ప్రాంతంలో కలిసి తగాదాలు, కొట్లాటలు, స్పర్ధలు లేకుండా జీవించాలంటే పరస్పర సహనం, గౌరవం అవసరమవుతాయి. వీటిని ప్రజలు అలవరచుకోవాలంటే-వస్తుతః వారిలో సహకార భావం వుంటుంది-వారికి కొంతగా శిక్షణ, ప్రబోధం, మార్గదర్శకత్వం అవసరమవుతాయి. ఆ పనిని కొన్ని సమాజాలలో మతం చేయపూనింది. ఆ సూత్రాల సంపుటీకరణమే నీతి శాస్త్రంగా, మత విధిగా అవతరించింది. ఇది మతంయొక్క ప్రయోజనకర పాత్ర.

మతాలు అత్యధికంగా పురుషులచేత స్థాపించబడినాయి. దేవుళ్ళ ఎక్కువగా పురుషులు. ప్రవక్తలు పురుషులు. పూజారులూ వారే. ఇలా పురుష ప్రధాన్యత కల సమాజంలో ఉద్భవించే మత ధర్మ శాసనాలు మగవారి పెత్తనాన్ని రూఢి చేస్తాయని అంటే తప్పులేదు. మతధర్మ శాసనాలను తీక్షణంగా పరిశీలిస్తే ఈ సత్యం గోచర మవుతుంది.

ఏ పురుషుడూ, ఏస్త్రీ తల్లి గర్భంనుండి బయటకువచ్చేటప్పుడు ఫలాని మతపు మనిషిగా భూమి మీదకురావటంలేదు. కేవలం మనిషిగానే పుట్టుకసాగుతున్నది.మతాన్ని కులాన్ని, ఆవ్యక్తికి సమాజం అంటగడ్తున్నది. సామాజికవవ్యహారం పేరుతో ఆవ్యక్తికి ఒక రకమయిన హోదాను నిర్దేశిస్తున్నది సమాజం. ఆ వరవడిలో పెరిగిన ఆవ్యక్తి ఆ హద్దులను, పరిమితులను దాటిపోలేక నానా యాతనా పడటం తరుచు చూస్తున్నాం. తన మతస్తులంటే వల్లమాలిన అభిమానం, వేరు మతపువారంటే అసహ్యం, ద్వేషం పెంచు కోవటం చూస్తున్నాం. ఇది తర్వాత ఘర్షణలకు దారితీయటం కద్దు. మతకలహాలకు మూలం ఈ వేర్పాటు భావన యేనని గ్రహించాలి. మతధర్మ శాస్త్రాల తీరుతెన్నులను కూలంకషంగా అధ్యయనం చేయటం అవశ్య కర్తవ్యం. స్త్రీల అణచివేతను మతాలు సమర్థించాయనిగ్రహిస్తే, ఆ అణచి వేతను మతధర్మశాసనలు ఆమోదించాయని మన సులో ఉంచుకుంటే మతధర్మశాసన నియమాలను స్త్రీ విమోచనోద్యమకారులు విచక్షణా యుతంగా తెలిసికోవడం తప్పనిసరి.

అన్నిమతాలూ స్త్రీలను చిన్నచూపు చూచాయని తెలుతుంది. కాగా వాటిలో తర తమ భేదాలుంటాయి. ఉన్నాయి కూడాను కనుక ముఖ్యమైన మతధర్మ శాసనాలను పేర్కొని, పోల్చిచూడటం మనవిధి, కర్తవ్యంనుకూడా, కొన్నిమతాలు స్త్రీనిక్రూరంగా అణచివేస్తే, మరికొన్ని కొంచెం ఆదరం చూపాయి. అంతేగాని ఏమతమూ పురుషాధిక్య

తాభావాన్ని అధిగమించి పోలేదు. స్త్రీ పురుషుని సొత్తు. అంతగా కాదని మూర్ఖిస్తే ఆమె పురుషుని బానిస, కాదు కూడదని భీష్మిస్తే, ఆమె పురుషుని కన్నతక్కువ స్థాయికల మనిషి. ద్వితీయశ్రేణి పౌరురాలు, ఇవి మతాల ఆలోచనా రీతులు. కొన్నిమతాలే పరిణామం చెందాయని మరికొన్ని స్థాణువులుగా మారిపోయాయని గ్రహించాము. కొన్ని మతాల సూత్రాలు 3 వేలసంవత్సరాల సామజిక నియమాలయితే, మరికొన్ని 2 వేల సంవత్సరాలనాటివి. మరో మతం కేవలము సుమారు 14 వందల సంవత్సరాల చరిత్ర మాత్రమే కల్గిఉన్నది.

హైందవంలో శాసనాలు మారుతూవచ్చాయి 1978 దాక. ఇస్లాంలో చివరి ప్రగతిశీల పరివర్తన 1939లో జరిగింది. 1986లో వచ్చినమార్పు తిరోగమనమే కాని పురోగమనం కాదు. క్రైస్తవంలో మార్పు 1869తో ఆగిపోయింది.

ఏదయినా స్త్రీల పరిస్థితిని మదింపువేసేముందు ఒక అంశాన్ని విస్మరించరాదు. ఈకాలపు శాసనాలను మాత్రం పరిగణన లోకి తీసుకొని గుణాగుణ పరిశీలన సాగాలి. లేక పోతే చారిత్రక అధ్యయనం సాగిస్తే ఊబిలో దిగిపోతాము. ఈచిన్న కరపత్రంలో దానికి చోటుఉండదు. పైగా అవసరం కూడాలేదు. (వివరాలకు మల్లాది సుబ్బమ్మ "హైందవం స్త్రీలు" "ఇస్లాం స్త్రీలు" "క్రైస్తవం స్త్రీలు" చదవండి.)

ఈ నాటి మతధర్మశాసనాలను లెక్కలోకి తీసుకొని మంచి చెడ్డలను నిర్ణయించేటప్పుడు విధిగా ఆయా మతాలు స్త్రీల పట్ల ప్రదర్శించిన వైఖరిని, స్త్రీలకు ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన విధి నిషేధాలను సందర్భోచితంగా ఉంటంకించక తప్పదు. అలా పేర్కొనడం న్యాయం కూడాను.

స్త్రీలకు సంబంధించిన అంశాలని వేరు వేరుగా పేర్కొని వాటి తారతమ్యాలకు బేరీజు కట్టడం తప్పకుండా జరగవలసిన పని. దానిని తరువాత వచ్చే అధ్యాయాలలో నిర్వహించ ప్రయత్నిద్దాం.

## 2. హోదా

ఒక్కొక్క మతం ఒక ప్రత్యేక పద్ధతిలో స్త్రీల హోదాను నిర్ణయించిందని మనం ముందుగా చెప్పుకున్నాం. కాగా అమతం లోనే విభిన్న భావాలు చోటుచేసుకున్నట్లు కన్పిస్తుంది. ఏమతమూ కాస్తోకూస్తో మారక తప్పదు! కనుక ఒకానొకప్పుడు పరస్పర విరుద్ధమైన భావాలు దర్శన మిస్తాయి. వాటి కాల నిర్ణయం చేసు కొని అన్వయం చేసుకోవటం అవశ్య కర్తవ్యం.

# హైందవం

పని పాటలు చేయటంలో దాసిలాగా, ఆలోచన చెప్పేటప్పుడు మంత్రివలె, ఓర్మిలో భూమినిపోలి, భర్తకు ఆహారం పెట్టేటప్పుడు తల్లితో సమానంగా, శయనంలో రంభకు దీటుగా, పనులను చేస్తూ ఆమె ఉంటే ఆమెను కులధర్మపత్ని అనిగౌరవిం చారు హైందువులు. ఇదంతా మంచిగానే కన్పిస్తుంది కదూ? పాపం! పురుషుడు తనకు ఉన్నకోరికలను అన్నీ ఇందులో చెప్పాడు. తన స్వవిషయం ఎంతగా ఆలోచించాడు! ఆమె సంగతి అతనికి అక్కరలేదు?

హిందూ మతం మాతృత్వాన్ని కొనియాడింది. తల్లిని గౌరవించింది. అంటే సంతాన లబ్ధి కోసమే ఆమె జీవించాలని అర్థం స్ఫురిస్తున్నది. అందుకే పిల్లలులేని స్త్రీని 'గొడ్రాలు' అనిపేరు పెట్టి ఆమెను తక్కువచూపు చూసింది.

భర్తయెంత దుర్మార్గుడయినా, శీలరహితుడయునా అతని సేవచేయమని ఆదేశిం చింది హైందవం. పాతివ్రత్యం దొడ్డ గుణమని ఎలుగెత్తిచాటింది. అలాంటి స్త్రీని 'పతి వ్రత' అనిపేరు పెట్టి గొప్పగా చిత్రించింది.

శారీరకంగా భార్యాభర్తలు వేరు అయినా మానసికంగా వారు ఇరువురు ఒక వ్యక్తిగాకావడమే హిందూ ధర్మ లక్ష్యమని మన వారు పొగుడు కుంటున్నారు. అంటే స్త్రీని మరొకవ్యక్తిగా చూచి ఆమె యొక్క సహకారాన్ని అర్థించటం కాదు. వైవాహిక జీవితరథానికి రెండు. చక్రాలు. ఒకటి భర్త. రెండువది భార్య. ఒక చక్రం మాత్రమే కదులుతూంది. రెండవది కదలదు. బండి ఆ చక్రాన్ని ఈడ్చుకొని పోతుంది. అంటె భర్త అనేచక్రం ముందుకుపోతూవుంటే భార్యఅనె చక్రం వెంటబడిపోతుంది. భర్త స్వతంత్రంగా ఆలోచించి వ్యవహరిస్తాడు. భార్యఅతన్ని అనుసరించాలి. ఇదీ ఆలోచన!

స్త్రీలకు వ్యక్తిత్వం ఉందికాని అది వారి 'స్త్రీత్వం' ముందు తల వంచాలని మరి యొకమాట. అంటే స్త్రీకి ఆత్మగౌరవం ఉండవచ్చు కాని అది కుటుంబంలో తాదాత్మ్యం కావాలని ఊద్బోధ. స్త్రీని అస్వతంత్రగా చిత్రించాడు మనువు. చివరకు ధర్మ నిర్వాహ ణలో కూడా అమె పతిని అనుసరించాల్సిందే. స్త్రీని హీనంగా, నీచంగా పేర్కొన్న ఘట్టాలు ఎన్నో ఉన్నాయి. వీటిని పురుషలు కసిగా చెప్పిన మాటలని చెప్పి త్రోసిపా రేస్తామా? మనువు. స్త్రీలను దయతో చూడమని మరొక చోటచెప్పాడు. పెంపుడు

పశువులను దయగా చూచి పచ్చి గడ్డి వేయకపోతే పాలివ్వదు కదా! అలాగే స్త్రీని మంచిగా చూచి చాకిరీ చేయించుకోవటం యుక్తమని సలహా చెప్పాడు మనువు. అలా చేయకపోతే కుటుంబంలో శాంతిఉండదని అయనకు తెలుసు. అందుకని ఆమెకు 'గృహ లక్ష్మి' అనే బిరుదు ఇచ్చి పనిపాటలు చెయించుకోవటం తెలివి కలవారి లక్షణంగా తయారయింది. ఋగ్వేద కాలంలో స్త్రీలపరిస్థితి కొంతమెరుగుగా వుండేది. తరువాత అది క్షీణించింది.భౌద్ధంలో కొంతగా కొంత మంచిమార్పు వచ్చింది. తరువాత రెండు వేల సంవత్సరాలనుండి ఆమెహోదా పూర్తిగా దిగజారిపోయింది. మధ్యయుగంలో ఆస్తి హక్కు విషయంలో మాత్రం ప్రగతి, తతిమ్మ అంశాలలో హీనంగావుండేది. బ్రిటిష యుగం సగం పడేవరకు అలాగే ఉంది. తరువాత కొంత స్త్రీకి అనుకులంగా మార్పు వచ్చింది. ఇపుడు అమలులోఉన్న శాసనాల ప్రకారము - చాలవరకు. స్త్రీపురుషునితో సమాన హోదాను అనుభవించగలదు, ఆ హోదా ఆమెకు లభ్యమవుతున్నదా లేదాఆనేది మరోవిషయం.

## ఇస్లాం

ప్రవక్త మహమ్మదు స్త్రీలను రెండవ రకపు మనుష్యులుగా పరిగణించాడు, "పురుషలు స్త్రీలకు సంరక్షకులు, అధికారులు" అని స్పష్టీకరించాడు. ధర్మం ప్రకారం స్త్రీపురుషులకు సమానమైన హక్కులున్నా "పురుషులకు స్త్రీలపైకొంత ఆధిక్యతకలదు" అని చెప్పాడు. భార్యను పోషించేవాడు భర్తకనుక అతనిది కుటుంబంలో పైచేయి. స్త్రీలు సర్వదా పురుషుల సంరక్షణలో ఉండ వలసిన వారేనని ఖురాన్ ప్రవచనం. ఎంత సేపూ, మౌలికంగా, పురుషులపరంగానే ఆలోచించాడు మహమ్మదు. కాగా ఆనాటి సమాజంలో ఆమె కున్న హోదా కన్న ఎక్కువ హోదాను ప్రతిపాదించిన మాట వాస్తవమే. వివాహం స్త్రీపురుషుల 'పవిత్రమైన ఒడంబడిక' అనిచెప్పింది ఇస్లాం. కాని ఏక పక్షంగా భర్తకు ప్రత్యేక హక్కులను ప్రసాదించింది. బ్రిటిషవారి కాలంలో 1939లో స్త్రీకి కొన్ని సౌకర్యాలు శాసన పరంగా వచ్చాయి. 1986లో కేంద్ర ప్రభుత్వం సనాతనులకు తల ఒగ్గడంతో తిరోగమనం ప్రారంభమయింది. శాసన పరంగా చూస్తే ఆమెకు సమానత్వం ప్రాప్తించలేదు. ముందు వచ్చే అధ్యాయంలో ఈ అంశాన్ని సోదాహరణంగా గమనించవచ్చు.

## క్రైస్తవం:-

సృష్టి క్రమంలో జంతువుల తరువాత స్త్రీ సృష్టి చేయబడింది. మొదటి స్త్రీ

పురుషుడైన ఆదాము ప్రక్కటెముక నుండి పుట్టినది. ఆమె నారి. నరుని నుండి పుట్టినది. భార్య పురుషుని ఆస్తి. స్త్రీ పురుషుని మహిమ అయి వున్నది. స్త్రీ పురుషుని కొరకే గాని, పురుషుడు స్త్రీ కొరకు సృజింపబడలేదు. దేవుని ఆజ్ఞను కాదని వృక్ష ఫలమును ఆదాము హవ్వలు తింటే స్త్రీకి శాపాలు ఇచ్చాడు యెహోవా. 'నీకు గర్భ వేదన కలుగును' అని అన్నాడు. 'నీ భర్త నిన్ను ఏలును' అని శాసించాడు. పాత నిబంధనలో పురుషుని ఆస్తిని, జంతువులను పేర్కొంటూ స్త్రీని కూడా జాబితాలో చేర్చి వాటిని ఇతరులు ఆశించరాదని కట్టడి చేసింది పాత నిబంధన. స్త్రీని నిరసిస్తూ చెప్పిన మాటలు కోకొల్లలు. తల్లిని 'మహిళా' అని సంబోధించి ఏసు మహిళలను న్యూనత పరిచాడు. పౌలు భావాలు మరీ ఘోరం. స్త్రీకి శిరస్సు పురుషుడట! సంఘంలో స్త్రీ మాట్లాడటం అవమానమట! సంఘం క్రీస్తునకు లోబడినట్లుగా భార్యలు కూడ ప్రతి విషయంలో తమ పురుషులకు లోబడవలెనట! మత గురువులు స్త్రీని అతి హీనంగా పరిగణించారు. స్త్రీని ఎంతో దుర్మార్గురాలుగా చిత్రించారు. పాత నిబంధన కాలంలో స్త్రీ తండ్రి యొక్క ఆస్తి, భర్తయొక్క ఆస్తి. కొన్నాళ్ళు స్త్రీని బానిసగా చూచింది యూదా మతం. తరువాత క్రైస్తవం ఆమెను రెండవ రకపు జీవిగా చేసింది. స్త్రీల అణచివేత విషయంగా రూపం మారింది కాని దృక్పథం మారలేదు. పురుషాధిపత్యానికి పట్టం కట్టింది క్రైస్తవం. ఈనాటి శాసనాలు ఆ స్థితిని పెద్దగా మెరుగు పరచలేదు. స్త్రీల ప్రగతి 1869లో ఆగిపోయింది. ఏ బ్రిటీషు సమాజాన్ని చూచి క్రైస్తవ శాసనాలు రూపొందాయో ఆ బ్రిటీషు సమాజం మారి తన శాసనాలు మార్చుకున్నా మన దేశంలోని క్రైస్తవ సమాజం మాత్రం మారలేదు. మరే ప్రయత్నాలు చేయటం లేదు.

## పార్శీ మతం:—

పార్శీ సమాజంలో స్త్రీల యెడ కొంతగా కొంత గౌరవభావం ఉంటున్నది మరీ అల్ప సంఖ్యాకుల మతం కావడం, కేవలం శక్తి సామర్ధ్యాల వల్ల చుట్టూవున్న సమాజంలో స్థానం సంపాదించుకోవలసి ఉండడం వల్ల స్త్రీ పురుషులు శ్రమించి పని చేయవలసి వచ్చింది. దాంతో వారు విద్యను అభ్యసించారు. స్త్రీలు కూడా విద్యావంతులు కావడం తటస్థించింది; ఉద్యోగాలు చేయవలసిన అవసరం కలిగింది. అందువలన భారతదేశంలోని పార్శీలు తమ మతధర్మ శాసనానను తతిమ్మా వారికన్నా ముమ్ముందుగా సవరించుకున్నారు. ఆధునిక ప్రపంచపు పోకడతో జీవితాలను సమ

న్వయం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నారు. పురాతన పార్శీ మతంలో స్త్రీల హోదా ఎలా ఉన్నా ఈనాడు పార్శీ సమాజంలో స్త్రీల హోదా చాలా వరకు తృప్తికరంగా ఉన్నట్లే ఎంచుకోవచ్చును. అంతవరకు అది ప్రగతి క్రింద మనం పరిగణించవచ్చు.

# 3. వివాహం

మత ధర్మ శాస్త్రాలలో మతాలవారీగా వివాహాన్ని గురించి చర్చించేటపుడు ఈ దిగువ అంశాలను మనస్సులో ఉంచుకోవలసి ఉంటుంది:-

(i) బహు భార్యాత్వం (ii) వివాహ స్వభావం
(iii) వివాహ విధానం (iv) వయః పరిమితి
(v) వివాహాన్ని రిజిస్టరు చేయటం.

## (i) బహు భార్యాత్వం:-

**హైందవం:-** బొంబాయి రాష్ట్ర శాసనసభ హిందువులలో బహు భార్యాత్వాన్ని నిషేధిస్తూ 1946లో బిల్లును ఆమోదించింది. అలాగే ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నిషేధ శాసనాన్ని 1949లో రూపొందించింది. సౌరాష్ట్ర ప్రభుత్వం 1950లో శాసనం చేయించింది. ఆయా తేదీల వరకు ఆయా ప్రాంతాలలోను, తరువాత 1955 వరకు భారతదేశంలోని తతిమ్మా ప్రాంతాలలోను హిందువులు బహు భార్యాత్వాన్ని పాటించవచ్చును. అంటే సిద్ధాంత రీత్యా వారు వేలమంది భార్యలను కలిగి ఉండవచ్చునన్నమాట. 1955 నుండి ఏక భర్తృత్వ, ఏక పత్నీత్వ వివాహ విధానం అమలులోకి వచ్చింది. భార్య ఉండగా విడాకులు లేక ఏ హిందూ పురుషుడైనా మరొక స్త్రీని వివాహమాడితే అతనిపై భార్య క్రిమినలు కేసుపెట్టి అతనిని జైలుకు పంపవచ్చును.

**ఇస్లాం-:** ముస్లిం మతానుసారం ముస్లిం పురుషుడు ఏక కాలంలో నలుగురు భార్యలను కలిగి ఉండవచ్చును. మహమ్మదు ప్రవక్త అలాగని శాసించాడు; కాగా అందరిని సమదృష్టితో, సమైక్య భావనతో చూడవలయునని ఆయన ప్రబోధించిన మాట నిజమే. కాని ఏ పురుషునికి అది సాధ్యమవుతుంది. అసాధ్యాలను ఆశించడం అవివేకం కాదా? పైగా పురుషుడు 'తలాక్' అనే పదాన్ని మూడుసార్లు ఒక్క బిగిని ఉచ్చరించి, భార్య ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా, ఆమెను త్యజించవచ్చును. అపుడు ఆమె స్థానాన్ని అతడు, మరొక స్త్రీని వివాహమాడుట ద్వారా, భర్తీ చేసుకొనవచ్చును. అలా ఒకే సమయంలో నలుగురిని మించిన సంఖ్యలో అతనికి భార్యలుండరాదన్న నియ

మాన్ని పాటిస్తూనే ముసల్మాను పురుషుడు పెక్కుమంది స్త్రీలను వివాహమాడుతూ విడాకులిస్తూ అనేకమంది స్త్రీలతో సంపర్కం పెట్టుకోవచ్చును. ఇది స్త్రీ పురుష సమానత్వ సిద్ధాంతానికి వ్యతిరేకం. స్త్రీని కేవలం భోగ వస్తువుగా పరిగణించడానికి ఉపకరిస్తుంది. ఇది గర్హ్యణీయం. నిందార్హం. క్షమింపరాని పద్ధతి. ముస్లింలా ముస్లిం పురుషులకు అక్రమమైన అధికారాలను ఇస్తున్నదనే దానికి ఈ బహుభార్యాత్వ విధానమే నిదర్శనం.

## క్రైస్తవం:-

క్రైస్తవ శాసనం ప్రకారం ఏక భర్తృత్వం ఏక పత్నీత్వంగానే వివాహం ఉండాలి. విడాకులు తీసుకొనకుండా స్త్రీ కాని, పురుషుడు కాని మరియొక పురుషుని లేక స్త్రీని వివాహమాడరాదు. అలా చేసుకుంటే తరువాతి వివాహం చెల్లదు. పైగా వివాహమాడిన వ్యక్తి శిక్షకు లోనవటం జరుగుతుంది.

## పార్శీమతం:—

1936 శాసనం ప్రకారం భార్య బ్రతికియుండగా భర్త, పతి జీవించియుండగా పత్ని మరియొకరిని వివాహమాడటం నేరం. ఆ రెండవ పెండ్లి లా ప్రకారం చెల్లదు

## (ii) వివాహ స్వభావం:—

**హైందవం:-** హిందూమత దృష్టిలో వివాహం పవిత్ర కార్యం. ధర్మార్థ కామ మోక్ష సాధనకోసం స్త్రీపురుషులు వివాహమాడుతారు. దేవ రుణం తీర్చటానికి, పితృ రుణం తీర్చడానిక సంతానం అవసరం. సంతానం కోసం వివాహం తప్పనిసరి. సంతానానికి ప్రాముఖ్యత హెచ్చు. కనుక భార్య గొడ్రాలు అయితే ఆంధ్రప్రాంతంలో పురుషుడు మరియొక స్త్రీని భార్యగా స్వీకరించేవాడు. ఇది 1949 కి పూర్వం నాటి మాట. ఇపుడు సంతానం కలుగలేదనే కారణం మీద భార్యను త్యజించి పునర్వివాహం చేసుకోటానికి శాసనం సమ్మతించదు.

## ఇస్లాం:—

ముసల్మాను మత ప్రకారం వివాహం కేవలం ఐహికం. ఈ లోకానికి సంబంధించినది. స్త్రీపురుషులు ఆనందంగా జీవించే నిమిత్తం వివాహమాడతారు. ఇక్కడ సుఖ ప్రాప్తికి, ఆనంద లబ్ధికి ప్రాధాన్యత హెచ్చు. సంబంధం ఇరువురి ఇష్టంపై ఆధారపడుతుంది. అది ఒడంబడిక వల్ల ఏర్పడుతుంది. కాగా ఆ ఒడంబడికకు విశేష

ప్రాధాన్యత ఇస్తారు. సంతానానికి సక్రమ స్థాయిని ఇవ్వటం, ఉద్వేగాలను అదుపులో పెట్టు కోవటం వీటికి వివాహ వ్యవస్థ సాధనం. ఇస్లాం బ్రహ్మచర్యాన్ని ప్రోత్సహించదు. వృద్ధులు, సంతానోత్పాదన శక్తి లేనివారు కూడా వివాహమాడవచ్చును. ఈ వివాహంలో లైంగికానందానికి ప్రాముఖ్యత హెచ్చుగా కన్పిస్తుంది.

## క్రైస్తవం

జారత్వ నివారణ కోసం వివాహమాడవచ్చని పౌలు చెప్పినాడు. వివాహం ఆనంద ప్రాప్తికోసమని, జీవిత సంపూర్ణత్వం కోసమని చెప్పలేదు. పైగా బ్రహ్మచర్యాన్ని ఉత్తమమైనదిగా పొగిడింది తొలినాటి క్రైస్తవం. సంతానప్రాప్తిమీద, దైవపూజమీద నొక్కుగా కన్పడుతున్నది. స్త్రీ పురుషులమధ్య పరస్పర విశ్వాసం, సన్నిహితత్వం, మేధోపరమైన ఉద్వేగ పరమైన సంయోగం, లైంగికానందం వీటికి ప్రాధాన్యత తక్కువగా ఉన్నట్లు కన్పడుచున్నది. క్రైస్తవులు దేవునిపేర, ఏసుపేర ప్రమాణాలు చెయ్యాలి వివాహ సమయంలో. దీనినిబట్టి మత ప్రాధాన్యత బహిర్గతమవుతున్నది.

## పార్శీ పద్ధతి:-

వివాహం మతగురువుచేత రిజిష్టరు చేయబడుతుంది. తద్వారా మత ప్రాధాన్యత నోటుచేసుకుంటున్నది. 'ఆశీర్వాద్' అనే పేరుగల వివాహ విధానాన్ని మత గురువు పాటిస్తాడు. అంటే దైవభావన, దాస్యభావన ఇందులో ఇమిడి ఉన్నాయన్నమాట. ఇది 1936 పార్శీ వివాహం మరియు విడాకుల శాసనం ఏర్పరచిన పద్ధతి.

## (iii) వివాహ విధానం:-

**హైందవం:-** ఒకనాడు హిందువులలోని ద్విజులలో-బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలలో—కన్యాదానం, పాణిగ్రహణం, సప్తపది విధిగా ఉండాల్సిన పద్ధతి ఉండేది. ద్విజేతరులలో ఎక్కువగా ఆచారంపై నొక్కు ఉండేది. కన్యాదానం అంటే తండ్రి కన్యను వరునికి దత్తం చేస్తాడన్నమాట. మహాత్మా గాంధి కన్యాదానాన్ని నిరసించాడు. ప్రాణిగ్రహణంలో 'నీవు నామాట వినుము' అని సప్తపదిలో నీవు "బలంకోసం, ఆహారంకోసం, సంతానం కోసం, సఖ్యతకోసం ఇలా ఏడింటికోసం ఏడు అడుగులు నాతో వేయుము' అని వరుడు వధువును కోరతాడు. ఇది పురుష ప్రాధాన్యత కల తంతు. కొన్ని కులాలలో సప్తపది కూడా లేదు.

మాంగల్యధారణ అనార్య సంప్రదాయం. తాళికట్టే పద్ధతి పదకొండవ శతాబ్దిలో స్కాంధ పురాణంలో మనకు దర్శనమిస్తుంది. మెల్లగా ఈ పద్ధతి తెలుగు వారిలో అన్నికులాలలోకి ప్రాకింది. తాళి లేనిపెళ్ళి సక్రమం కాదనే దాకా వెళ్ళారు కొందరు పండితులు. అది సరికాదు. 1955 వివాహ శాసనం ఆ పరిస్థితిని మార్చింది. వధూవరులలో ఏ ఒకరి ఆచారం ప్రకారమైనా తంతుప్రకారమైనా వివాహం జరుగవచ్చును. అయితే అలాంటి ఆచారంలో సప్తపది ఉంటే విధిగా ఏడు అడుగులు వేయవలసి ఉంటుంది. ఏడవ అడుగు వేస్తేగాని పెండ్లి అయినట్లు లెక్కకాదు, సప్తపదిని పాటించ దలుచుకోకపోతే ఆ ప్రశ్న ఉదయించదు. హేతవాదులు, అజ్ఞేయ వాదులు (దేవుడు ఉన్నాడో లేడో మనకు తెలియదు అనేవారు) నాస్తికులు శాసనం ప్రకారం హిందువులుగా పరిగణింపబడినా వారు ఈ మత తంతును అనుసరించనక్కర లేదు. వారి ఆచారం ప్రకారం దండల పెళ్ళి చేసుకోవచ్చును. అలాంటి పెళ్ళి చెల్లదని తీర్పులు ఇంకా పుట్టలేదు. కాని, అవసరంవస్తే హేతువాదులు దండల పెళ్ళి తమ ఆచార మని రుజువు చేసుకోవాలి. హిందూ మతస్తులకు ఆ బాధలేదు. ఇది సంపూర్ణమైన వివక్ష. ఇది సమర్థనీయం కాదు.

## ఇస్లాం:-

పెద్దల సమావేశంలో 'నాయబ్' (మతగురువు) పెండ్లికూతురు తరఫున 'వలీ' ఎవరో నిర్ణయిస్తాడు. అతనిని ఇద్దరు సాక్షులతో పెండ్లికూమార్తె ఇంటిలోకివెళ్లి ఆమెతో 'ఇన్నిరూపాయల మహరుతో ఫలానా అబ్బాయిని వివాహమాడుటకు నీకు ఇష్టమేనా' అని అడగమని ఆదేశిస్తాడు. 'వలీ' సాక్షులతో ఇంట్లోకి వెళ్ళి ఆమెను అడుగుతాడు. సాధారణంగా ఆమె బురఖాలో ఉంటుంది. 'హా' అని ఆమె అన్నా లేక మౌనంగా ఊరుకున్నా ఆమె అంగీకరించినట్లే. సర్వసామాన్యంగా వలీ ఆమె మేనమామయో, లేక పినతండ్రియో, లేక సోదరుడో అయిఉంటాడు. కనుక ఆమె గొంతును గుర్తుపట్టాడని లేక ఆమెకు ముసుగులో ఉన్నా గుర్తిస్తాడని అంచనా. 'వలీ' సాక్షులతో తిరిగి వచ్చి వరుడు కూర్చొనియున్న సభలో 'నాయబ్'కు 'ఆమె అంగీకరించింది' అని చెప్తాడు. అంత నాయబ్ ఖురాన్ పఠించి రిజిష్టరులో వరునిచేత, వలీచేత దస్కతులు చేయిస్తాడు. తను దస్కతు చేస్తాడు. దాంతో లా ప్రకారం పెండ్లి అయిపోయినట్లే.

## క్రైస్తవం:-

క్రైస్తవులలో పెండ్లిని మతగురువు లేక వివాహాల రిజిష్ట్రారు చేయిస్తారు. రిజిష్టరులో దస్కతులు చేయించుకుంటారు వధూవరులచేత. భారతీయ క్రైస్తవులలో

"భగవంతుని సమక్షంలో, ఏసుప్రభు పేర నిన్ను నాభార్యగా/నాభర్తగా శాసనం ప్రకారం స్వీకరిస్తున్నాను" అని ప్రమాణం చేయిస్తాడు మతగురువు. రిజిష్టారు అయితే "నేను ఫలానా ఈమెను, ఇతనిని భార్యగా, భర్తగా శాసనం ప్రకారం స్వీకరిస్తున్నాను గమనించండి' అని ఎలుగెత్తి చాటేటట్లు చేస్తాడు. వధూవరులలో ఏ ఒక్కరు లేక ఇరువురు క్రైస్తవులయినా క్రైస్తవ వివాహ శాసనం వర్తిస్తుంది. కాగా ఇరువురు భారతీయ క్రైస్తవులు (మతం స్వీకరించిన క్రైస్తవుల సంతానం లేక మతం స్వీకరించిన క్రైస్తవులు) అయితే 1872 భారతీయ క్రైస్తవ వివాహ శాసనపు రివ భాగం వర్తిస్తుంది.

## పార్శీల తంతు:—

'ఆశీర్వాద్' అనేమత తంతు జరిగిన తరువాత మతగురువు వివాహన్ని రిజిష్టరు చేసి వధూవరుల దస్కతులు, సాక్షుల సంతకాలలో ఉన్న ధృవపత్రాన్ని ప్రభుత్వంచేత నియమింపబడిన వివాహాల రిజిష్ట్రారు'కు పంపుతాడు.

## (iv) వివాహ వయఃపరిమితి.

**హైందవం:**— ఈనాటి హిందూ వివాహ శాసనం క్రింద వరునికి 21 సంవత్సరాలు నిండాలి, వధువుకు 18 సంవత్సరాలు వయస్సు పూర్తికావాలి. బాల్య వివాహ శాసనం క్రింద కూడా అలాగే (1978 సవరణ తర్వాత) వయః పరిమితి నిర్దేశించ బడినది. కాగా చిన్న పిల్లల పెళ్ళి చెల్లదని ప్రకటించలేదు. అయితే వధువుకు 15 సంవత్సరాలు నిండకముందే వివాహమయిన పరిస్థితిలో ఆమెకు 15 సంవత్సరములు నిండిన తదుపరి 18 సంవత్సరములు నిండేలోగా, ఆమెకు శోభనం అయినా కాక పోయినా ఆమె నాకీ వివాహ బంధం వద్దని ప్రకటించి పెండ్లిరద్దు చేయించుకోవచ్చును. (సెక్షను 13(2)iv హిందూవివాహ శాసనం 1955). బాల్యవివాహం చేయించినవారికి, చేసుకున్న వరునికి, అతని తల్లిదండ్రులకు శిక్షలు ప్రకటించారు కాని పెండ్లి చెల్లదనే ప్రకటన చట్టబద్ధంగా చేయనందున బాల్య వివాహాలు విరివిగా **సాగుతున్నాయి.** సంస్కరణ పమ్ముర అయింది చాలా వరకు.

వేదకాలంలో రజస్వలానంతర వివాహాలు జరిగేవి. క్రీ.పూ. 4వ శతాబ్దంనుండి ఆడపిల్లలకు చిన్నతనంలోనే పెండ్లి చేయాలనే వాదన ప్రారంభమయింది. ఎనిమిది ఏండ్లు నిండేలోగా పెండ్లి చేయటానికి తాపత్రయ పడ్డారు. ఆపద్ధతులే ఇప్పటికీ కొన్ని కులాల వారిలో సాగుతుండటం శోచనీయం.

## ఇస్లాం :-

1978లో సవరింపబడిన బాల్య వివాహ నిషేధ శాసనం ముసల్మానులకు కూడా వర్తిస్తుంది. దాని ప్రకారం 21 సంవత్సరములు నిండని వరుడు, 18సంవత్సరములు నిండని వధువు వివాహమాడరాదు. 1929లో శాసనం పుట్టినపుడు వరునికి 18 సం॥ నిండాలని, వధువుకు 14 సంవత్సరాలు నిండాలని నిర్దేశింపబడింది. ముసల్మానులా ప్రకారం 15 సంవత్సరములు నిండితే అతడు లేక ఆమె మేజరు అయినట్లు లెక్క కాని ఇండియాను మెజారిటీ ఆక్టు ప్రకారం 18సం॥ నిండాలి కాగా వివాహం, మహర్, విడాకులు ఈమూటి విషయంలో 15సం॥ దాటిన స్త్రీ పురుషులు మేజర్ల క్రింద లెక్క. ఇదంతా 1978కి పూర్వం పరిస్థితి. ముసల్మాను స్త్రీకి 15 సంవత్సరాలు నిండక ముందు వివాహమయితే, ఆమెకు 18 సం॥ వయస్సు నిండేలోగా భర్తతో ఆమె దాంపత్య జీవితం గడపని పరిస్తితిలో మాత్రమే ఆమె ఆ వివాహాన్ని కాదని రద్దు చేయించుకోగలదు. కాగా మైనరుగా ఉన్నపుడు జరిగిన వివాహం చెల్లదని ఎక్కడా వ్రాయలేదు.

## క్రైస్తవం:-

భారతీయ క్రైస్తవులలో వరునికి 21 సం॥లు వధువుకు 18 సం॥ నిండి ఉండాలి. (సెక్షను 60 భారత క్రైస్తవ వివాహ శాసనం 1872) ఇతర క్రైస్తవులయితే ఇరువురికి 21 సంవత్సరాలు నిండాలి. లేనియెడల తండ్రి లేక ఇతర సంరక్షకుని అనుమతి కావాలి (సెక్షను 19 మరియు సెక్షను 3లో 'మైనరు' నిర్వచనం.)

## పార్శీ వివాహం :-

ఇరువురికి 21 సంవత్సరాలకు తక్కువ కాకుండా వయస్సు వుండాలి. 21 సంవత్సరాలకు తగ్గితే తండ్రి లేక సంరక్షకుని అనుమతి కావాలి. అలా అనుమతి లేని వివాహం చెల్లనేరదు. (సెక్షను 3 సి) పార్శీ వివాహం మరియు విడాకుల చట్టం 1936) అయితే ఏ పరిస్థితులోను వ్యాజ్యంనాటికి వరునికి 16 సంవత్సరములు లేక వధువుకు 14 సం॥ నిండక పోతే ఆ పెండ్లినికాని ఆపెండ్లి వల్ల ఉనికి కల్గిన ఒప్పం దాన్ని కాని ఏకోర్టు అమలు పరచరాదని సెక్షను 33లో (పార్శీవివాహం మరియు విడాకుల చట్టం 1936) స్పష్టీకరించబడినది.

## వివాహాన్ని రిజిష్టరు చేయటం

### హైందవం :-

హిందూ వివాహ శాసనవు పరిధిలోకి వచ్చే వివాహాలను విధిగా రిజిష్టరు చేసుకోనక్కరలేదు. కాగా ఇష్టమున్న వారు బుద్ధి పూర్వకంగా రిజిష్టరు చేయించుకో

వచ్చును. (సెక్షను 8 హిందూ వివాహ శాసనం 1955) చాలా మంది విదేశాలకు వెళ్ళేవారు, తేలికగా రుజువు కావాలని కోరి సాక్షి సాధకాన్ని ఆశించేవారు పెండ్లిని రిజిష్టరు చేసుకొని రిజిష్ట్రారు సర్టిఫికెట్టు పొందుతున్నారు. పెండ్లి పత్రిక, వధూవరుల ప్రమాణ పత్రాలు' తండ్రి తల్లి యొక్క ప్రమాణ పత్రం దాఖలుచేసి, ఫీజుచెల్లించి సాక్షులను తీసుకెళ్ళి రిజిష్టరులో దస్కతు చేస్తే ఆ వివాహం రిజిష్టరు అవుతుంది.

### ఇస్లాం

'నికా' రిజిష్టరులో పెండ్లి జరిగినట్లు నమోదు అవుతుంది. వరుడు దస్కతు చేస్తాడు. వధువు తరపున 'వలీ' (సాధారణంగా మేనమామ, పినతండ్రి లేక సోదరుడు) సంతకం చేస్తాడు. 'నాయబ్', పెండ్లి చేయించిన మత గురువు, కూడా దస్కతు పెట్టాడు. ఆ రిజిష్టరులో వరుని పేరు చిరునామా, వధువు పేరు చిరునామా. మహార్ మొత్తం, 'హిబా' (వరుడు వధువుకు బహుమతిగా ఇచ్చేది) వ్రాస్తారు. ఆ రిజిష్టరు నాయబ్ వద్ద ఉంటుంది.

### క్రైస్తవం

క్రైస్తవ వివాహాన్ని ప్రభుత్వం నుండి లైసెన్సు పొందిన మత గురువుకాని లేక ప్రభుత్వం చేత నియమింపబడిన వివాహ రిజిస్ట్రారు కాని, లేక ఇతర మత గురువు కాని చేయించవచ్చును. లైసెన్సు పొందిన మత గురువు తన వద్దనున్న రిజిష్టరులో వివాహాన్ని నమోదు చేస్తాడు. లైసెన్సు పొందని మత గురువు తన రిజిష్టరులో పెండ్లిని గురించి వ్రాసి వధూవరులచేతను, ఇద్దరు సాక్షులచేతను దస్కతు చేయించి తను సంతకం చేయగలడు. తదుపరి తన ధృవ పత్రంతో నెల రోజులలోగా ప్రభుత్వం చేత నియమింపబడిన వివాహాల రిజిష్ట్రారుకుపంపవలెను, (సెక్షను 54)

### పార్శీలు

వీరి వివాహం విధిగా మత గురువు యొక్క రిజిష్టరులో నమోదు కావాలి.

# 4. దాంపత్య జీవితం

### హైందవం

హిందూ మతానుసారం భార్య పతివ్రతగా సంచరించాలి. భర్తకు విధేయురాలుగా ఉండాలి భర్త శ్రేయస్సు కోసం తన జీవితాన్ని యావత్తు ధారపోయాలి. అణగి యుండటం, సర్దుకు పోవటం, విధి నిర్వహణ ఆమె లక్షణాలు విధిక్రింద వివాహాన్ని నిర్ధారించి, వైవాహిక జీవితంలో పాతివ్రత్యం పేరుతో హిందూ స్త్రీ యొక్క వ్యక్తి

త్వాన్ని చిదిమివేసింది. హిందూ సమాజం ఈ పాతివ్రత్య భావన హిందూ స్త్రీల నర నరాన జీర్ణించి పోయింది. అందువలన వారు ఆత్మ స్వరూప సందర్శనం చేసుకోలేని స్థితిలో ఉన్నారు. భార్య విధిగా తల్లి కావలసిందే లేకపోతే ఆమె తన బాధ్యతను నిర్వర్తించలేనట్లే లెక్క. సంతానం కోసం అలమటించి చక్కని కాపురాన్ని నాశనం చేసుకునే పురుషులు అనంతంగా ఉన్నారు. ఇక భార్యలను వారు పెట్టే రంపపు కోతకు అవధులు లేవు. భార్య తను మనః ధన ప్రాణాలకు భర్త అధిపతి. ఆమె ఉద్యోగినియై, భర్త నిరుద్యోగి అయినా అతడే కుటుంబానికి పెత్తందారు, అతడే కుటుంబ ధనాన్ని ఆమె సంపాదనను వెచ్చించటానికి అర్హత కల వ్యక్తి. ఆమె బయటి ప్రపంచలో ఎంత ప్రయోజకురాలయినా ఇంట్లో ఆమె ప్రతిపత్తి చాలా హీనంగా వుంటుంది. సంతానాన్ని ఎంత మందిని కనాలో, ఎపుడు సంతానాన్ని పొందాలో, ఎలాంటి సంతానాన్ని (మగపిల్లవానినా ఆడపిల్లనా?) కనాలో భర్తే నిర్ణయిస్తాడు. ఆమెకు ఆ విషయంగా నిర్ణయంచేసే హక్కులేదు. తనకు శారీరక దౌర్బల్యం ఉన్నా, మానసికంగా మాత కాగలస్థితి లేకున్నా ఆమె శిశువును కనాల్సిందే. గర్భస్రావం చేయించుకునే హక్కు ఆమెకు లేదు. ఆమె శరీరం అతనిది. అతడు బీజ ప్రాప్తి చేసేవాడు. ఆమె క్షేత్రం. అతనికి ఫలం కావాలి. అతడు యజమాని; ఆమె అతని బానిస. ఈమాటలు వింటానికి ఎబ్బెట్టుగా ఉంటాయి. 'ఇది నిజమా' అని విస్తుపోతారు చాలామంది స్త్రీలు. ఇవి దరహం మీద చెప్పేమాటలు అందరికి వర్తించక పోవచ్చును. కాని సమాజం మొత్తాన్ని దర్శిస్తే ఇవి నిజాలని తేలుతుంది. ఇక నిజంగా జరిగిన కథ. భార్య ఒక పట్టణంలో ఉద్యోగం చేస్తున్నది. ఆమె జీతం భర్త జీతంకన్నా పెద్దది. అతడు ఆమెను ఉద్యోగం రాజీనామా చేసి తను ఉద్యోగం చేసే ఊరికి వచ్చి కేవలం గృహిణిగా కాపురం చేయమన్నాడు. ఆమె రానన్నది. కాపురానికి పొమ్మనమని (**RESTITUTION of Conjugal Rights**) ఉత్తరువులిమ్మని కోర్టువారిని అర్థించాడు. హైకోర్టు అతనికి అనుకూలంగా తీర్పునిచ్చింది. మరొక హైకోర్టు ఇలాంటి పరిస్థితులలోనే భర్తకు వ్యతిరేకంగా తీర్పు ఇచ్చింది. కుటుంబ శ్రేయస్సు దృష్ట్యా ఆమె ఉద్యోగం చేయటం అవసరమైతే ఆమె రాజీనామా ఇచ్చి అతని ఇంటిలో అతనితో పాటు శాశ్వతంగా అవిచ్ఛిన్నంగా కాపురం చేయనవసరం లేదని సుప్రీంకోర్టు మరో కేసులో తీర్పు ఇచ్చింది. న్యాయస్థానాల తీర్పులు ఎలా ఉంటున్నాయో తెలియ జెప్పేందుకు వీటిని ఉటంకించటం జరిగింది. దాంపత్య జీవితంలో భర్తదే పైచేయి అనేది నిర్వివాదాంశం. భార్యలపై అత్యాచారాలు విరివిగా హిందువులలో సాగడం హిందూ సమాజపు సంస్కృతికి చిహ్నం. హిందూ భార్య వ్యక్తిత్వంలేని ఆటబొమ్మగా మనుగడ సాగించడం శోచనీయం. 'లా' ప్రకారం ఆమె ఆస్తిపై ఆమెకే హక్కు. కాని ఆ హక్కును ఆమె అనుభవించడం లేదు; అనుభవించనీయరు భర్త, అతని తరపువారు. ఆమె అస్వతంత్రంగా వుంటుంది.

ఇస్లాం:—

మత గ్రంథమైన ఖుర్‌ఆన్‌లో స్త్రీతో గౌరవప్రదంగా సంసారం చెయ్యమని పురుషునికి మహమ్మదు ప్రవక్త చెప్పాడు. ఆమెను కరుణతో చూడకపోతే దాంపత్య జీవితంలో సుఖ ప్రాప్తి ఉండదని మహమ్మదుకు తెలుసు. ఎవడైనా పురుషుడు తన భార్యకు దూరంగా ఉంటానని ప్రమాణం చేసినా అతడు నాలుగు మాసాలలోగా దాంపత్య జీవితం మరల ప్రారంభించవచ్చని చెప్పాడు మహమ్మదు. (సురా ఆల్ బఖర 2: 224, 225). లైంగిక జీవితానికి ప్రాముఖ్యతను ఇచ్చాడు. 'జీ' (గారు) అని భార్యను గౌరవంగా పిలుస్తారు ముసల్మానులు. ఉన్నంతలో ఆమెకు అన్న పానాదులకు లోపం లేకుండా చూస్తారు. కాకపోతే ఆమె సంచార స్వాతంత్ర్యంపై ఆంక్షలు పెడతారు. అతడు ఏక కాలంలో నలుగురు స్త్రీలను భార్యలుగా చేసుకుని కులక వచ్చును. కాని ఆమెకు ఒకడే భర్త. అంటే అందరూ నలుగురు భార్యలను వివాహమాడుతున్నారని కాదు. ఆ హక్కు పురుషునికి ఉన్నది. ఎప్పుడు సవతి ఇంట్లోకి వస్తుందో అని భార్య వణికిపోతుంది. దాంపత్య జీవితంలో భార్య బాధ్యతలు, విధులు ఇలా ఉన్నాయి. "వివాహం అయినప్పటినుండి భార్య భర్తయెడ విశ్వాసంతో ప్రవర్తించవలయును. ఆమె ఆరోగ్యానికి, సభ్యతకు భంగం లేకుండా ఆమె సహేతుక మైన సమయాల్లో, ప్రదేశాలలో భర్తకు తన లైంగిక సాంగత్యాన్ని అందించవలెను. విడాకులు ఇవ్వబడిన తరువాత లేక భర్త మరణానంతరం ఆమె 'ఇద్దతు' గడువును పాటించవలెను. భర్తయొక్క సహేతుకమయిన ఆజ్ఞలను పాటించవలెను. సహేతుక మయిన కారణం ఉంటే తప్ప భర్త ఎచ్చట కాపురం ఉంటే అచ్చట కాపురముండ వలెను. లేక భర్త వెన్వెంట పోవలెను. భార్యయొక్క సంచార స్వాతంత్ర్యాన్ని, భర్త సహేతుకమైన అదుపులో ఉంచవచ్చును." ముస్లిం భార్యకు హక్కులు లేకపోలేదు. ఆమె తనకు నిర్ణయింపబడిన మహరును చెల్లించమని భర్తను కోరవచ్చును. తన పోషణ బాధ్యతను స్వీకరించమని భర్తను కోరవచ్చును. తనకూ తన భర్తకూ అలా యిదాగా ఒక గది వాడుకకు కావలెనని ఆమె కోరుకోవచ్చును. ప్రతి శుక్రవారం తన తల్లిదండ్రులను చూడవచ్చును, లేక వారు వచ్చి ఆమెను చూచి పోవచ్చును. దగ్గర బంధువులు సంవత్సరానికి ఒకసారి వచ్చి ఆమెను చూడవచ్చు లేక ఆమె వెళ్ళి రావచ్చు. పూర్వపు భర్త వల్ల కలిగిన సంతానం సహేతుకమయిన వ్యవధిలో వస్తూ, పోతూ ఉండవచ్చు. తన సవతులతో సమానంగా అన్ని విషయాలలో ఆమె తన భర్త సాంగత్యాన్ని, భర్త ఆదరాన్ని పొందడానికి అర్హురాలు. పెండ్లినాడు ఆమె మరికొన్ని షరతులను పెండ్లి ఒప్పందంలో చేర్పించుకోవచ్చును. ఇది పరస్పర సమ్మతిమీద జరిగే పని. భర్త గౌరవప్రదమయిన జీవితాన్ని గడపాలనీ, మతం మారరాదనీ,

ఆమె మైనారిటీ దశలో భర్త ఆమె పుట్టింటిలో కాపురముండాలని, తప్పు లేకుండా ఆమెను భర్త కొట్టరాదనీ, తగాదావస్తే ఆమె విడాకులివ్వగల అధికారం తనకుండాలని ఇలాంటివి ఆ షరతులు.

మహరును వదలుకోమని అత్తలు ఆడబిడ్డలు క్రొత్త కోడలుపై ఒత్తిడిచేస్తారు. పాపం! ఆమె చేయగలిగింది ఏమీలేదు. ఆమె మహర్‌ను వదులుకున్నట్లు దస్కతు పెట్టుంది. ఆ కాస్త రక్షణ ఆమెకు పోతుంది. మహర్ వెంటనే చెల్లించాల్సి వస్తుందని భయపడాల్సిన భర్తకు ఆ కాస్త బెదురు పోతుంది. ఆమె రెక్కలు లేని పక్షిలా జీవిస్తుంది. గట్టిగా మాట్లాడితే ఏకపక్షంగా అతడు ఆమెకే తలాక్ ఇస్తాడేమో. తన హక్కుల ప్రసక్తి తెస్తే సవతిని తెస్తాడేమో! ముస్లిం మహిళ ఇలా భీతహరిణీక్షణం అయి మనుగడ సాగిస్తున్న విషయం మనకు తెలియనిది కాదు.

## క్రైస్తవం:-

దాంపత్య జీవితంలో భర్త భార్యను కరుణతో చూస్తాడు. దయతో సంచరిస్తాడు. కాని మౌలికంగా తన పెత్తనాన్ని వదులుకోడు పురుషుడు. కేథలిక్కుల దృష్టిలో పెళ్ళి పిల్లలను కనడానికి, మానవ జీవితాన్ని పవిత్రం చేసుకోవడానికి మాత్రమే ఉద్దేశింప బడింది. తరువాత సంస్కారవాదులు వివాహంలో స్నేహసంబంధానికి విలువ ఇచ్చారు. బ్రహ్మచర్యాల కన్నా గృహస్తాశ్రమం గొప్పదని ప్రకటించారు. సమాజ ప్రయోజనాలకోసం వ్యక్తిగత వాంఛలను వదులుకోమని ప్రచారంచేశారు ప్యూరిటనులు. వివాహ సంబంధాన్ని త్రెంచటానికి వీలు లేదని ఒకనాడు భావించారు. తరువాత ప్రేమకు, ఆనందానికి ప్రాముఖ్యత వచ్చింది. మనసులు కలియనిచోట విడాకులు తీసుకోమన్నది ప్రొటేస్టెంటుశాఖ. విడాకులు పొందడానికి క్రైస్తవ స్త్రీకి అవకాశాలు ఇంచుమించుగా లేనట్లే. కనుక ఆమె కేవలం భర్తమంచితనం మీద ఆధారపడి బ్రతకవలసిందే. భర్త దుర్మార్గుడయితే ఆమె జీవితం విషదభరితంగా వుంటుంది

## పార్శీలు:

వీరి కుటుంబ జీవితంలో పెద్దగా వడిదుడుకులు ఉన్నట్లు దాఖలాలు కనిపించటం లేదు.

## 5. వైధవ్యం

**హైందవం:-** ఒకనాడు హిందూ సమాజంలో విధవలను భర్తల చితులపై సజీవదహనం చేసేవారు. దానికి 'సతీసహగమనమని' పెద్ద పేరు పెట్టారు. రాజారామమోహన్‌రాయ్ ప్రోద్బలంతో బ్రిటిష ప్రభుత్వం 1829 సతీసహగమన నిషేధశాసనాన్ని చేసి

ఆ దురాచారాన్ని మాన్పించింది. 1856లో విధవావివాహ శాసనంద్వారా ఆమె పునర్వివాహానికి అవకాశం కల్పించింది. విధవలు నికృష్ట జీవితాన్ని గడిపేవారు. ముండన శిరస్సులై జీవించారు. అర్ధాకలితో కృశించారు. పుట్టింట లేక అత్తింట దాసీలుగా మనుగడ సాగించారు. విధవా వివాహానికి అవకాశం ఇస్తూ శాసనం ఉన్నా వితంతువులను పెండ్లాడటానికి చాలామంది ఈ నాటికీ ముందుకురారు. కందుకూరి వీరేశలింగంగారితో మొదలయిన వితంతు వివాహ సంస్కరణ సుమారు వంద సంవత్సరాల క్రింద ప్రారంభమయినా పరిపూర్ణత పొందలేదు. వితంతువులను పెండ్లాడటానికి భార్యలను పోగొట్టుకున్నవారు సైతం ఇచ్ఛగించటం లేదు. ఇది హిందూ సంస్కృతీ వారసత్వ ఫలితం.

## ఇస్లాం :

భర్త చనిపోయిన తరువాత 'ఇద్దతు' గడువుదాకా ఆగి ముస్లింస్త్రీ పునర్వివాహానికి సిద్ధంకావచ్చును. ఆమెను వివాహమాడటానికి సంకోచంలేదు. ముస్లిం సమాజంలో 'వైధవ్యం' అనే గర్హ్యణీయ దశ ముస్లిం స్త్రీకి లేదు. ఆమెను కురూపిని చేయరు. ఆమె మామూలు మగనాలివలె జీవితం సాగించవచ్చును. అలంకార రహితంగా, జీవచ్ఛవం వలె ఆమె జీవించనవసరం లేదు. ఈ విషయంలో ముసల్మానుల మతం హైందవం కన్న గొప్పది.

## క్రైస్తవం :

"భర్తగలస్త్రీ ఆతడు బ్రతికియున్నంతవరకే ధర్మశాస్త్రం వలన అతనికి బద్ధురాలుగాని, భర్త చనిపోయినయెడల భర్త విషయమైన ధర్మశాస్త్రంనుండీ ఆమెవిడుదల పొందును. కాబట్టి భర్త బ్రతికియుండగా వేరొక పురుషుడు చేరినయెడల వ్యభిచారిణి యనబడునుగాని, భర్త చనిపోయినయెడల ఆమె ధర్మశాస్త్రంనుండి విడుదల పొందెను గనుక వేరొక పురుషుని వివాహం చేసుకొనినను వ్యభిచారిణి కాకపోవును." (రోమా 7:1-4) ఈ సందర్భంగా వితంతు వివాహానికి సమ్మతించిన క్రైస్తవం హిందూమతంకన్న మెరుగు.

## పార్సీ సమాజం :

భర్త చనిపోయిన స్త్రీ పునర్వివాహం చేసుకోవచ్చును. భర్త జీవించిఉండగా భార్య, భార్య బ్రతికిఉన్నప్పుడు భర్త వివాహం రద్దని ప్రకటించినప్పుడు లేక విడాకులు పొందినప్పుడు తప్ప ఇతరత్రా పునర్వివాహం చేసుకోరాదని సెక్షను 4 (1936 యాక్టు) చెప్తున్నది. అంటే వితంతు వివాహం చట్ట సమ్మతమన్నమాట.

# 6. విడాకులు

సమాజంలో స్త్రీ స్వేచ్ఛకు నిదర్శనం ఆమె వ్యక్తిత్వ వికాసస్థాయి. అలాగే కుటుంబంలో స్త్రీవ్యక్తిత్వ వికాసానికి లక్షణం ఏమంటే అవసరమైనపుడు ఆమె విడాకులను పొంద గలగడమే. ఇలా అన్నంతమాత్రాన అందరు స్త్రీలను విడాకులు పొందమని సలహా ఇవ్వటం కాదు. దుర్భర జీవితం నుండి బయట పడటానికి అవకాశం ఉండాలంటున్నాం. అంతవరకే. దానిని సహృదయంతో అర్థంచేసుకోవాలి.

## హైందవం.

హిందూ వివాహశాసనం 1955లో వచ్చింది. 1960, 1964, 1976, 1978 సంవత్సరాలలో మార్పుచెందింది. సవరణలకు లోనయింది. చాలవరకు మెరుగయ్యింది. ఇంకా ఒకటి రెండు లోపాలు లేకపోలేదు.

### (A) రద్దు: విడాకులు.

ఈదిగువ పరిస్థితుల్లో పెండ్లి రద్దు అయినట్లుగా ఎంచుకోవలెనని పిటీషను పెట్టవచ్చును (సెక్షను 12)

(i) రెస్పాండెంటు నపుంసకత్వం వల్ల దాంపత్యజీవితం ప్రారంభం కానపుడు:

(ii) (a) పెండ్లినాటికి చిత్తచాంచల్యం కలిగి ఉండుట,

(b) పెండ్లికి సమ్మతి ఇవ్వకలిగి ఉన్నా. మానసిక రుగ్మత యొక్కతీవ్రత వలన, వ్యాప్తివలన వివాహమాడటానికి అనర్హుడు మరియు సంతానం పొందటానికి అనర్హుడు అయినప్పుడు;

(c) ఉన్మాదము, మూర్ఛ రోగములకు తరుచుగా లోనవుతున్నపుడు,

(iii) పెండ్లికి పిటిషనరు యొక్కసమ్మతిని మోసవిధంగా కాని, బలవంతంగా గాని పొందినప్పుడు. (మోసం,బలవంతం ఆగిపోయిన తరువాత, సంవత్సరంలోగా పిటీషను పెట్టాలి లేక తరువాత బుద్ధిపూర్వకంగా కాపురం చేసేలోగా)

(iv) పెండ్లినాటికి రెస్పాండెంటు పిటీషనరు ద్వారాగాక ఇతరుల వల్ల గర్భం ధరించినపుడు. (పెండ్లినాటికి పిటీషనరుకు ఈ విషయం తెలియదని) శాసనానికి పూర్వం వివాహంజరిగి ఉంటే శాసనం వచ్చిన తరువాత సం॥లోగా లేక వివాహం శాసనం తర్వాత (తే18/3/55) అయితె పెండ్లి అయిన ఒకసం॥ లోగా పిటీషను దాఖలు అయిందని, పిటీషనరు సమ్మతితో లైంగిక సంపర్కం జరగలేదని, కోర్టువారు తృప్తిపడినప్పుడే

ఈ కారణం అమలులోకివస్తుంది, భార్యా భర్తలిరువురిలో ఎవరైనా రెండవవారి నడతకు సంబంధించి ఈ దిగువ కారణాలలో దేనినైనా పేర్కొని పిటీషనుద్వారా వివాహపు రద్దును కోరవచ్చును :-

(i) తన భర్త లేక తన భార్య కాకుండా మరి ఒక వ్యక్తితో బుద్ధిపూర్వకంగా లైంగిక సంపర్కం నెరపుట;

(ii) హింసించుట;

(iii) పిటీషను పెట్టేనాటికి మున్ముందుగా రెండు సంవత్సరాలు పిటీషనురును వదలి పెట్టుట, (అంటే సహేతుకమయిన కారణం లేకుండాను, పిటీషనరు అభీష్టానికి వ్యతిరేకంగాను జరిగితే)

(iv) ఇతర మతంను స్వీకరించి హిందువుగా చలామణి కాకపోవుట,

(v) రెస్పాండెంటు యొక్క మనశ్చాంచల్యం. మానసిక రుగ్మతల తీవ్రత వ్యాప్తి మరీ ఎక్కువై రెస్పాండెంటుతో పిటీషనరు కాపురంచేయకుండుట సహేతుకం అయినప్పుడు;
**సూచన;**– మానసికవ్యాధి. మనస్సు వికసించక పోవటం లేక మానసిక వికాసం ఆగి పోవటం, మానసిక చర్యలలో క్రమం లోపించటం, లేక విచ్ఛిన్నవ్యక్తిత్వం (SCHZOPHRENIA) లాంటి ఏమానసిక బలహీనత అయినా మానసిక రుగ్మత క్రిందికి వస్తుంది.

మానసిక చర్యలలో క్రమంలోపించటం :- అవిచ్ఛిన్నమైన మానసిక అశక్తతవల్ల ఉత్పన్నమయి దాడిచేసేతీవ్రమనస్తత్వమూ, తదనుగుణమైన నడత, బాధ్యతా రాహిత్య ప్రవర్తన.

(VI) వైద్యానికి లొంగని తీవ్రమయిన కుష్ఠువ్యాధితో రెస్పాండెటు బాధపడుట;

(VII) ఇతరులకు సంక్రమించే సుఖ వ్యాధులను కలిగియుండుట;

(VIII) ఏదో మతంలోనో, గోసాయిలలోనో లేక మతసంఘంలోనో చేరి ప్రపంచం నుండి సన్యాసం పుచ్చుకొనుట;

(IX)వరుసగా ఏడు సంవత్సరాలు ఎక్కడ ఉన్నదీ తెలియక పోవటం;

(X)కోర్టుద్వారా ఇరువురు విడిగాఉండటానికి ఉత్తరువులు పొందిన తర్వాత సంవత్సర కాలాన్ని మించి ఇరువురు కలసి కాపురం చేయనప్పుడు;

(XI) కాపురానికి పొమ్మనమనే ఉత్తరువును కోర్టుద్వారా పొందిన రెస్పాండెంటు ఒక సంవత్సరం పైగా కోర్టు ఉత్తరువును అమలు పరచనప్పుడు; (వదిలి పెట్టుటలో బుది

పూర్వకంగా పిటీషనరును నిరాదరణ చేయడం కూడా వస్తుంది.

భార్యమాత్రమే విడాకులు కోరతగిన సన్నివేశాలు :

(i) భర్త ఈ శాసనం రాకపూర్వం మరియొక స్త్రీని వివాహమాడితే లేక అలా వివాహ మాడినస్త్రీ పిటీషనరు పెండ్లినాటికి బ్రతికి ఉన్నట్లయితే (పిటీషనరు వివాహం శాసనానికి పూర్వం జరిగితేనే ఇది వర్తిస్తుంది),
షరా:- పిటీషను పెట్టేనాటికి ఆ రెండవ భార్య జీవించి ఉండాలి.

(ii) పిటీషనరుతో రెస్పాండెంటు వివాహ మయిన దరిమిలా భర్త మానభంగమూ, పురుషసంపర్కమూ లేక పశు సంపర్కమూ దోషములుగా కలిసి ప్రవర్తించినట్లయితే,

(iii) హిందూ దత్తత మరియు మనోవర్తిశాసనము(1956) క్రిందగాని లేక క్రిమినలు ప్రొసీజరు కోడ్ (1973) లేక క్రిమినల్ ప్రొసీజరుకోడ్ (1898) క్రింద పిటీషనరుకు మనోవర్తి ఇవ్వబడిన పక్షంలో ఆ ఉత్తరువు పుట్టిన సంవత్సరం లేక పై కాలంలో పిటీషనరు రెస్పాండెంట్లు కలసి కాపురం చేయకుండుట,

(iv) భార్యకు పదిహేను సంవత్సరాలు నిండకమును పే ఆమె వివాహం రెస్పాండెంటుతో జరిగినపుడు ఆమెకు 18సం॥ నిండేలోగా (ఆమెకు శోభనం జరిగినా జరుగక పోయినా) ఆమె ఈ వివాహాన్ని తిరస్కరించితే.

షరా:- పార్టీల వివాహం 1976 సవరణ చట్టానికి ముందు జరిగినా లేక తరువాత జరిగినా ఈ క్లాజు వర్తిస్తుంది. (సెక్షను 13)
ఈ దిగువ పరిస్థితులలో ఉభయుల సమ్మతిమీద విడాకులు పొందవచ్చును.

(i) పిటీషను పెట్టేనాటికి సంవత్సరం లేక సంవత్సరం పైగా పార్టీలు వేరిగా ఉన్నట్లయితే,

(ii) వారు ఇద్దరూ కలసి జీవించలేక పోయినట్లయితే

(iii) వివాహం రద్దు చేయించుకోవడానికి ఇద్దరూ పరస్పరం అంగీకరించుట.

ఈ శాసనం ఇంత వెసులు బాటుగా ఉన్నా వివాహ రథం కుంటుపడిందని కోర్టువారు అభిప్రాయ పడితే విడాకులిచ్చే సౌకర్యం దీనిలో లేదు.

## ఇస్లాం:

భార్య ఈ దిగువ పరిస్థితుల్లో ఏది సంభవించినా విడాకులు కోరవచ్చును:

(i) నాలుగు సంవత్సరాల కాలం భర్త జాడ తెలియక పోవటం;

(ii) రెండు సంవత్సరాల కాలం ఆమెను పోషించక పోవటం లేక పోషించే విష యంలో నిర్లక్ష్య వైఖరి ప్రదర్శించటం;

(iii) భార్యకు 15 సం॥ నిండేలోగా వివాహమయితే ఆమెకు 18 సం॥ నిండేలోగా- భార్యాభర్తలు లైంగిక సాహచర్యం నెరపనిచో—ఆమెవివాహాన్ని తృణీకరిస్తే;

(iv) భర్తకు ఏడు సంవత్సరాలు కాని అంతకు పైగా కాని శిక్ష పడినచో;

(v) మూడు సంవత్సరాల కాలము భర్తభార్యతో సంసారం చేయనిచో;

(vi) పెండ్లినాటికి నపుంసకుడై పిటీషను పెట్టేనాటికి నపుంసకుడుగా ఉంటే;

(vii) రెండు సంవత్సరాల కాలం పిచ్చివాడుగా ఉంటే లేక కుష్టు లేక సుఖవ్యాధి వల్ల బాధపడుతుంటే;

(viii) ఆమెను క్రూరంగా హింసిస్తుంటే;

(ix) ముస్లిం శాస్త్రి ప్రకారం వివాహపు రద్దుకు అవకాశం ఇచ్చే ఏ ఇతర కారణ) మైనా ఉంటే (భార్యపై భర్త వ్యభిచార ఆరోపణ చేసినపుడు, ఖులా, ముఖారత్, తలాఖ్-ఇ-తఫ్వీజ్‌ల ఒప్పందం ప్రకారం ఏర్పాటు ఉన్నపుడు)

భార్యను క్రూరంగా హింసించటం అంటే:—

(I) ఆమెను శారీరకంగా హింసించటం, శారీరక హింస లేక పోయినా భర్త తన దుర్మార్గపు నడత వల్ల ఆమె జీవితాన్ని దుఃఖ భూయిష్టం చేయటం;

(II) చెడ్డ పేరుగల స్త్రీలతో సహవాసం లేక అపకీర్తి పాలయ్యే జీవితం గడపటం;

(III) ఆమె ఆస్తిని విక్రయాదులు చేయటం లేక దానిపై ఆమెకున్న 'లా' ప్రకారపు హక్కులను ఆమెను అనుభవించ నీయక పోవటం;

(IV) ఆమెను అవినీతికర జీవితం గడపమని బలవంతం చేయటానికి ప్రయత్నించటం;

(V) ఆమె మతాన్ని ఆమె అనుసరించటానికి, ఆచరించటానికి ఆటంక పరచటం;

(VI) అతనికి ఒకరి కన్నా ఎక్కువ మంది భార్యలుంటే, ఖుర్‌ఆన్ ఆదేశాలకు భిన్నంగా, అందరిని సమదృష్టితో చూడ లేక పోవటం; [2వ సెక్షను 1939 సం॥ ఆక్టు] ఈశాసనం ముస్లిం స్త్రీల పరిస్థితిని మెరుగుపర్చింది. కాని పరస్పర సమ్మతిపై విడాకులు అనే అంశం ఇందులో లేదు. అలాగే వివాహ రథం కుంటుపడిందని కోర్టువారికి తోస్తే విడాకులివ్వాలని లేదు. ఆధునిక ప్రపం చంతో సరితూగటం లేదు. ఈ శాసనం.

## క్రైస్తవం:—

1869లో విడాకుల శాసనం పుట్టింది. ఈ శాసనం ప్రకారం ఇరు పార్టీలలో ఎవరో ఒకరు క్రైస్తవ మతానికి చెంది ఉండాలి. అలాకాక ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహం కానివారికి మాత్రమే చెల్లుతుంది అని వ్రాయాలి.

(2) ఇందులో స్త్రీ పురుష వివక్ష ఉంది. భార్య వ్యభిచరించినదనే కారణాన భర్త విడాకులు కోరవచ్చును. కాని భార్యకు ఇబ్బందులు అధికం. ఆమెకు విడాకులు కావాలంటే ఆమె రెండు కారణాలను సూచించి రుజువుచేయాలి.

(i) భర్త మతం మార్చుకొని మరొక స్త్రీని వివాహమాడుట;

(ii) వ్యభిచారమే కాక కూడని దగ్గరి బంధువులతో వ్యభిచారం;

(iii) భర్త కల స్త్రీని ద్వితీయ వివాహం + వ్యభిచారం;

(iv) మరియొక స్త్రీతో వివాహం + వ్యభిచారం

(v) మానభంగం, ఏకలింగ సంపర్కం లేక జంతువుతో సంపర్కము;

(vi) వ్యభిచారం + భార్యయెడల క్రూరత్వం;

(vii) వ్యభిచారం + సహేతుకమైన కారణం లేకుండా 2 సం॥లు కాని పైన కాని విడనాడుట;

## పార్శీల విషయం:—

విడాకుల శాసనం 1936లో పుట్టింది. భార్యా భర్తల మధ్య లైంగిక సంపర్కం సహజమైన కారణాలవల్ల అసాధ్యమయితే పెండ్లిని రద్దు అయినట్లుగా కోర్టు భావించాలి. అయితే పార్టీలలో ఎవరో ఒకరు పిటీషను పెట్టాలి. (సెక్షను 30)

ఏడు సంవత్సరముల నుండీ ప్రతివాది జాడ తెలియక పోవటం రుజువయితే వివాహం రద్దు చేస్తుంది కోర్టు. (సెక్షను 31)

ఈ క్రింది పరిస్థితుల్లో ఏది ఉన్నా విడాకులకోసం ఎవరైనా కోరవచ్చును:-

(i) పెండ్లి అయిన సంవత్సరం లోగా ప్రతివాది బుద్ధి పూర్వకంగా పునస్సంధానం చేసుకోక పోవటం.

(ii) పెండ్లినాడు చిత్త చాంచల్యానికి లోనయి దావా నాటికి కూడా ప్రతివాది అలాగే ఉండటం; (ఈ దావా 3సం॥లోగా దాఖలు కావాలి. పెండ్లి అపుడు వాదికి ఈ విషయం తెలిసి ఉండరాదు.)

(iii) వివాహం నాటికి ప్రతివాది మరెవరి వలననో గర్భం ధరించి ఉండటం; (i ఈ విషయం వాదికి పెండ్లినాటికి తెలియకుండుట + పెండ్లి అయిన 2సం॥లోగా దావా వేయాలి + ఈ విషయం తెలిసిన తరువాత వాది ప్రతివాదుల మధ్య లైంగిక సంపర్కం లేకుండుట ఉన్నపుడే ఈ కారణం ఉపకరిస్తుంది.)

(iv) వివాహమయిన దరిమిలా ప్రతివాది వ్యభిచారం, లేక మరియొక స్త్రీని వివాహ మాడటం లేక మానభంగం, అసహజమైన నేరం చేస్తే; (ఈ దావా విషయం తెలిసిన 2సం॥లోగా వేయాలి.)

(v) వాదికి తీవ్రమయిన ఘాత కలుగజేయడం లేక వాదికి సుఖ వ్యాధిని అంటించడం లేక ప్రతివాది పురుషుడయినచో భార్యను వ్యభిచారము చేయమని బలవంతం చేయడం; (దావా 2సం॥లోగా వేయాలి.)

(vi) ప్రతివాదికి 7 సం॥ కాని ఎక్కువగాని శిక్షపడి అనుభవిస్తుంటే (ప్రతివాది 1 సం॥ అనుభవించిన తరువాత దావా వేయాలి)

(vii) పార్టీలు విడిగా ఉండటానికి కోర్టు ఉత్తరువు చేసిన దరిమిలా 3సం॥లు కాని పైకాలం కాని వారు సంసార జీవితం ప్రారంభించక పోవడం;

(viii) కాపురానికి పొమ్మనమని కోర్టు ఉత్తరువు ఇచ్చి 1 సం॥ లేక పైకాలం అయినా కోర్టు ఉత్తరువులను ప్రతివాది పాటించక పోవటం;

(ix) ప్రతివాది వాదిని కనీసం 3సం॥ పోషించక వదలివేయటం;

(x) పార్సీ మతాన్ని వదలిపెట్టుట;

ఇందులో పరస్పర సమ్మతిపై కాని, కోర్టువారికియుక్తమని తోచినప్పుడు కాని విడాకులు ఇచ్చే ప్రసక్తి లేదు.

## విడాకులు పొందే తీరు

హైందవం :- సబ్ కోర్టులో పిటీషను ద్వారా పరిహారం పొందవచ్చును.

ఇస్లాం :- దావా వేయాలి. జాప్యం చాల జరుగుతుంది.

క్రైస్తవం :- (I) విడాకుల కోసం జిల్లా జడ్జి కోర్టులో దరఖాస్తు పెట్టుకోవాలి.
(II) జిల్లా కోర్టు ఉత్తరువును హైకోర్టు ధృవపరచాలి.

(III) హైకోర్టులో ఇద్దరు న్యాయమూర్తులు ధర్మాసనంలో కూర్చొని తీర్పు చెప్పాలి. (ముగ్గురు జడ్జీలున్న కోర్టులో ముగ్గురు జడ్జీలు) ధృవీకరించాలి. (సెక్షను17) ఇది ఆలస్యానికి కారణ భూతం అవుతుంది.

(IV) కాపురమునకు రమ్మనే ఉత్తరువును పొంది, ఆ ఉత్తరువును ఆమోదించి లోబడని వ్యక్తిపై ఆస్తిని జప్తుచేయుట ద్వారా అమలు జరుపుటకు హక్కున్నది. ఈబలవంతం ఆధునిక న్యాయ సూత్రాలకు వ్యతిరేకం.

(V) భార్యతో వ్యభిచరించిన వాని నుండి భర్త నష్ట పరిహారం పొందవచ్చు. భార్య దేహం భర్తది అనే ఆటవిక సూత్ర ఫలితమిది. ఇలా ఎన్నో ఇతర లోపాలు ఉన్నాయి ఈ శాసనంలో.

## పార్శీ సంఘం

పరిహారానికి దావా వెయ్యాలి. ఇది పూర్తిగా పరిష్కారం అవ్వాలంటే 16సం॥ పడుతుంది. ఈలోగా పార్టీలు ఇద్దరు ముదుసలులు అవుతారు.

# 7. పునర్వివాహం

భర్త చనిపోయినా లేక విడాకులు పొందిన భార్య తిరిగి వివాహం చేసుకో వచ్చును. ఈ పరిస్థితిని అన్ని మత ధర్మశాసనాలు ఆమోదిస్తున్నాయి ఇపుడు.

# 8. మనోవర్తి

హైందవం :- మనోవర్తి విషయం క్రమబద్ధంచేస్తూ 1956 లో శాసనం వచ్చింది.

స్త్రీకి మనోవర్తి రెండుసందర్భాలలో ఇవ్వడం సంభవిస్తుంది. ఒకటి భర్త విడ కులు ఇవ్వకుండా ఆమెను వదలివేస్తే, రెండవది ఆమె భర్తనుండి విడాకులు పొం నప్పుడు. ఈ రెంటిని మనం విడిగా పరిగణించడం మంచిది.

## [A] భర్తకు దూరంగా ఉండవలసిన భార్య

**హైందవం :-** హైందవ భార్యకు ఈ దిగువ పేర్కొన్న పరిస్థితులలో మనోవర్తి స్తుంది :-

(i) సహేతుకమైన కారణం లేకుండా, ఆమె సమ్మతి లేకుండా లేక ఆమె అ వ్యతిరేకంగా భర్త ఆమెను వదలివేసినా లేక బుద్ధిపూర్వకంగా ఆమెను నిరాదరణ.

(ii) తనభర్తతో కాపురంచేయటం ప్రమాదకరమని కాని లేక నష్టదాయకమని ఆ భావం కలిగేటట్లు ఆమె ఎడ క్రూరంగా ప్రవర్తిస్తే;

(iii) తీవ్రమయిన కుష్టువ్యాధితో అతడు బాధ పడుతుంటే;

(iv) అతనికి మరోభార్య జీవించి ఉంటే,

(v) ఆమె కాపురమున్న ఇంటిలోనే భర్త తన ఉంపుడు కత్తెను తెచ్చి పెట్టే లేక తన ఉంపుడుకత్తెతో మరోచోట అలవాటుగా కాపురం ఉంటుంటే,

(vI) అతడు మతాంతరీకరణకు లోనయి హిందువుగా ఉండకపోతే;

(vIII) ఆమె వేరుగా ఉండటానికి దోహదం చేసే మరే ఇతర కారణమైనా ఉంటే;

భార్య భర్తనుండి మనోవర్తి కోరవచ్చును. కాని ఆమె శీల రహితురాలయినా, వేరొక మతాన్ని స్వీకరించినా ఆమెకు ఆమె భర్త మనవర్తిని చెల్లించ నవసరం లేదు. (సెక్షను 18-హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం 1956)

సమాజంలో పార్టీల హోదా, అంతస్తును గమనించి, మనోవర్తి కోరే భార్య అవసరాలను గుర్తించి, ఆమె భర్త నుండి వేరుగా ఉంటుంటే అలా చేయటం సమర్థ నీయమా అనే అంశాన్ని పరిగణలోకి తీసుకొని, అమెకున్న ఆస్తిపై రాబడి ఆమె సంపాదన లెక్క కట్టుకుని పురుషుని వద్దనుండి భరణము రాబట్టుకోగలవారి సంఖ్యను సరిచూచుకొని ఆమెకు చెల్లించవలసిన మనోవర్తిని కోర్టు నిర్ణయిస్తుంది. (సెక్షను 23) కాల పరిస్థితులు మారితే కోర్టువారు తమ ఉత్తరువును మార్పుచేయగలరు. (సెక్షను 25) ఇదిగాక క్రిమినలు ప్రొసీజరు కోడ్ (1973) సెక్షను 125 క్రింద భార్య మనోవర్తి పొందవచ్చును: కాని ఆ మొత్తం-భర్తకు ఎంత ఆస్తి, సంపాదన ఉన్నా-నెలకు 500 రూపాయలకు మించదు.

## ఇస్లాం:

ముస్లిం భార్యకు మూడురకాలుగా మనోవర్తి వస్తుంది. (i) ఇస్లాం ధర్మశాస్త్ర ప్రకారం;

(ii) స్త్రీలు కాని వారి సంరక్షకులు కాని వివాహ కాలమందు వారిభర్తలతో చేసుకున్న ఒడంబడిక ప్రకారం;

(iii) క్రిమినల్ కోర్టులో ఆమెమనోవర్తిని పొందవచ్చు. భార్యవ్యక్తురాలై దాంపత్య జీవితానికి అర్హురాలు కాగల వయస్సును చేరుకుంటే, సహేతుకమైన కారణాలకు తప్ప ఆమెభర్త లైంగిక సంపర్కానికి అందుబాటులో ఉంటే, సహేతుకమైన కారణాలు ఉంటేతప్ప ఆమె భర్తతో కాపురం చేస్తూంటే ఆమెకు వేరే ఆస్తులు ఉన్నా ఆమెను భర్త మతవిధిగా పోషించాలి. కాకపోతే సర్వసామాన్యంగా వేరుగా ఉంటే చెల్లించ వల సిన మనవర్తిని గురించి ముందుగా ఏర్పాటు చేసుకోవటం జరగదు. అంత ముందుచూపు ఆమెకు ఉండదు. ఇకపోతే క్రిమినలు ప్రొసీజరుకోడ్ క్రింద ఉన్న హక్కును అన్ని మతాలవారు వాడుకోగలరు. ముస్లిం స్త్రీలకూ ఆ హక్కు ఉన్నది. కాని క్రిమినల్

కోర్టులో వ్యాజ్యం జరుగుతుండగా భర్త ఆమెకు 'తలాక్' ద్వారా విడాకులిస్తే ఆమె హోదా మారుతుంది. ఆమె విడాకులివ్వబడిన స్త్రీ అవుతుంది. అపుడే వేరే సూత్రం వర్తిస్తుంది.

**క్రైస్తవులు:-** ఆమె వేరుగా ఉండటానికి

కోర్టు ఉత్తరువులను కోరితే అపుడు కోర్టువారు ఆమెకు తగిన మనవర్తిని చెల్లించమని భర్తకు ఆదేశం ఇవ్వవచ్చును. (సెక్షన్‌లు 37, 38-విడాకులచట్టం 1869)దానిని నెలకు ఇంత అని లేక వారానికి ఇంత అని నిర్ధారణ చేయవచ్చును.

## పార్శీలు:

భార్యను భర్త సహేతుకమయిన కారణాలు లేకుండా వదిలేస్తే ఆమె భర్తను ఆమెను కాపురానికి తీసుకొని వెళ్ళమని కోర్టువారు ఉత్తరువులు ఇవ్వవచ్చు. ఆసందర్భంగా ఆమెకు మనవర్తి చెల్లించమని నెలకు ఇంత అని, లేక సంవత్సరానికి ఇంత అని-కోర్టువారు ఉత్తరువు ఇవ్వవచ్చు. (సెక్షను 40). వ్యాజ్యము నిల్వలో ఉన్నపుడు కూడా కోర్టువారు మనవర్తి ఇప్పించగలరు. (సెక్షను 39). అతని ఆస్తిని, సంపాదనను, ఆమె ఆస్తిని సంపాదనను, ఆమె నడతను లెక్కలోకి తీసుకొని ఎంత మొత్తము చెల్లించాలో కోర్టు నిర్ణయిస్తుంది.

# B. విడాకులివ్వబడిన స్త్రీగా

**హైందవం :-** హైందవ వివాహ శాసనం 1955 జరిగే వ్యాజ్య గ్రంథం మధ్యలో భార్యకు కోర్టు వారు మనవర్తి ఇప్పించగలరు. (సెక్షను 24) ఈసెక్షను విడాకులు కోరే వారికి కూడా వర్తిస్తుంది. ఉత్తరువులు జారీ చేసేటప్పుడు కోర్టు వారు శాశ్వత ప్రాతిపదిక మీద విడాకులివ్వబడిన స్త్రీకి మనవర్తి ఇప్పించవచ్చును. ఆమె ఆస్తిని, సంపాదనను లెక్కలోకి తీసుకొని పార్టీల నడతను గమనంలో ఉంచుకొని నెలకు గాని మరో కాల వ్యవధికి గాని చెల్లించ వలసిన మనవర్తిని కోర్టువారు నిర్ణయించ వచ్చును. (సెక్షను 25)

## ఇస్లాం

ముస్లింలా ప్రకారం విడాకులు ఇవ్వబడిన స్త్రీకి ఇద్దతు కాలం వరకే మనవర్తిని చెల్లిస్తాడు మాజీ భర్త. ఇద్దతు గడువు పరిస్థితులను బట్టి మారుతూ ఉంటుంది. 'ఇద్దతు' అంటే నిరీక్షణ వ్యవధియని అర్థం. విడాకులివ్వబడిన స్త్రీ గర్భవతి యైతే ఆమె సంతానానికి తండ్రిని నిర్దేశించే నిమిత్తం ఈ గడువు నిర్ణయింపబడింది. ముట్లుడిగిన స్త్రీకి ఇద్దతు చాంద్రమానం ప్రకారం మూడు నెలలు. గర్భిణీస్త్రీగా ఉంటే ప్రసవమయ్యే వరకు, గర్భ విచ్ఛిత్తి అయ్యే వరకు 'ఇద్దతు' నడుస్తుంది. రుతువులున్న స్త్రీ అయితే ఇద్దతు గడువు మూడు రుతువులు (తుహుర్‌లు). విడాకులివ్వబడిన సందర్భంలో

ఇంత మనోవర్తి ఇవ్వాలని ముస్లిం మహిళలు ముందు జాగ్రత్తతో ఏర్పాటును చేసుకోవటం భారతదేశంలో జరగటంలేదు. అందువల్ల వారు నష్టపోతున్నారు.

ఇక 1986 ముస్లిం స్త్రీల రక్షణ చట్టం సంగతి. ఇది వారిని భక్షించే చట్టం, విడాకులివ్వబడిన స్త్రీకి క్రిమినలు ప్రొసీజరు కోర్టు ఇచ్చే రక్షణను తొలగించింది 1986 చట్టము. 'షాబానో' కేసులో మాజీ భార్యకు క్రిమినల్ ప్రొసీజరు కోడ్ సెక్షను 125 క్రింద సుప్రీం కోర్టు మనోవర్తిని ఇచ్చింది. 'మహర్' అనేది విడాకులకు పరిహారంగా ఇచ్చేది కాదని, వివాహకాల మందు స్త్రీని గౌరవించి ఇవ్వనిర్ణయించుకున్నదని కాగా వివాహానికి ప్రతిఫలంగా ఇచ్చేదని కోర్టు తీర్పు చెప్పింది· విడాకులివ్వబడిన స్త్రీని నిరాశ్రయురాలుగా వదలివేయటం ఇస్లాం ధర్మం కాదని చెప్పింది. ఆమెకు చెల్లించాల్సిన మహరు, ఇద్దతు గడువు వరకు మనోవర్తి భర్త చెల్లించినంత మాత్రాన భర్త బాధ్యత ఆమె ఎడతీరి పోదని కోర్టు ప్రకటించింది. దీంతో సనాతన ముస్లింలు' ఆందోళన లేవతీశారు. 'మామతం విశిష్టం,, మాశాసనాలు ప్రత్యేకం., అందరికీ వర్తించే శాసనాలు మాకు వర్తించరాదని సభలూ సమావేశాలు, ఊరేగింపులు జరిపి కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చారు. దాంతో ప్రభుత్వం భయపడింది. భార్యాభర్తలు పరస్పరం అంగీకరిస్తే తప్ప క్రిమినల్ కోర్టులో విడాకులివ్వబడిన స్త్రీ, లేక విడాకులు పొందిన స్త్రీ మనోవర్తి కోరరాదని ఆశాసనం యొక్క ముఖ్యభావం: ఆమె సంతానం, వారు కాకపోతే ఆమె తల్లి దండ్రులూ, వాహా కాకపోతే ఆమె ఆస్తి ఆమె తదనంతరం ఎవరికి పోతుందో ఆ బంధువులు ఆమెను పోషించాలి. వారెవరికి శక్తి లేకపోతే రాష్ట్ర వక్ఫ్ బోర్డు (ముసల్మాను ధర్మ సంస్థ) ఆ బాధ్యతను స్వీకరించాలి. అంటే ఏ భర్త అయితే ఆమె వయస్సును, అందాన్ని, సాంగత్యాన్ని చూరగొన్నాడో అతడుగాక అందరూ ఆ విడాకులు పొందిన స్త్రీని పోషించాలి ఆహా! ఇది ఏమి న్యాయమో!

(C) అవివాహిత కుమార్తె:

## హైందవం :

కుమార్తె అవివాహిత అయితే, తననుతాను పోషించుకోలేకపోతే ఆమెకు 18 సం నిండేవరకు—ఆమె తన క్రమసంతానమైనా లేక అక్రమ సంతానమైనా—ఆమెను తండ్రి విధిగా పోషించాలి.

## ఇస్లాం:

అవివాహిత కుమార్తెను తండ్రి, అతడు బీదవాడుఅయిన పక్షంలో తల్లి, అదీ గాకపోతే తండ్రి తండ్రి పోషించవలెను. క్రిమినల్ ప్రొసీజరు కోడుక్రింద ఆమె-క్రమసంతానమైనా లేక అక్రమసంతానమైనా మనోవర్తినితండ్రినుండి పొందఅర్హురాలు. ఆమెకు పోషణకు కావలసిన ఆదాయం లేనప్పుడే తండ్రిబాధ్యత ఉదయిస్తుంది.

## క్రైస్తవం :

తల్లిగాని, తండ్రిగాని కోర్టుద్వారా విడిపోయే పరిహారాన్నిగాని లేక విడాకులను గాని కోరినప్పుడు కోర్టువారు మైనరు సంతానం (కుమార్తెకు వర్తిస్తుంది) యొక్క స్వాధీనం, పోషణ, విద్య వీటి విషయమై ఏర్పాట్లుచేస్తూ తాత్కాలిక లేక శాశ్వత ఉత్తరువులను జారీచేయవచ్చును. (సెక్షనులు 41-44) ఇదిగాక అదనంగా క్రిమినల్ ప్రొసీజరు కోడు క్రింద పరిహారం పొందవచ్చును.

## పార్శీలు:

తల్లిదండ్రులు కోర్టుద్వారా విడిపోయే సందర్భంలో, విడాకులు పొందే సమయంలో 16 సంవత్సరముల లోపు వయస్సుగల కుమార్తె యొక్క పోషణ, చదువు వీటిని గురించి ఏర్పాట్లుచేస్తూ కోర్టువారు తాత్కాలిక లేక శాశ్వత ఉత్తరువులను జారీ చేయవచ్చును. (సెక్షనులు 49, 50 పార్శీవివాహ మరియు విడాకుల చట్టం 1936). ఇదిగాక అదనంగా క్రిమినల్ ప్రొసీజరుకోడు క్రింద పరిహారం పొందవచ్చును.

తల్లి

## హైందవం:

కుమారుడు లేక కుమార్తెపై ఆధారపడి జీవించే వారి జాబితాలో తల్లికూ ఉన్నది. (సెక్షను 21 హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం 1956). అ ఆమె చనిపోయినా వారి ఆస్తిని పొందిన వారు ఆమెను తమకు సంక్రమించిన ఆ యొక్క ఆదాయంలో నుండి పోషించాలి. (సెక్షను 22) తల్లి వృద్ధురాలై అ రాలయినపుడు మాత్రమే ఇది వర్తిస్తుంది. (సెక్షను20 హిందుదత్తత మరియు మన శాసనం 1956)

## ఇస్లాం:

కుమారుడు లేక కుమార్తె సంపన్నులయితే బీదవారైన తమ తల్లిదండ్ర పోషించాలి. తల్లిదండ్రులు కాస్తో కూస్తో సంపాదించుకోగలిగినా ఈ బాధ్యత : తల్లి బీదరాలై - ఆమెకు శరీర దార్ఢ్యత ఉన్నా - కుమారుడు ఆర్థికంగా తను పరిస్థితిలో ఉన్నా తల్లిని కుమారుడు పోషించాలి. ఏదోకొంత సంపాదిస్తున్న కుమారు బీదవాడైనా ఏమీ సంపాదించలేని తండ్రిని పోషించవలెను. తల్లిదండ్రుల విషయం చెప్పిన ఈ తేడా గమనార్హం.

**E వితంతు కుమార్తె, కోడలు:**

## హైందవం :

తన భర్త ఆస్తినుండి, తనకుమారుడు లేక కుమార్తె నుండి, వారు చనిపోతే వారి ఆస్తినుండి, లేక ఆమె భర్త తండ్రి, అతడు చనిపోతే అతని ఆస్తినుండి ఆమెకు పోషణ జరుగకపోతే వితంతు కుమార్తె ఆమె తండ్రిపై ఆధారపడే వ్యక్తిగా పరిగణింపబడును. సెక్షను [21 (vi)] తండ్రినుండి, అతడు చనిపోతేఅతని ఆస్తి (ESTATE) నుండి ఆమె పరిహారం పొందగలదు. (సెక్షను 22)

వితంతు కోడలు కొన్ని పరిస్థితుల్లో భర్త తండ్రినుండి పోషణను కోరవచ్చును. తన ఆస్తినుండి లేక తన ఆదాయం నుండి తనను పోషించుకోలేక పోవాలి. ఒకవేళ తనకు ఆస్తిలేకపోతే తన భర్త 'ఎస్టేట్' (చనిపోయేనాటికి అతనికి ఉన్న ఆస్తి)నుండి లేక తన తల్లిదండ్రులనుండి, లేక తన కుమారుడు లేకకుమార్తెనుండి లేక వారు చనిపోతే వారి 'ఎస్టేట్'నుండి ఆమెకు పరిహారం రాకపోతే ఆమె భర్త తండ్రిపై హక్కును సాధించుకొవచ్చు. మామచేతిలో పిత్రార్జితపు ఆస్తి ఉండి దానిలో ఆమె వాటా తీసుకొననప్పుడు, ఆ ఆస్తిలోనుండి అతనికి ఆమెను పోషించటానికి తగిన ఆదాయం రానప్పుడు మాత్రమే మామకు ఆ బాధ్యత ఉంటుంది. పైగా ఆమె పునర్వివాహం చేసుకోగానే ఆ బాధ్యత నశిస్తుంది. (సెక్షను 19 హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం 1956.)

## ఇస్లాం:

కుమార్తెను కోడలును ఏ పురుషుడు వివాహం చేసుకోరాదు. వారి ఆస్తినుండి అతనికి ఏ మేరకు వాటా వారు చనిపోయిన తదుపరి) వస్తుందో ఆ మేరకు అతనికి వారి పోషణ బాధ్యత ఉన్నది. అందుచేతనే విడాకులు పొందిన ముస్లిం స్త్రీ తన బంధుగుల నుండి మనవర్తిని పొందనగునని ముస్లిం స్త్రీల (విడాకుల సందర్భంగా) హక్కుల పరిరక్షణ శాసనం 1986లో ఏర్పాటు చేశారు.

# 9. దత్తత

## హైందవం:

పూర్వం దత్తత హిందువులలో మత స్వభావం కలిగియుండేది. వంశోద్ధారణ కొరకు కుమారుని దత్తుచేసుకునేవారు. వేశ్యలుమాత్రమే కుమార్తెనుదత్తుచేసుకునేవారు. 1956లో హిందూ దత్తత మరియు మనవర్తి శాసనం వచ్చింది. దాంతో మౌలికమ

యిన మార్పులు వచ్చాయి. దత్తుకు మతపరమైన భావనతీసివేసి దానిని లౌకికం చేశారు. కుమార్తెనుగాని కుమారుని గాని దత్తు చేసుకోవచ్చును. భార్య అనుమతి లేకుండా భర్త దత్తు చేసుకోవటానికి వీలు లేదు. అవివాహిత, వివాహం రద్దు అయినస్త్రీ, విధవరాలు, సన్యాసి అయిన వాని భార్య, మతాతంరుని భార్య, మతి స్తిమితం లేని వాని భార్య కుమారుని గాని కుమార్తెను గాని దత్తు చేసుకోవచ్చును. తల్లి అనుమతి లేకుండ ఏ తండ్రి తన సంతానాన్ని ఇతరులకు దత్తు ఇయ్యరాదు. తండ్రి మరణించి నపుడు, సన్యాసి యైన పుడు, మతాంతరుడయినపుడు లేక మతి స్తిమితం లేని వాడని కోర్టువారు నిర్ధారణ చేసి నపుడు తల్లి తన సంతానాన్ని దత్తు ఇవ్వవచ్చును. దత్తు ఇవ్వబడేం వ్యక్తి హిందువయి ఉండాలి, 15 సం॥వయస్సు పూర్తి కాని వాడుగా ఉండాలి. అవివాహితుడై ఉండాలి. ఆచారం భిన్నంగా ఉంటే ఈ నియమాలకు సడలింపు ఉంది. కుమారుడు, మనుమడు (కుమారుని ద్వారా), మునిమనుమడు (అలాంటి మనుమని ద్వారా) కలిగిన వారు దత్తు చేసుకోరాదు. కుమార్తెను దత్తు చేసుకోదలచిన వారికి హిందూకుమార్తె కాని, కుమారుని కుమార్తె గాని ఉండరాదు. పురుషుడు స్త్రీని దత్తు చేసుకోదలిస్తే దత్తురాలి వయస్సు కన్న దత్తు తండ్రి వయస్సు 21 సం॥ పైగా ఉండాలి. అలాగే స్త్రీ పురుషుని దత్తు చేసుకోదలిస్తే దత్తు తల్లి వయస్సు దత్తుని వయస్సు కన్న 21 సం॥ పైగా ఉండవలెను. వివాహిత స్త్రీ భర్త సమ్మతితో తనకు దత్తు చేసుకోవటానికి శాసనంలో వెసులుబాటు లేదు. వివాహితులలో దత్తు చేసుకునే అధికారం పురుషునిదే. అంటే వారిలో పురుషుని ఆధిక్యతను ఉంచినట్లే కన్పడుతుంది. దంపతులలో ఏ ఒకరైనా మరొకరి సమ్మతితో దత్తుచేసుకోవడానికి వీలు ఉండాలని స్త్రీల హోదా కమిటి 1974లో సూచించింది.

## ఇస్లాం:

అరేబియా దేశంలో మహమ్మదుకు పూర్వం దత్తు ఉండేది. మహమ్మదు జయిాద్‌ను దత్తు చేసుకున్నాడనే కథ ప్రచారంలో ఉంది. దత్తు కుమారుడు ఔరస పుత్రుడు (జఘనం నుండి పుట్టిన వాడు) కానేరడని మహమ్మదు చెప్పాడు. ఏదైనా తను పెంచిన జయిాదే భార్యను (విడాకుల తదుపరి) మహమ్మదు వివాహమాడాడు. అది గేబ్రియల్ అనుజ్ఞతోనే జరిగిందట. ఏదైనా ఆచారంగా ముస్లిం సమాజంలో దత్తు లేదు ఈనాడు. కాకపోతే పెంచుకుంటున్నారు. ప్రేమాభిమానాలతో ఆస్తులిస్తున్నారు. అంతే. హిందువులలో ఉన్నట్లు ముస్లింలలో దత్తత పద్ధతి లేదు.

1972లో దత్తత బిల్లు రాజ్యసభలో ప్రవేశపెట్టబడింది. దాంతో సనాతన చాంధస ముస్లింలు విజృంభించి వ్యతిరేకించారు. ముస్లిం బాలబాలికలను ఇతర మతాల వారు దత్తు తీసుకొని వారి వారి మతాల పద్ధతిలో పెంచుతారని, అది తమకు తీరని అపచారమని ప్రచారం చేశారు. బీదలుగా, అనాధలుగా ముస్లిం బాలబాలికలు ఆకలి బాధకు తాళజాలక చనిపోయినా పరవా లేదుకాని ఇతర మతాల వారు ఆ బాలబాలిక

లను పెంచుకోరాదు. అసలు అభ్యంతరం అది కాదు. అన్ని మతాల వారికి వర్తించే దత్తత బిల్లు ఆమోదింపబడితే మెల్ల మెల్లగా మతపరమైన మత ధర్మశాస్త్రాల ప్రాబల్యం నశిస్తుందని ముస్లింలకు విపరీతమైన భయం. ఈ సందర్భంగా ముస్లిం దేశాల తీరును పరిశీలించటం అవసరం. ట్యునీషియాలో దత్తు చెల్లుతుంది. అంటే ఆధునిక ప్రపంచంలో భాగస్వామ్యం పొందుతున్నదన్నమాట. మరి భారత ముస్లింల స్థితియో! ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నది. ఇది శోచనీయ పరిస్థితి.

**క్రైస్తవం మరియు పార్శీమతం: దత్తతలేదు**

పెంచుకొని సంరక్షకుల శాసనం క్రింద కోర్టుద్వారా ఉత్తరువులు తెచ్చుకోవాలి.

# 10. సంరక్షకత్వం

1875లో భారత మెజారిటీ శాసనం ఆమోదింపబడింది. దాని ప్రకారము మామూలుగా 18సం॥ నిండిన వ్యక్తికి మైనారిటీ వెళ్ళిందని అంటాము. కోర్టువారు సంరక్షకుని నియమిస్తే అతని మైనారిటీ 21సం॥లు నిండేవరకు ఉంటుంది. ఈ శాసనం దత్తత, వివాహము, విడాకులు అనే మూడు విషయాలలో వర్తించదు. సంరక్షకులు నాలుగు రకాల వారు:- (1) సహజ సంరక్షకులు (2) వీలునామా ద్వారా నియమింపబడినవారు. (3) కోర్టు ద్వారా ఏర్పాటు చేయబడిన వారు (4) ఇతరుల నియామకం లేకపోయినా పరిస్థితుల వల్ల అనుభవంలో సంరక్షకులు (**DEFACTO**). 1890లో సంరక్షకుల సంరక్షితుల శాసనం ఏర్పడింది. దీని ప్రకారం మైనర్లకు కొన్ని పరిస్థితుల్లో సంరక్షకులను నియమించటానికి వెసులుబాటు సృష్టించబడింది. అలాంటి అధికారం న్యాయస్థానానికి సంక్రమించింది. కాగా అవిభక్త హిందూ కుటుంబంలోని బాలునిని వ్యక్తిగా పరిగణించి సంరక్షకుని నియమించవచ్చును. అంటే వ్యక్తి వేరు అతని ఆస్తి వేరు అని లెక్క. ఆస్తికాక తతిమ్మా విషయాలన్నీ అతని వ్యక్తిగత విషయాల క్రింద పరిగణించాలి. అతని శారీరక, మానసిక ఆరోగ్యం, విద్య, వైద్యం మొదలగునవి వ్యక్తి సంబంధమైన సంరక్షకుని పరిధిలోనికి వస్తాయి.

తల్లి తండ్రి సహజ సంరక్షకులు. ప్రప్రథమంగా తండ్రి అలాంటి సంరక్షకుడు. తండ్రి జీవించి ఉండనిచో తల్లి సహజ సంరక్షకురాలు. వీరిరువురూ లేకపోతే న్యాయస్థానం ఒక మనిషిని సంరక్షకునిగా నియమిస్తుంది. అవిభక్త హిందూ కుటుంబంలోని అయుక్త వయస్కుడైన (మైనరు) పురుషునికి ఆస్తి సంబంధంగాకాక ఇతరత్రా తన వీలునామా ద్వారా తండ్రి సంరక్షకుని నియమించవచ్చును.

మైనరు బాలకు యుక్త వయస్కుడైన భర్త సంరక్షకుడు. అతడే ఆమెకు రెండు రకాల సంరక్షకుడు. కాగా దక్షిణాదిన ఆడపిల్ల ఈడేరు వరకు ఆమె తల్లి తండ్రుల ఇంట ఉండే ఆచారం ఉన్నది. అయినా 'లా' ప్రకారం భర్తయే సంరక్షకుడు.

అంటే ఆస్తికీ వ్యక్తికీ రెంటికీ అతడే సంరక్షకుడని భావం. మైనరు భార్యకు మైనరు భర్తయే సంరక్షకుడు. అంటే ఆస్తి సంబంధం కాక ఇతరత్రా అని అర్థం చెప్పుకోవాలి. తల్లి పునర్వివాహం చేసుకుంటే తన సంతానానికి సహజ సంరక్షకురాలిగా ఉండే హక్కును ఆమె కోల్పోతుంది. ఒక వ్యక్తి కులం పోగొట్టుకుంటే సంరక్షకత్వం అర్హత పోతుంది. కుల సంబంధమైన అనర్హతల శాసనం (1850) వల్ల ఈ ప్రమాదం తప్పిపోయింది.

తండ్రి మతం మార్చుకున్నా తన సంతానానికి సంరక్షకుడిగా ఉండే హక్కును కోల్పోడు. తల్లి విషయంలో అలా కాదు. ఆమె సంరక్షకురాలిగా ఉండే హక్కు కోల్పోతుంది. "తండ్రి మతాన్నే పిల్లలు అనుసరిస్తారని-భారతదేశంలో-అనుకోవాలి. అలాగే తండ్రియొక్క వ్యవహార సంబంధమైన హోదా కూడా పిల్లలకు సంక్రమిస్తుంది. "ఇది పిసివీ కౌన్సిలు తీర్పు.

భారతీయ 'కంట్రాక్టు' శాసనం ప్రకారం మైనర్లు చేసే ఒప్పందాలు చెల్లవు. కాగా వారి ముఖ్య అవసరాలను ఎవడైనా సమకూరిస్తే వాటి వెలను అతనికి అయుక్త వయస్కుల ఆస్తి నుండి చెల్లింపచేస్తుంది న్యాయస్థానం. సంరక్షకుడు సంరక్షితుని ఆస్తిని సక్రమంగా నిర్వహించి కాపాడాల్సిన బాధ్యత ఉంది. దుర్వినియోగం చేస్తే మైనరుకు కలిగే కష్ట నష్టములకు సంరక్షక హోదాలో ఉన్న వ్యక్తియే బాధ్యుడు. న్యాయస్థానం సంరక్షకుని నియమించేటప్పుడు కేవలం మైనరు శ్రేయస్సును మాత్రమే దృష్టిలో ఉంచుకుంటుంది. సహజ సంరక్షకుడు మైనరు వ్యక్తికీ, ఆస్తికీ రెంటికీ సంరక్షకునిగా వ్యవహరించవచ్చును. 1956 లో హిందూ మైనారిటీ మరియు సంరక్షకత్వ శాసనం అమలులోకి వచ్చింది.

**1956 శాసనం ప్రకారం:-** మైనరు బాలునికి, బాలికకు తండ్రి సహజ సంరక్షకుడు. మైనరు 5సం॥ నిండేవరకు సర్వ సామాన్యంగా తల్లివద్ద ఉండవచ్చును. అక్రమ సంతానం అయితే తల్లియే సహజ సంరక్షకురాలు. ఆమె లేకపోతే తండ్రి సహజ సంరక్షకుడు. వివాహిత అయిన మైనరు స్త్రీకి భర్తయే సంరక్షకుడు. అతడు లేకపోతే తల్లియే సంరక్షకురాలవుతుంది. సహజ సంరక్షకునికి బిడ్డమీద, బిడ్డ ఆస్తిమీద అదుపు ఉంటుంది. హిందూ తండ్రి తన వీలునామా ద్వారా మరియొకరిని తన బిడ్డకు సంరక్షకునిగా నియమించవచ్చును. ఆ వీలునామా లోని నియామకం అతడు భార్య కన్నా ముందు చనిపోతే వర్తించదు. భర్త సంరక్షకుడిగా ఉండడానికి వీలులేని పరిస్థితుల్లో సహజ సంరక్షకురాలయిన భార్య లేక వితంతువు తన వీలునామా ద్వారా మరియొక వ్యక్తినితన బిడ్డకు సంరక్షకునిగా నియమించవచ్చును. ఇదిగొప్పవిశేషమట! వీలునామా ద్వారా నియమితుడైన వ్యక్తి అవిభక్త హిందూ కుటుంబంలోని మైనరు ఆస్తివిషయమై నిర్వహణహక్కు ఏర్పడదు. తండ్రి, తల్లి వీలునామాద్వారా నియమింపబడే సంరక్ష

కుడు లేకపోతే కోర్టువారు సంరక్షకుని నియమిస్తారు. కోర్టువారు సంరక్షకుని నియమించడంలో మైనరు శ్రేయస్సునే అత్యధిక విషయంగా పరిగణించాలి. మైనరు అంటే 18 సం॥ వయస్సు పూర్తిచేయని వ్యక్తి అని శాసనం నిర్వచనం చేసింది. తల్లిని సంరక్షకురాలిగా ద్వితీయ స్థానం. 5 సం॥లోపు వయస్సు వున్న బిడ్డను సర్వసామాన్యంగా ఆమె తనవద్దఉంచుకోవచ్చును. మరి బిడ్డను సాకాలికదా! అందుకు మాత్రం తల్లి అవసరమవుతుంది. ఈ అంశాలు శాసనంలోని లోపాలని 'స్టేటస్'కమిటీ (1974) పేర్కొన్నది.

## ఇస్లాం:

పిల్లల సంరక్షకత్వం రెండు రకాలు. ఒకటి పిల్లల స్వాధీనానికి సంబంధించినది దీనిని 'హిజ్నత్' అంటారు. రెండవది పిల్లల ఆస్తులకు సంబంధించినది.

**పిల్లల పెంపకం విషయం [హిజ్నత్]**

(I) [i] బాలుడు 7 సం॥ వయస్సు నిండే వరకు, బాలిక వ్యక్తురాలు అయ్యే వరకు (వివాహిత అయినా కాకపోయినా) తల్లి, ఇతర బంధువుల ఆధీనంలో ఉండాలి. ఈదిగువ వరుస క్రమం ప్రకారం పోషణ బాధ్యతను స్వీకరించేవారు ఉంటారు. (i) తల్లి (ii) తల్లి తల్లి (iii) తండ్రి తల్లి (IV) సోదరి (V) సోదరి కుమార్తె (VI) పింతల్లులు, పెత్తల్లులు (VII) మేనత్తలు (VIII) తల్లిదండ్రుల మేనత్తలు.

వీరు లేక పోతే (i) తండ్రి (ii) తండ్రి తండ్రి (iii) సోదరుడు (IV) తండ్రి కుమారుడు (సవతి సోదరుడు) (V) సోదరుని కుమారుడు) (VI) సవతి సోదరుని కుమారుడు (VII) పెద తండ్రి, పినతండ్రి (VIII) తండ్రి సవతి సోదరుని కుమారుడు (IX) తండ్రి సోదరుని కుమారుడు తరువాత ఇతర బంధువులు, (2) బాలుడు 7సం॥ దాటిన వాడయినప్పుడు, బాలిక వ్యక్తురాలయిన తదుపరి అవివాహిత కుమార్తె పోషణ హక్కును తండ్రి పైన చెప్పిన తండ్రి తాలూకు బందువులు వినియోగిస్తారు.

(3) ఈడేరిన బాలిక వివాహిత అయితే భర్త మాత్రమే ఆమెకు సంరక్షకుడు.

(4) అక్రమ సంతానం విషయంలో 7సం॥ వరకు తల్లి, 7సం॥ దాటిన బాల బాలికలకు మైనరు కోరికను అనుసరించి తల్లి దండ్రులలో ఎవరో ఒకరు.

II పైన పేర్కొనిన సంరక్షకులు ఎవరూ లేకపోతే కోర్టుచేత నియమింపబడిన వారు ఆ పెంపకపు బాధ్యతను స్వీకరిస్తారు.

## షియా 'లా'

1 రెండేండ్లలోపు వయస్సు కల బాలుడు, 7సం॥ లోపు బాలిక తల్లి ఆధీనంలో ఉండాలి. ఆమె లేకపోతే తండ్రి అతడూ లేకపోతే తండ్రి తండ్రి.

2 రెండు సం॥ వయస్సు దాటిన బాలునికి, ఏడు సం॥ వయస్సు కల బాలికలకు పెంపకపు బాధ్యత హక్కు తండ్రిది. అతడు లేకపోతే తండ్రి తండ్రిది. తరువాత కోర్టువారు నియమించే సంరక్షకునిది.

పైన పేర్కొనబడిన స్త్రీలు కొన్ని సందర్భాలలో పిల్లలను తమ అధీనంలో ఉంచుకునే హక్కును కోల్పోతారు.

(I) తల్లి విడాకులు పొందిన తరువాత రెండో పెళ్ళి చేసుకుంటే, (అపుడు పిల్లలు తండ్రి అధీనంలోకి పోతారు).

(II) పిల్లకు దగ్గర బంధువు కానివానిని అంటే పిల్లను వివాహమాడరాని వర్గంలో లేనివానిని వివాహమాడితే,

(IV) పిల్లవాని తండ్రియొక్క నివాసగృహానికి దూరంగా తన భర్తతో కాపురముంటే,

(V) ఆమె అవినీతికర జీవితం సాగిస్తుంటే, అంటే వ్యభిచారిణి అయితే

(VI) ఆమె పిల్ల, పిల్లవాడిని గురించి తగు శ్రద్ధ, జాగ్రత్త తీసుకోకపోతే.

మైనరు బాలిక ఈడేరకపోయినా లేక దాంపత్య జీవితం సాగించటానికి అనువైన వయస్సు పొందక పోయినా భర్త సంరక్షకుడుగా ఉండటానికి అంటే ఆమెను అధీనంలో ఉంచుకోటానికి అనర్హుడు. అపుడు ఆమె తల్లి అధీనంలో ఉండాలి. అలాగే బాలికను ఆధీనంలో ఉంచుకోటానికి అర్హుడైన పురుషుడు ఆమెకు దగ్గర బంధువుకాక పోతే అంటే వివాహ నిషేధపు వర్గంలోని వాడు కాకపోతే అతడు ఆ హక్కును కోల్పోతాడు.

**పిల్లల ఆస్తి విషయమై సంరక్షక కర్తలు**

వీరు మూడురకాలుగా ఉంటారు:- (i) లా ప్రకారం సంరక్షకులు (ii) కోర్టుచే నియమింప బడినవారు (iii) వాస్తవానికి గార్డియనులు.

(i) లా ప్రకారం సంరక్షకులు రెండురకాలవారు

(a) సహజ సంరక్షకులు

(b) వీలునామా ద్వారా నియమింప బడినవారు.

ఈ క్రింది వరసక్రమంలో వారు బాలబాలికల ఆస్తికి సంరక్షకులు:-

(ఎ) తండ్రి [బి] తండ్రి వీలునామాలో సంరక్షకునిగా పేర్కొనబడిన వ్యక్తి [సి] తండ్రి తండ్రి (డి) తండ్రి తండ్రిచేత వీలునామా ద్వారా సంరక్షకునిగా నియమింప బడిన వ్యక్తి

కోర్టువారు మైనరు శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని సంరక్షకుని [గార్డియనును] నియమిస్తారు.

వాస్తవానికి సంరక్షకునిగా ఉన్నవారు కొన్ని ప్రతేక పరిస్థితుల్లో, అంటే మైనరు అవసరాలు తీర్చే నిమిత్తం, మైనరు యొక్క చరాస్తిని తాకట్టు పెట్టవచ్చు లేక అమ్మవచ్చు. కోర్టువారిచే నియమితుడైన సంరక్షకుడు కోర్టు అనుమతి లేనిదే మైనరు ఆస్తిని అన్యాక్రాంతం చేయరాదు. 'లా' ప్రకారం గార్డియనుగా ఉన్న వ్యక్తి కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో మాత్రమే మైనరు స్థిరాస్తి విషయమై కోర్టు అనుమతి లేకుండా వ్యవహరించగలడు.

స్త్రీలు తమ సంతానాల్ని కొంతకాలమే ఆధీనంలో ఉంచుకోగలరని, తమపిల్లల ఆస్తికి ఏ పరిస్థితుల్లోను సంరక్షకులుగా ఉండటానికి (కోర్టు నియమిస్తే తప్ప) వీలు లేదని తేలుతుంది. ఇది ఇస్లాంలో తల్లికి ఇచ్చిన స్థానం, బంగ్లాదేశ్‌లో, పాకిస్తాన్‌లో ముస్లిం వనితలు ప్రతిపక్ష పార్టీలకు నాయకులుగా ఉంటున్న ఈ కాలంలో, ముస్లిం స్త్రీలు ఉద్యోగాలు చేసి సంపాదిస్తున్న ఈ రోజుల్లో, పదవీ బాధ్యతలు నిర్వహిస్తున్న ఈ యుగంలో వారు తమ పిల్లలకు హక్కుగా సంరక్షకులుగా ఉండటానికి వీలు లేదనడం హాస్యాస్పదం.

క్రైస్తవులు : పార్శీలు :— వీరికి గార్డియన్ వార్డ్సయాక్టు వర్తిస్తుంది.

# 11. ఆస్తిహక్కు: వారసత్వం

## ఆస్తిహక్కు:

స్త్రీకి ప్రథమంగా ఆస్తి హక్కును కల్పించిన ఘనత హిందూ సమాజానికి దక్కింది 19, 20 శతాబ్దాలవరకు క్రైస్తవ వివాహిత స్త్రీయొక్క ఆస్థిపై పురుషునికేహక్కుఉండేదని, ఆమె సంపాదనను కొన్ని ఐరోపా దేశాలలో భర్తలు వసూలుచేసుకునే వారని మనంగ్రహిస్తేదీని గొప్పతనం స్పష్టపడుతుంది. ఈనాడు స్త్రీ తన స్వంత హక్కుగా ఆస్తినికలిగి ఉండటానికి అన్ని మత ధర్మ శాసనాలు అంగీకరిస్తున్నాయి.

## వారసత్వం:

స్త్రీకి బహువిధాలుగా వారసత్వరీత్యా ఆస్తిరావచ్చును. తల్లి, తండ్రి, భర్త, కుమారుడు, కుమార్తె,సోదరుడు కొన్నిపరిస్థితుల్లో మామ (భర్త తండ్రి )వీరివద్దనుండి ఆమెవారసత్వరీత్యా ఆస్తినిపొందవచ్చును. హిందూ ధర్మ శాస్త్రరీత్యా ఆమెకుచ్చు వాటాల సంగతి ఎలా ఉన్నా ఇపుడు 1956 నాటి హిందూ వారసత్వ శాసనం ప్రకారం మాత్రమే స్త్రీయొక్క వారసత్వ హక్కులు నిర్దేశింపబడుతున్నాయి.

ఈ శాసనం చేసిన మౌలికమయిన మార్పులు:-

(i) కొన్ని సందర్భాలలో కుమార్తెలను కుమారులను సమంగా చూచింది (షెడ్యూలు 1వ వర్గం) ఒక పురుషుడు చనిపోతే అతని స్వార్జితపు ఆస్తి విషయంగాను, మితాక్షర

కోపార్సనరీలో అతనివాటా ఆస్తివిషయంగాను వారసత్వ విషయంగా కుమారులు, కుమార్తెలు, తల్లి భార్య సమంగా పంచుకుంటారు.

(ii) కోపార్సనరీ కుటుంబంలో ఒక సభ్యుడు చనిపోతే 1937 కుపూర్వం ఆతని హక్కులు తతిమ్మా సభ్యులకు చెందేవి. ఆ నిబంధన కొంత మారింది 1937లో-ఇపుడు ఈ శాసనంవల్ల పూర్తిగా మారింది (సెక్షను 6)

(iii) పురుషుని ఆస్తికి వారసులను నాలుగు వర్గాలుగా చేసి ఒక వర్గం తరువాత మరో వర్గాన్ని వీలునామా వ్రాయకుండా చనిపోయిన అతనికి వారసులనుగా చిత్రించింది. (సెక్షను 8)

(iv) స్త్రీ స్వాధీనంలో ఉన్న ఆస్తికి స్త్రీకి సంపూర్ణ హక్కులు ఇచ్చింది. అలాగే, స్త్రీకి స్వాధీనానికి హక్కుగల ఆస్తి ఆమెకు వారసత్వంవల్ల సంక్రమించినా, మనోవర్తిగా వచ్చినా దానియందు ఆమెకు సర్వహక్కులు ఏర్పడతాయి. (సెక్షను 14)
(vi) 1956 పూర్వం స్త్రీయొక్క స్త్రీధనపు ఆస్తి కుమార్తెలకు చెందేవి. ఈ శాసనం వలన కుమారూలు కుమార్తెలు భర్త సమంగా పొందుతారు సెక్షను (15)
(vi) హిందూ పురుషుని ఆస్తికి స్త్రీలు కూడా వారసులైనపుడు పురుష వారసులు పంచుకునేవరకు కాపురపు ఇంటిని స్త్రీవారసు భాగపంపిణీ కోరరాదు. (సెక్షను 23)
(vii) వారసత్వం మొదలయినవిషయాలతో పునర్వివాహం చేసుకున్నస్త్రీ (ముందుగా చనిపోయిన కుమారుని విధవ. ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని వితంతువు, సోదరుని వితంతువు) పునర్వివాహంచేసుకొన్నచో ఆమెకు వారసత్వంగా ఆస్తిరాదు (సెక్షను 24)

(viii) ఎవరైనా ఏ వ్యక్తినైనా ఖూనీచేసినా, చేయటానికి సహాయం చేసినా ఆ చనిపోయిన వ్యక్తి ఆస్తికి అలాంటివారు వారసులు కారాదు. (సెక్షన్ 25)

(ix) ఏ వ్యక్తిఅయినా మతాంతరుడయితే అతని లేక ఆమెయొక్క సంతానం వారి సంతానం వారి హిందూబంధువుల ఆస్తులకు—ఆ సంతానం వారి సంతానం హిందువులయితే తప్ప—వారసత్వరీత్యా యజమానులు కాలేరు. (సెక్షన్ 26)

(xi) ఈ శాసనంలో పేర్కొన్న రీతిగా కాక ఏ వ్యక్తిఅయినా వ్యాధిలోపం, అంగవైకల్యం వలన వారసత్వానికి అనర్హతచేత బాధపడరాదు. (సెక్షన్ 28).

(xii) శాసనంలో పేర్కొనబడిన వారసులు ఎవరూ లేకపోతే ఆస్తి ప్రభుత్వానికి సంక్రమిస్తుంది. (సెక్షన్ 29)

పిత్రార్జితపు ఆస్తిలో కుమారులకు జన్మతః హక్కువున్న మితాక్షర పద్ధతిని ఈ శాసనం తీసివేయలేదు. పిత్రార్జితపు ఆస్థిలో పురుషుని వాటాను (అతడు అనాడు విభక్తుడుగా చనిపోయినట్లు భావించుకొని) శాసనపు షెడ్యూలులో 1వ వర్గం వారంతా

పంచుకుంటారు. కుమారుడు, కుమార్తె, భార్య, తల్లి, ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు, ముందుగా చనిపోయిన కుమార్తె కుమారుడు, ముందుగా చనిపోయిన కుమారుని కుమార్తె, ముందుగాచనిపోయిన కుమార్తె కుమార్తె, ముందుగా చనిపోయిన కుమారుని వితంతువు, ముందుగా చనిపోయిన కుమారుని, ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని కుమార్తె, ముందుగా చనిపోయిన కుమారుని ముందుగా చనిపోయిన కుమారుని వితంతువు షెడ్యూలు 1వ వర్గం వారసులు.

వీలునామా వ్రాయకుండా చనిపోయిన హిందూ పురుషుని ఆస్తి శాసనపు షెడ్యూలులోని 1వ వర్గంవారికి చెందుతుంది. వారూ లేకపోతే అతని రక్తసంబంధీకులైన ఇతరులకు చెందుతుంది (సెక్షన్ 8). 1వ వర్గంలోని వారసులు ఒక్కసారిగా ఆస్తిని తీసుకుంటారు. వారితరువాత 2వ వర్గంలోని 1వ వరుసవారికి వస్తుంది. తర్వాత 3వ వరుస తరువాత 4వ వరుస ఆదే క్రమం చివరివరకు వర్తిస్తుంది(సెక్షన్ 9) 1వ వర్గంలోని వారసులు ఈ విధంగా పంచుకుంటారు. చనిపోయిన అతనికి అనేక మంది భార్యలుంటే వారంతా కలసి ఒకవాటా తీసుకుంటారు. రూలు (1). తండ్రి చనియేనాటికి ఉన్న కుమారులు, కుమార్తెలు, తల్లి తలా ఒక వాటా తీసుకుంటారు (రూలు 2). ముందుగా చనిపోయిన కుమారుని లేక ముందుగా చనిపోయిన కుమార్తె శాఖలకు సంబంధించిన వారసులు వారంతా కలసి శాఖకు ఒక వాటా తీసుకుంటారు. (రూలు 3). ముందుగా చనిపోయిన కుమారునికి శాఖకు సంబంధించిన వాటాలో అతని వితంతువు ఒక వాటా, కుమారులు, కుమార్తెలు తలా ఒక వాటా పొందుతారు (రూలు 4 [i]). ముందుగా చనిపోయిన కుమార్తెకు శాఖకు సంబంధించిన వాటాలో ఆమె కుమారులు, కుమార్తెలు తలా ఒక వాటా తీసుకుంటారు (రూలు 4 [ii]) సెక్షన్ 10. షెడ్యూలు 2వ వర్గంలోని ఏవరుసలోని వారసులయినా సమానంగా తీసుకుంటారు (సెక్షన్ 11). సపిండులు, రక్తసంబంధీకుల వారసత్వ విధానం 12వ సెక్షన్‌లో చెప్పబడింది. వీలునామా వ్రాయకుండా చనిపోయిన పురుషుడికి అవిభక్త హిందూ కుటుంబంలో ఉన్న హక్కు (వాటా) అతని ఆస్తిగా ఎంచబడును. అంటే దానికి, అతని స్వార్జితపు ఆస్తికి 8వ సెక్షన్‌లో చెప్పబడిన వారసత్వ విధానం అమలులోకి వస్తుంది.

1986 లో హిందు వారసత్వానికి ఆంధ్రప్రదేశ్ శాసన సభ సవరణ తెచ్చింది. అది శాసనమయింది. దాని ప్రకారం కుమార్తెలకు కుమారులకువలె పిత్రార్జితపు ఆస్తిలో జన్మతః కుమారులతో సమానంగా హక్కు వచ్చింది. దీనివల్ల వచ్చిన మార్పులు పరిశీలిద్దాము.

ఒక పురుషుడు ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, తల్లి, భార్యలను వదలి చనిపోయినాడనుకుందాము. ఆ కుటుంబానికి పిత్రార్జితపు ఆస్తి ఉందని భావిద్దాము.

(i) కేంద్ర శాసన ప్రకారం:- అతని నాల్గవ వంతు వాటాను (చనిపోయేరోజున పిత్రార్జితపు ఆస్తిలో ముగ్గురు కుమారులకు అతనికి వాటా ఉంది. కనుక ఆనాడు అతడు విభక్తుడై చనిపోయినాడని భావిస్తే) అతని కుమారులు ముగ్గురు కుమార్తెలు ముగ్గురు, తల్లి, భార్య ఎనిమిది మంది పంచుకుంటారు.

భార్యకు $1/4 \times 1/8 = 1/32$

తల్లికి $1/4 \times 1/8 = 1/32$

కుమార్తెకు ఒక్కొక్కరికి $1/4 \times 1/8 = 1/32$

ముగ్గురు కుమార్తెలకు $3/32$

ఒక్కొక్క కుమారునికి జన్మతః $1/4(8/32)$ + వారసత్వరీత్యా $(1/4 \times 1/8 = 1/32)$

$8/32 + 1/32 = 9/32$ వస్తుంది.

ముగ్గురు కుమారులకు $3 \times 9/32 = 27/32$

(ii) ఆంధ్రప్రదేశ్ సవరణ చట్టం క్రింద:-

కుమారునికి గాని లేక కుమార్తెకుగాని

పిత్రార్జితపు ఆస్తిలో $1/7$.

చనిపోయిన వానివాటా (అనుకుందాం) $1/7$

వారసత్వరీత్యా

తల్లికి $1/8 \times 1/7 = 1/56$

భార్యకు $1/8 \times 1/7 = 1/56$

ఒక్కొక్క కుమార్తెకు $1/8 \times 1/7 = 1/56$

కుమార్తెకు జన్మతః $1/7 = 8/56$

కుమార్తె మొత్తం $1/56 + 8/56 = 9/56$

ముగ్గురు కుమార్తెలకు $3 \times 9/56 = 27/56$

కుమారునికి జన్మతః $1/7 = 8/56$

వారసత్వరీత్యా $1/56$ వెరశి $8/56 + 1/56 = 9/56$

ముగ్గురు కుమారులకు $3 \times 9/56 = 27/56$

అంటే తల్లికి $1/56$ భార్యకు $1/56$ సర్వహక్కులతో వస్తుంది.

(II) ఇదే పురుషుడి స్వార్జితపు ఆస్తి ఇలా వస్తుంది. పై చెప్పిన విధంగా ముగ్గురు కుమారులు ముగ్గురు కుమార్తెలు తల్లి, భార్య ఉందని తలుద్దాము. కుమార్తెలు కుమారులు, తల్లి, వితంతువు సమానంగా పంచుకుంటారు. తలా $1/8$ వంతు ఆస్తి వస్తుంది. ఆంధ్రప్రదేశ్ సవరణచట్ట ప్రకారం ఈ వాటాలలో మార్పు ఉండదు.

కుమారునికి జన్మతః ఉండే హక్కు తీసివేయాలని స్త్రీల హోదా కమిటీ వారు 1974 లో సూచించారు. కాగా అది జరగకపోగా ఆంధ్రప్రదేశ్ శాసనసభవారు కుమార్తెలకు కూడా జన్మతః హక్కు ఇచ్చారు. దీని ఫలితంగా వితంతువుకు, తల్లికి పిత్రార్జితపు ఆస్తిఉన్న పురుషుని ఆస్తిలో వారసత్వపు వాటాలు తగ్గిపోయాయి. పైన చెప్పిన ఉదాహరణ ప్రకారం భార్య వాటా 1/32 నుండి 1/56కు తగ్గుతుంది తల్లికీ అంతే.

iii) హిందూ స్త్రీ వీలునామా వ్రాయకుండా చనిపోతే ఆమె ఆస్తి కుమారులకు, కుమార్తెలకు. భర్తకువస్తుంది. ముందుగా చనిపోయిన కుమారుని సంతతి. ముందుగా చనిపోయిన కుమార్తె సంతతి కూడా వాటాలు పొందుతారు. వీరెవరూ లేకపోయినా భర్త మాత్రమేఉన్నా ఒక పరిస్థితిలో ఆస్తి భర్తకు రాదు. (సెక్షను 15). ఆ ఆస్తి ఆమెకు అంతకు క్రితం తండ్రి వల్ల వచ్చి ఉంటే తండ్రి వారసులకు వస్తుంది. (సెక్షను 15 (2) ఎ] అలాగే ఆస్తి ఆమె భర్తవల్ల మామ వల్ల వచ్చి ఉంటే పైచెప్పిన సంతతిలేనపుడు భర్తవారసులకు వస్తుంది. (సెక్షను 15 (2) బి]. స్త్రీధనం సంతానానికి భర్తకు ముందుగా- మామూలుగా- వస్తుంది. వారులేకపోతే భర్తవారసులకు, ఆ తర్వాత తల్లికి తండ్రికీ, వారూ లేక పోతే తండ్రి వారసులకూ వారులేకపోతే తల్లి వారసులకూ వస్తుంది. (సెక్షను 15 (1)]. పైన ఉటంకించబడిన ప్రత్యేక నిబంధనల వల్ల (సెక్షను 15 (2)] 'అందరికి ఒకేసూత్రం వర్తించాలి' అనేది దెబ్బతిన్నది.

కాపురపు ఇంటిని భాగపంపిణీచేసుకునే విషయంలో స్త్రీవారసుల యెడ వివక్ష ఉన్నది. అంతేకాక కాపురపు ఇంటిలో నివాసముండే హక్కు అవివాహిత కుమార్తెకు, వితంతువైనకుమార్తెకు , భర్తనుండి విడివడిన కుమార్తెకు పరిమితం చేసింది.

(2) ఏ హిందూ పురుషుడైనా స్త్రీ వారసుల హక్కులను త్రోసి రాజనటానికి వీలునామా వ్రాయవచ్చు. అది మంచి పద్ధతి కాదు. కనుక అలా చేయకుండా హిందూ పురుషుడు తన ఆస్తిలో కొంత మాత్రమే వీలునామా ద్వారా చెంద జేయనగును అని సవరించాలి.

ఈ పై సూచనలను స్త్రీల హోదా కమిటీ వారు 1974లో సూచించారు. హిందూ వారసత్వ శాసనంలో ఇలా మార్పులు రావలసి ఉన్నది.

హిందూ స్త్రీ వితంతువుగా, తల్లిగా, సోదరిగా, కొన్ని పరిస్థితులలో కోడలుగా వారసత్వరీత్యా ఆస్తిని పొందుతుంది.

## ఇస్లాం :-

మహమ్మదు స్త్రీలకు ఎంతో మేలుచేశాడు. ఆడ పిల్లలను చంపకుండా కట్టడి చేశాడు. వారికి వారసత్వ విషయంలో వెసులుబాట్లు కల్పించాడు. ఒక పురుషుడు

చనిపోయాడనుకోండి. అతని ఆస్తి పంపిణీని గురించి అనేక రకాలుగా ధర్మ సూత్రాలను చెప్పాడు. ముఖ్యమైనవి మనకు గమనార్హాలు నిశ్చితమైన భాగాన్ని పొందేవారిని భాగస్థులు (SHARERS) అని పేర్కొన్నాడు. మిగతా వారిని రెండు రకాలుగా విభజించాడు. (i) మిగతాది పుచ్చుకునే వారు (ii) దూరపు బంధువులు

ముస్లింలా సున్నీలకు వేరుగాను షియాలకు వేరుగాను ఉంటున్నది. భారతముస్లింలలో సున్నీలు అత్యధిక సంఖ్యాకులు. షియాల ధర్మశాస్త్రాన్ని ఇచ్చట పూర్తిగా వ్రాయటం లేదు.

నిర్ణీతమయిన వాటాలు పొందే వారిలో కొందరు:- 1 (ఎ) కుమారుడు కాని కుమార్తె కాని ఉన్నా లేక కుమారునికి, కుమారుని కుమారునికి బాల బాలికలున్నా భార్యకు భర్త ఆస్తిలో 1/8 వంతు వాటా వస్తుంది. అలాంటి వారు లేనపుడు భార్యకు 1/4 వంతు. అనేక మంది భార్యలుంటే పై పరిస్థితులను బట్టి వారందరికీ కలిసి 1/8 లేక 1/4 వంతు వస్తుంది.

ఒక స్త్రీ చనిపోయింది అనుకోండి. భర్త వాటా ఎంతో పరిశీలిద్దాం. కుమారుడు గాని కుమార్తె గాని ఉన్నా లేక కుమారుడు మనుమడు వీళ్ళ సంతానం ఉన్నా భర్తకు 1/4 వంతు వాటా అలా కాక పై చెప్పిన వారు ఎవరూ లేక పోతేభర్తకు 1/2 వాటా. ఇది సున్నీలకు వర్తించే ధర్మసూత్రం. షియా ధర్మసూత్రం ప్రకారం వాటాలు మారవు. కాగా చనిపోయిన మనిషి సంతానం, వారి సంతానం ఉంటే 1/4వాటా వారు లేకపోతే 1/2 వాటా.

అలాగే చనిపోయిన పురుషుడికి సంతానం, సంతానానికి సంతానండుంటే భార్యకు 1/8 అలాంటి వారు లేకపోతే 1/4 అనేక మంది భార్యలున్నా అందరికీ కలిపి 1/8 వాటా లేక 1/4 వాటాయే భర్త ఆస్తిలో భార్యకు వచ్చే వాటా. భార్య ఆస్తిలో భర్తకు వచ్చేవాటాలో సగం అన్నమాట.

భర్తవాటా = 2 × భార్యవాటా.

**(2) కూతుళ్ళు, కుమారులు :-**

[i] కుమారుడు లేనప్పుడు ఒక కూతురు ఉంటే ఆమెకు 1/2 వాటా కూతుళ్ళు ఉంటే అందరికి కలిపి 2/3 వంతు.

[ii] కుమారుడు లేక కుమారులు ఉంటే వారితో కలిసి ఖచ్చితమైన వాటాలు తీసివేసి మిగతా ఆస్తిని పంచు కుంటారు కమార్తెలు. ఈసూత్రం హనాఫీ, షియా శాఖలకు రెంటికీ వర్తిస్తుంది.

ఇక కుమార్తెలు, కుమారులు ఎలా పంచుకుంటారో చూద్దాం.

ఒక ముసల్మాను పురుషుడు చనిపోయాడు అనుకుందాం. అతనికి భార్య, ఒక కుమారుడు, ఒక కుమార్తె ఉన్నారు. అపుడు భార్యకు 1/8 వంతు మిగతాది 1-1/8 = 7/8. ఇందులో కుమారునికి 2/3 × 7/8 = 14/24 కుమార్తెకు 1/3 × 7/8 = 7/24 అంటే కుమారునికి కుమార్తెకన్నా రెట్టింపు వాటా.

ఒక కుమారుడు = ఇద్దరు కుమార్తెలు [వాటాల విషయంగా) అంటే ఒక పురుషుడు = ఇద్దరు స్త్రీలు.

చనిపోయిన వ్యక్తికి సంతానం, కుమారునికి సంతానం లేకపోతే తల్లికి 1/8 వంతు (కొన్ని పరిస్థితులకు లోబడి) చనిపోయిన వ్యక్తికి సంతానం, కుమారునికి సంతానం లేకపోతే తండ్రి వాటా దారుల వాటాపోను మిగతా దానికి ఇతరులతో పంచుకునే హక్కు పొందుతాడు. ఉదాహరణకు ఒక వ్యక్తి చనిపోయాడని భావిద్దాం. అతనికి భార్య, తల్లి తండ్రి ఉన్నారు అంటే సంతానం లేదు.

భార్యకు 1/4 మిగతాది 1-1/4 = 3/4.

తల్లికి 1/3 × 3/4 = 1/4

తండ్రికి మిగతాది అంటే 1-/1/4-1/4 = 1/2. అంటే తల్లికన్న తండ్రికి ఎక్కువ వస్తుంది.

అలాకాక తల్లి తండ్రి మాత్రమే ఉన్నపుడు, భార్యలు, సంతానం లేనపుడు తల్లికి 1/3 వంతు, మిగతాది 1—1/3 = 2/3 తండ్రికి ఇలా సర్వేసర్వత్రా 1 పురుషుడు = ఇద్దరు స్త్రీలతో సమానం అనే సూత్రం (ఒక్క తల్లితండ్రి విషయలలో తప్ప) సర్వత్రా వర్తిస్తుంది.

ఇదే సూత్రం అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్ళకూ వర్తిసుంది. ఇది ఎంతవరకు సబబో అందరూ ఆలోచించాలి.

## క్రైస్తవం:-

భారత క్రైస్తవులకు భారతీయ వారసత్వం శాసనం (1925) వర్తిస్తుంది. 5వ భాగం 2వ అధ్యాయం అమలులోకి వస్తుంది. క్రైస్తవుడు వీలునామా వ్రాయకుండా చనిపోతే అత్తని భార్యకు అతని ఆస్తిలో (ESTATE) వాటా వస్తుంది. అయితే పెండ్లికి ముందు చెల్లుబడి అయ్యే వాటా రాదనే కంట్రాక్టు చేసుకొనియుంటే ఆమెకు అతని 'ఎస్టేట్'లో వాటా రాదు. (సెక్షను 32). ఒక పురుషుడు చనిపోయే నాటికి అతనికి భార్య సంతానం ఉంటే భార్యకు $^1/_3$ వంతు వాటా వస్తుంది. మిగతా

మూడింట రెండువంతుల ఆస్తి సంతానానికి (కుమార్తెలకు, కుమారులకు) చెందుతుంది [సెక్షను 33 (a)]. అతనికి సంతానం లేక భార్య, దగ్గరి బంధువులు మాత్రం ఉంటే మరియొక నిబంధన అమలులోకి రానపుడు ఆమెకు సగం ఆస్తి వస్తుంది. మిగతా సగం సమీప బంధువులకు పోతుంది. [సెక్షను 33 (b)] చనిపోయిన సమీప బంధువులు లేకపోతే మొత్తం ఆస్తి ఆమెకు చెందుతుంది. [సెక్షను 33 (సి)]. ఈ పైరెండు నిబంధనలు చనిపోయిన అతడు మొత్తం ఆస్తికి వీలునామా వ్రాయకుండా చనిపోతేనే వర్తిస్తుంది. చనిపోయిన అతనికి భార్య లేకపోతే అతని ఎస్టేట్ అతని సంతానానికి పోతుంది. సంతానం కూడా లేకపోతే దగ్గరబంధువులకు సంక్రమిస్తుంది (సెక్షను 34). పురుషుని ఎస్టేట్‌లో అతని భార్యకు ఎటువంటి హక్కులున్నాయో అలాంటి హక్కులే అతని భార్య ఎస్టేట్‌లో భర్తకు ఉన్నాయి (సెక్షను 35).

చనిపోయిన అతనికి భార్య, ఒక కుమార్తె లేక కుమారుడు మాత్రమే ఉంటే భార్య వాటా పోను మిగతా ఆస్తి ఆ ఒక్క సంతానానికి సంక్రమిస్తుంది. ఎక్కువ మంది సంతానం ఉంటే వారందరు భార్య వాటా పోను మిగతా దానిని సమానంగా పంచుకుంటారు. అయితే ఈ పై రెండు నిబంధనలు అతనికి ముందుగా చనిపోయిన కుమారుడు లేక కుమార్తె ద్వారా మనుమలు మనుమరాండ్రు లేనపుడే పని చేస్తాయి. (సెక్షను 37). అలాగే అతడు భార్యను, సంతానం లేకుండా మనుమలను మనుమరాండ్రను వదలి చనిపోతే-అంతకుముందు చనిపోయిన మనుమనికి మనుమరాలికి సంతానం లేకపోతే-భార్య వాటా పోను మిగతా ఆస్తిని బ్రతికివున్న ఆ ఒక్క మనుమడు లేక మనుమరాలు తీసుకుంటారు. ఆలాకాక ఎక్కువ మంది మనుమలు, మనుమరాండ్రు ఉంటే వారందరూ సమానంగా తీసుకుంటారు (సెక్షను 38). అదే విధంగా ముని మనుమలను, ముని మునుమరాండ్రను లేక వారి సంతానం ఉంటే పై చెప్పిన విధంగా (భార్య వాటా పోను, ఆమె బ్రతికి ఉంటే) అతని ఆస్తిని ముని మనుమలు, మనుమరాండ్రు సమానంగా పంచుకుంటారు (సెక్షను 39). చనిపోయిన అతనికి ఉదాహరణకు ఇద్దరు సంతానం ముందుగా చనిపోయి ఒక కుమారుడు లేక ఒక కుమార్తె కలిగి ఉంటే బ్రతికియున్న కుమారుడు లేక కుమార్తెకు $1/3$ (భార్య వాటా పోను), చనిపోయిన సంతానపు సంతానానికి వారి తండ్రి లేక తల్లి వాటా ఒక్కొక్క శాఖకు $1/3$ వస్తుంది. (సెక్షను 40). అలాగే మనుమలు మనుమరాండ్రు లేక ముని మనుమలు ముని మనుమరాండ్ర విషయంలో కూడా జరుగుతుంది. చనిపోయిన వ్యక్తికి భార్య/భర్త లేక సంతానం లేకపోతే అతని/ఆమె ఆస్తి తండ్రి బ్రతికియుంటే అతనికి సంక్రమిస్తుంది. [తల్లికి కాదు సుమండీ] [సెక్షను 41]. చనిపోయిన వ్యక్తికి తండ్రి లేకపోయి, భార్య, సంతానం కేవలం తల్లి, సోదరుడు/సోదరులు సోదరి/సోదరీలు మాత్రం ఉంటే-ముందుగా చనిపోయిన సోదరునికి సోదరికి సంతానం లేకపోతే- ఆస్తి తల్లికి బ్రతికి ఉన్న సోదరీ సోదరులకు వస్తుంది. [సెక్షను 43]

ముందుగా చనిపోయిన సోదరి, సోదరుని సంతానానికి వారి తల్లి/తండ్రి యొక్క వాటా [వారు బ్రతికి యున్నట్లే ఎంచి] వస్తుంది సెక్షను 44]. తల్లి మాత్రం బ్రతికి ఉండి సోదరీ సోదరులు లేకపోయి వారి సంతానం మాత్రం ఉంటే ఆమె చనిపోయిన సోదరీ సోదరుల శాఖలతో సమానంగా ఆస్తిని తీసుకుంటుంది [సెక్షను 45]. చనిపోయిన అతనికి తండ్రి లేక తల్లిమాత్రం బ్రతికిఉండి, సోదరీసోదరులు లేకపోతే- లేక ముందుగా చనిపోయిన సోదరీసోదరుల సంతానం లేకపోతే- ఆస్తి తల్లికి పూర్తిగా చెందుతుంది. [సెక్షను 46]. చనిపోయిన అతనికి తల్లి తండ్రి [భార్య ఉంటే భార్య వాటా పోను] లేక కేవలం సోదరీసోదరులు లేక ముందుగా చనిపోయిన సోదరీసోదరుల సంతానం ఉంటే అపుడు బ్రతికి ఉన్న సోదరీసోదరులు, చనిపోయిన సోదరీ సోదరులు వారి సంతానం వారి శాఖలను బట్టి [వారి తల్లిదండ్రులు బ్రతికి ఉన్నట్లే ఎంచుకుని] అంతా కలిసి మొత్తం సోదరీసోదరులు సమానంగా ఆ ఆస్తిని తీసుకుంటారు [సెక్షను 48].

పై సూత్రాలను బట్టి తేలిన అంశాలు:-

(i) భార్యనుచిన్నచూపు చూడటం. చనిపోయిన అతని సోదరీ సోదరులకు కూడా వాటాపెట్టి ఆమెవాటా సగానికి పరిమితం చేయటం, చనిపోయిన అతనికి సంతానం ఉన్నపుడు ఆమెకు $1/_3$వంతు మాత్రం ఇవ్వటం అన్యాయం.

(ii) సంతానం లేకుండా చనిపోయిన అతనికి తండ్రి బ్రతికి ఉంటే తల్లికి ఏమీ ఆస్తిరాదు. తల్లిని అన్యాయం చేయటం గమనించవలసి యున్నది.

(iii) కాగా కుమారులు కుమార్తెలమధ్య, మనుమలు మనుమరాండ్రమధ్య, సోదరీ సోదరులమధ్య వివక్ష లేదు.

ఇదంతా భార్యలకు విలువ ఇవ్వని పురుష ప్రాధాన్యత కల సమాజంయొక్క అవశేషం.

1925లో ఆమోదింప బడిన ఈ శాసనం ఇంతవరకు సవరణ కాలేదు మౌలికంగా. ద్రవ్యోల్బణం వచ్చి రూపాయ విలువ 1925 లెక్కల ప్రకారం 2పైసలకు తగ్గి పోయిన ఈ రోజుల్లో 5000 రూపాయల నిబంధన ఇంకా ఉంచటం అవివేకం. [సెక్షను 33ఎ].

## పార్శీమతం:

వీలునామా వ్రాయకుండా చనిపోయిన పార్శీవ్యక్తి ఆస్తికి సంబంధించిన నిబంధనలు 1925 భారత వారసత్వపు శాసనం 5వ విభాగంలోని 3వ అధ్యాయంలో పేర్కొనబడినాయి. మున్ముందుగా కొన్ని సామాన్య సూత్రాలను పేర్కొనాలి. (i) చనిపోయిన అతని జీవిత కాలంలో జన్మించిన వారికి, అప్పటికి తల్లి గర్భంలో ఉన్న వారికి తేడాలేదు. (ii) చనిపోయిన వ్యక్తి యొక్క సంతానం, సంతానపు సంతానం

వగైరాలతో ఎవరైనా భార్యను, భర్తను లేక సంతానాన్ని వదలకుండా చనిపోయిన వ్యక్తి మరణకాలానికి ముందుగా చనిపోతే వారిని ఆస్తి పంపకంలో లెక్కలోకి తీసుకోరు. (iii) చనిపోయిన వ్యక్తియొక్క బంధువులలో ఏ వితంతువు అయిన చని పోయిన వ్యక్తి జీవిత కాలంలో పునర్వివాహం చేసుకుంటే ఆమెను పరిగణించరు; ఆమెకు ఆస్తి ఏమాత్రం రాదు.(సెక్షను 50)

పార్శీ పురుషుడు చనిపోయేనాటికి అతని తల్లి లేక తండ్రి లేక ఇరువురు, సంతానం, భార్య బ్రతికి ఉంటే తండ్రికి కుమారుని వాటాలో సగం, తల్లికి కుమార్తె వాటాలో సగం వస్తుంది [సెక్షను 51 (2)] ఈ సూత్రానికి లోబడి ఆస్తిని ఇలా పంచుతారు. భార్యను, పిల్లలను వదలిపోతే కుమారునికి, వితంతువుకు ఒకొక్కరికి కుమార్తె కన్నా 2 రెట్లు వాటా ఇవ్వాలి. [సెక్షను 51 (i)(a)]. సంతానం మాత్రం ఉండి వితంతువు లేకపోతే కుమారునివాటా కుమార్తె వాటకు రెండింతలు [సెక్షను 51 (i)(b)].అంటే తల్లి ఇద్దరు కుమార్తెలతో సమానం. కుమారుడు ఇద్దరు కుమార్తెలతో సమానం. రెండవ సూత్రం అన్యాయం, అక్రమం. పూర్తిగా పురుషాధిపత్య చిహ్నం. కేవలం వివక్షతో కూడియున్నది.

పార్శీ స్త్రీ వీలునామా వ్రాయకుండా చనిపోతే భర్త సంతానం ఉంటే ఆస్తి ఈ దిగువ విధంగా సంక్రమిస్తుంది. భర్త, సంతానం ఉంటే భర్త కుమారులు కుమార్తెలు సమానంగా పంచుకుంటారు. అలా కాక భర్త లేకపోయి కేవలం సంతానం ఉంటే సంతానం సమానంగా తలా ఒకవాటా తీసుకుంటారు. (సెక్షను 52). ముందుగా చని పోయిన కుమారునిద్వారా లేక కుమార్తెద్వారా మనుమలు మునిమనుమలు ఉంటే ఏమీ చేయాలో 53,54 సెక్షనులలో చెప్పబడింది.

పార్శీవ్యక్తి చనిపోయేనాటికి భార్య, భర్త, సంతానం, సంతానపు సంతానం వగైరా వారి భార్య/భర్త లేకుండా చనిపోతే ఆస్తి శాసనంయొక్క 2వ షెడ్యూలులోని 2వ భాగంలోని వరుసలనుబట్టి సంక్రమిస్తుంది. ఉదాహరణకు పై పరిస్థితిలో తల్లి తండ్రి మాత్రం ఉన్నారనుకుందాము. ఆస్తివారికి సంక్రమిస్తుంది. కాగా పురుషుని వాటా స్త్రీవాటాకు రెట్టింపు ఉంటుంది కనుక తండ్రికి $^2/_3$ వంతు, తల్లికి $^1/_3$ వంతు తల్లిదండ్రులు 2వ విభాగపు మొదటివరుసలో ఉన్నారు. మొదటి వరుసవారి తర్వాత రెండవ వరుసవారు, అలా సాగిపోతుంది 18వరుసలదాకా పార్శీవ్యక్తికి పైన చెప్పిన పరిస్థితిలో తండ్రీ కూడా లేకపోతే సోదరీ సోదరులు [కేవలం తల్లి ద్వారా కాక] చనిపోయిన వ్యక్తికి ముందుగా సోదరీ సోదరుల సంతానం [వారి శాఖకు ఒక వాటా చొప్పున] సమానంగా పురుషునికి స్త్రీ వాటాకన్నా రెండురెట్ల వాటా అనే సూత్రానికి లోబడి పంచుకుంటారు.

తేలిన అంశాలు: [ఎ] పురుషుని ఆస్తిలో

(i)కుమారుడు = ఇద్దరు కుమార్తెలు.

(ii)తల్లివాటా = కుమార్తె వాటాలో సగం.

(iii) తండ్రివాటా = కుమారుని వాటాలో సగం

= కుమార్తెతో సమానము

(బి) తల్లి ఆస్తిలో కుమారులకు కుమార్తెలకు సమానం

(సి) పార్శీ పురుషుడు లేక స్త్రీ ఆస్తిలో సంతానం, భార్య భర్త లేనపుడు పురుషుని వాటా = స్త్రీ వాటాకు రెట్టింపు.

ఇది పురుష ప్రాధాన్యత కల సమాజపు తీరు, అంతేకాదు తల్లికి తీరని అన్యాయం. భార్య యెడ కొంతగా కొంత చిన్నచూపు.

**అన్నిమతాలకు సంబంధించి :** (1) ఏభార్యఅయితే భర్తఆస్తిని, సంపాదనను పదిలపరిచిందో, వృద్ధి పొందడానికి దోహదంచేసిందో, ఏవ్యక్తి లేకపోతే సంతానంకలుగదో ఏవ్యక్తి భర్తకు సర్వవిధాల సహచరిగా, స్నేహితురాలిగా, ప్రియురాలుగా, భార్యగా సేవచేసిందో ఆవ్యక్తికి సరియైన వాటా ఇవ్వకుండా సంతానానికి ఆస్తి కట్ట పెట్టడం అన్నిమతాల ధర్మశాసనాలుచేసిన ఘోరం. హిందూమతం కుమారులకు (ఆం. ప్ర.లో కుమార్తెలకు కూడా) జన్మతః పిత్రార్జితపు ఆస్తిలో హక్కులిచ్చి, చనిపోయినవాని కొద్దిపాటి వాటాను (ఆయన విభక్తుడుగా చనిపోయాడని న్యాయశాస్త్రపు అంచనా వేసు కొని) మరల తల్లికీ, భార్యకూ సంతానానికి సమానంగా పంచింది. ఇస్లాం భార్యకు నిర్దిష్టమైన వాటా (1/8 లేక 1/4) ఇచ్చింది. క్రైస్తవం-సంతానం ఉన్నపుడు భార్యకు 1/3 వంతు, సంతానం లేనపుడు 1/2 ఇచ్చింది. పార్శీమతశాసనంప్రకారం-కుమారునితో సమంగా ఇద్దరు కుమార్తెలతో దీటుగా వాటా ఇచ్చింది. అంటేభార్యను నిరాదరణచేయటం జరిగిందన్నమాట. సంతానంకన్న ఆమెకి తక్కువస్థాయి అన్నమాట. దీనివిషయం విజ్ఞులు ఆలోచించాలి.

[ii] ఇస్లాం మత ధర్మశాసనం 641 **A.D** నాటిది. క్రైస్తవ వివాహశాసనం 1872 నాటిది; విడాకుల శాసనం 1569 నాటిది క్రైస్తవులకు పార్శీలకూ వర్తించే భారతీయ వారసత్వ శాస్త్రం 1925 నాటిది. ఇంత పురాతనపు శాసనాలతో ఆధునిక సమాజాన్ని ఎలా నియంత్రణం చేయటం? అభ్యుదయ సాధనకు, దేశపురోగతికి, వ్యక్తి వికాసానికి ఇవి నిరోధాలుగా ఉంటున్నాయి. ఇవి మారాలి; మార్చాలి.

# 12. ముగింపు

మతధర్మ శాసనాలు సర్వసామాన్యంగా న్యాయవ్యతిరేకంగాను, ముఖ్యంగా స్త్రీలయెడ వివక్షతోను ఎలా రూపొందించ బడినాయో గ్రహించాము. మతాలు పురుష ప్రాధాన్యతకు సమాజాలలో ఉద్భవించాయని, భూస్వామ్య పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలను సమర్థించి పోషిస్తున్నాయని, మతధర్మశాసనాల న్యాయసూత్రాల వెనుకయున్న విలువలు ,ఆలోచనలు సమాజాన్ని ముందుకు పోనీయకుండా అవరోధాలు కల్పిస్తున్నాయని, అన్నింటికన్నా ముఖ్యమైనది దేశప్రజలలో చీలికలు, విభజనలు వేర్పాటులు కల్పించి వాటికి శాశ్వతం కలుగ జేసిదేశ ఆనైక్యతకు దోహదం చేయడమే కాకుండా మానవాళిలో వివక్ష విధానాన్ని ప్రవేశ పెట్టున్నాయని మనం తెలుసుకోవాలి. ఆనాడు దేశ ప్రజలందరికీ హోదా, వివాహం, విడాకులు మనోవర్తి, సంరక్షకత్వం, దత్తత, ఆస్తి హక్కు, వారసత్వం మొదలగు విషయాలలో దేశ ప్రజలందరికి వర్తించే ఒకే ఒక వ్యవహార సంహితను రూపొందించటం అవసరమూ, న్యాయమూ కూడాను. ఈ అంశాన్ని రాజ్యాంగ నిర్మాతలు గుర్తించి ఒకే ఒక వ్యవహార సంహితను తయారుచేయడం రాజ్యం యొక్క విధి అని రాజ్యాంగం యొక్క ఆదేశ సూత్రాల అధ్యాయంలో 44వ అధికరణంలో స్పష్టంగా పేర్కొన్నారు. ఆ ప్రయత్నాన్ని చేయకపోగా అందరికీ వర్తించే క్రిమినలు ప్రొసీజరు కోడ్ లాంటి శాసనాల పరిధి నుండి ఒకమతాన్ని —ఇస్లాంను— తొలగించారు. ఇది తిరోగమన సూచకం.మతతత్వవాదానికీ, వేర్పాటువాదానికి పరోక్షంగా బలం చేకూర్చటం. ఏమతానికి చెందని వారికి మాత్రం ఒకే ఒక వ్యవహార సంహిత తయారుచేస్తారట. ఇది రాజ్యాంగ విరుద్ధం. 44వ అధికరణంలో పేర్కొన్న దానికి విరుద్ధం. రాజ్యాంగ సూత్రాలకు, విశ్వ మానవ హక్కుల ప్రణాళికకు భంగపాటు కల్గించటం.

ఒకే ఒక వ్యవహార సంహిత కోసం-అందరు ప్రజలకు వర్తించేలా ప్రచారం చేయటం, ప్రబోధం చేయటం, ప్రజాభిప్రాయాన్ని సృష్టించటం, తయారుచేయటం ఆవశ్యకర్తవ్యం. అవి విశ్వ మానవ హక్కుల ప్రణాళికకు అనుగుణంగా ఉండాలి. కాని ఏ ఒక్క మత ధర్మ శాసనానికి లేక వాటి సూత్రాలకు పాబల్యం కలుగజేసేవిగా ఉండరాదు. తద్వారానే స్త్రీ విమోచన సాధ్యం కాగలదు. ఇదే కేంద్ర ప్రభుత్వం చేత నియమింపబడిన స్త్రీల హోదా కమిటీ (1974) వారి అభిప్రాయం.

# అనుబంధం:-

[i] ప్రత్యేక వివాహ శాసనం [1954] దాని క్రింద వివాహం చేసుకునే వారికి వర్తిస్తుంది. ఏ మతానికి చెందిన వారయినా స్త్రీ పురుషులు దీని క్రింద ప్రభుత్వంచేత నియమింపబడిన రిజిష్ట్రారు ఎదుట వివాహమాడ వచ్చును. వారు సంతకాలు చేసిన దరఖాస్తును వివాహ సమయానికి 30 రోజులు తక్కువ కాని వ్యవధితో రిజిష్ట్రారుకు ఇవ్వాలి. వారు అవివాహితులు గానో లేక విడాకులు పొందిన వారు గానో లేక వితంతువు, విధురుడు గానో ఉండాలి. వయస్సు పురుషునికి 21 సం॥ వధువుకు 18సం॥ నిండాలి. పెండ్లిరోజున ముగ్గురు సాక్షులతో రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్ళి,తమ వయస్సును రుజువు చేసే దస్తావేజులు చూపించి, రిజిస్ట్రారు ఇచ్చే ప్రమాణాలు చేసి, రిజిష్టరులో సంతకాలు చేసి, ముగ్గురు సాక్షులచేత దస్కతులు చేయించి వివాహం పూర్తి చేసుకో వచ్చును. (సెక్షను 13) రిజిస్ట్రారు వారు వివాహ ధృవ పత్రం ఇస్తారు. ఏదో పెండ్లి తంతును జరుపుకొని, ఆలుమగలుగా జీవిస్తున్న స్త్రీ పురుషులు పెండ్లిని రిజిష్టరు చేయమనే దరఖాస్తును సెక్షను 15 క్రింద దాఖలు చేయవచ్చును. పురుషునికి స్త్రీకి ఇరువురికి 21 సం॥ వయస్సు నిండాలి. పెండ్లి తంతు ఇద్దరికీ ఒకటే.

(ii) ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహం చేసుకున్న వారి విడాకుల హక్కులు, విడిగా ఉండే ఏర్పాటు, కాపురానికి రమ్మనమనే హక్కు, మనోవర్తి ఇవన్నీ ఆ శాసనంలోనే పొందు పరచబడినాయి.

(iii) ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహం చేసుకున్న పురుషుడు లేక స్త్రీ అవిభక్త హిందూ కుటుంబంలో నుండి విడివడటం జరుగుతుంది. వారు పెండ్లి నాడే విభక్తులుగా పరిగణింపబడతారు.

[iv] ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహ మాడిన వారికి వారసత్వ విధానాలు భారత వారసత్వ చట్టం [1925) లోనే పొందు పరచబడినాయి. 5వ విభాగం 2వ అధ్యాయం వీలునామా వ్రాయకుండా చనిపోయిన అట్టి వారికి వర్తిస్తుంది.తతిమ్మా కొన్ని భాగాలలో వీలునామా వ్రాసిన వారికి వర్తించే నిబంధనలు ఉన్నాయి,

(v) సంరక్ష కత్వానికి సంబంధించిన సూత్రాలు 'గార్డియన్స్ అండ్ వార్డుస్ ఆక్టు' [1890] లో వాయబడినయి.

[vi] దత్తతకు సంబంధించి శాసనం ఇంకా పుట్టలేదు.

ఇలా ఏమతానికి చెందని, చెందినా ప్రత్యేక శాసనాల పరిధిలోకి వచ్చేవారికి వర్తించే శాసనాలను గురించి సమగ్రంగా, సాకల్యంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.